పల్లవి

# గమ్యం

'అంతా సరిగ్గానే ఉంది'
అనుకునే సమయంలో
అంతులేని అభద్రతాభావం తొంగిచూస్తే
దిగులు తలదిండుగా మారిపోతుంది
కొంతమాత్రంగా ఉన్న కొరతకు
కొండంత ప్రాధాన్యత ఇస్తే
వామనుడి మూడో పాదంలా
అది నిన్ను నైరాశ్యంలోకి నెట్టేస్తుంది
ఆకాశం నిండా
కారుమబ్బులు కమ్ముకున్నప్పుడు
చేతిలో గొడుగు లేదని గుర్తొస్తే
గుబులే గుబులు
తడిసిపోవాలనే కోరికే ఉంటే
తనివితీరే ఆనందం
ఉచిత వస్తువే కదా!
అన్వేషిస్తేనే ఆవేదన
వెతికి చూస్తేనే వెలితి
తరచి చూస్తే తరిగే తృప్తికి
క్షీణ ప్రతిఫల సూత్రం వర్తిస్తుంది
ఇంకొకరికి లేని
నీకు మాత్రమే ఉన్న
వెసులుబాటు ఏదో గమనించి చూడు
నువ్వు పయనించే మార్గం
ఏ గమ్యానికి చేరుతుందో తెలిసిపోతుంది!

- సోమిశెట్టి వేణుగోపాల్ (కరీంనగర్)

ఎవరేమన్నా
ఎలాంటి పరిస్థితులు ఎదురైనా
ఆమె లెక్కచెయ్యలేదు
ఇచ్చిన మాట నిలబెట్టుకోవడం ముఖ్యం
అతడ్ని బాగా చదివించాలన్నదే
ఆమె ముందున్న ధ్యేయం
తన ఆశల్ని వదులుకుని
కోర్కెలను అణచుకుని
ఆమె కొవ్వొత్తిలా కరిగిపోయింది
అంతటి త్యాగానికి ఆమెకు
చివరికి మిగిలిందేమిటి?
ప్రేమానురాగాలను
ఆత్మీయ బంధాలను
అందంగా చిత్రించిన

సలీం సీరియల్

# కావ్యాంజలి

త్వరలో...!

ఆంధ్రభూమి వారపత్రిక నవలల పోటీలో సాధారణ ప్రచురణకు ఎంపికైన రచన!

పాఠకులను అలరించడంలో అగ్రగామి

ఎడిటర్ : టి.వెంకట్రామ్ రెడ్డి
అసిస్టెంట్ ఎడిటర్ : ఎ.ఎస్. లక్ష్మి

సంపుటి 41 సంచిక 23
30 నవంబర్ 2017

ఆంధ్రభూమి
సచిత్ర వార పత్రిక

## కవర్‌పేజీ కబుర్లు

### జాక్వెలిన్ ఫెర్నాండెజ్



పరభాషా తారలు వివిధ భారతీయ భాషా చిత్రాల్లో నటిస్తున్నట్టే పరదేశీ తారలు సైతం భారతీయ చిత్రాల్లో నటిస్తూ తమదైన గుర్తింపును తెచ్చుకుంటున్నారు. అలాంటివారిలో శ్రీలంక నుంచి వచ్చిన జాక్వెలిన్ ఫెర్నాండెజ్‌ను కూడా ప్రముఖంగా చెప్పకోవాలి. కొన్ని బాలీవుడ్ చిత్రాల్లో నటించిన జాక్వెలిన్ ఒకటి రెండు ఇంగ్లీషు చిత్రాల్లోనూ కనిపించింది. 'ఝలక్ దిఖ్‌లాజా' హిందీ టీవీ డాన్స్ షో సీజన్-9లో న్యాయనిర్ణేతగానూ వ్యవహరించి భారతీయ ప్రేక్షకులకు చేరువైంది. అంతేకాకుండా అనేక యాడ్ ఫిలింస్‌లలో కూడా జాక్వెలిన్ తరచూ టీవీ చానళ్లలో కనిపిస్తూ సెలబ్రిటీగా తనదైన ముద్రను వేసుకుంది.

## లోపలి పేజీల్లో...

### కలర్ ఫీచర్స్



### సీరియల్స్











# కథలు





22

# ఇంకా...





60



81

బిట్స్: టి.ఆర్.ఆర్.

## చందా

○విడిప్రతి - రు.15, ○పోస్టుద్వారా- సంవత్సర చందా రు. 800
○6 నెలల చందా- రు. 400

**విదేశాలకు:** ఆర్డినరీ ఎయిర్ మెయిల్ ద్వారా...
సంవత్సర చందా రు. 6500/-, 6 నెలల చందా రు. 3250/-

మీ డి.డిలను Deccan Chronicle Holdings Limited అన్న పేరు మీద తీసి ఈ క్రింది చిరునామాకి పంపించండి.


**జనరల్ మేనేజర్,**
**మార్కెటింగ్**
**ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక**
**36, సరోజినీ దేవి రోడ్, సికిందరాబాద్-500003,**
**మార్కెటింగ్ ఫోన్ : 040-27807821/23**


● ఆంధ్రభూమి వార, మాస పత్రికలకి చందా కట్టాలనుకుంటున్నారా?
● ఇప్పటికే చందా కట్టినా పత్రికలు సరిగ్గా అందడం లేదా?
● మీరున్న ఊళ్ళో ఆంధ్రభూమి వార, మాస పత్రికలు దొరకడం లేదా?
వీటిలో మీ సమస్య ఏదయినా 040-27807821/23 కి ఫోన్ చేసి చెప్పండి.
లేదా... dchl.gm@gmail.comకి మీ పేరు, చిరునామా, ఫోన్ నెంబరు వివరాలతో ఒక మెయిల్ పెట్టండి.


**ఎడిటోరియల్ ఫోన్ : 040-27802346, 27803930 Extn. 304**

●**కార్పొరేట్ ఆఫీస్:** డెక్కన్ క్రానికల్ హోల్డింగ్స్ లిమిటెడ్
36, సరోజినీ దేవి రోడ్, సికిందరాబాద్-500 003, ఫోన్స్: 040-27803930 (5 లైన్లు)
27805392, 27805393, 27805397 (అడ్వర్టయిజ్‌మెంట్)
●**విజయవాడ:** ఇండస్ట్రియల్ ఎస్టేట్ ఆటో నగర్, పటమట, విజయవాడ-520 007
ఫోన్స్: 0866-2555284, 2555287, ఫాక్స్: 0866-2555234
●**విశాఖపట్నం:** బీచ్ రోడ్, సెక్టర్ 9, ఎం.వి.పి.కాలనీ, విశాఖపట్నం-530017
ఫోన్: 0891-2552333/4, ఫాక్స్: 0891-2755285, 2552738
●**రాజమండ్రి:** వేమగిరి, ధవళేశ్వరం రోడ్, రాజమండ్రి
ఫోన్స్: 0883-2417208, 2417618, టెలిఫాక్స్: 0883-2417208
●**అనంతపురం:** తపోవన్ కాలనీ, బెంగుళూరు బైపాస్ రోడ్, అనంతపురం-515 004
ఫోన్: 08554-276904, ఫాక్స్: 08554-276905
●**కరీంనగర్:** సర్వే నం.1341, వావిలాలపల్లి కాలనీ, జగిత్యాల రోడ్, కరీంనగర్-500 505
ఫోన్: 0878-2228908, ఫాక్స్: 0878-2228770
●**నెల్లూరు:** సర్వే నం.527/2, బురాన్‌పూర్ విలేజ్, వెంకటాచలం, చెముడుకుంట పోస్ట్,
నెల్లూరు-524 004, ఫోన్: 0861-2348581/82, ఫాక్స్: 0861-2348580

○○○ ○○○ ○○○

●**చెన్నయ్:** ఎస్‌పి-3, డెవలప్డ్ ప్లాట్, ఇండస్ట్రియల్ ఎస్టేట్, గిండీ, చెన్నయ్-600 032
ఫోన్: 044-22254747/48/50/51, అడ్వర్టయిజ్‌మెంట్: 22254765
ఫాక్స్: 044-22254766, 42305325
●**బెంగుళూరు:** ఫిఫ్త్ ఫ్లోర్, బి.ఎమ్.టి.సి. కమర్షియల్ కాంప్లెక్స్, 80 ఫీట్ రోడ్, కోరమంగళ,
బెంగుళూరు-560 095, ఫోన్: 080-43460500, ఫాక్స్: 080-22960552
●**ముంబయ్:** సెకండ్ ఫ్లోర్, హెచ్ -వింగ్, పారగాన్ కండోమినియమ్,
పాండురంగ్ బుధాకర్ మార్గ్, వర్లి, ముంబయ్-400 013
ఫోన్: 022-24955825-28, 24904409, ఫాక్స్: 022-24955834, 24965847
●**న్యూఢిల్లీ:** ఎస్-7 అండ్ 8, గ్రీన్ పార్క్, మెయిన్ మార్కెట్, న్యూఢిల్లీ-110 016,
ఫోన్: 011-26530001-3, ఫాక్స్: 011-26530030



# పాఠకుల మాట

డియర్ రీడర్స్!

ఆంధ్రభూమి శీర్షికలను ప్రశంసిస్తూ పరిశీలనాత్మకంగా మీరు రాసిన ఉత్తరాలు మా కార్యాలయానికి సకాలంలో చేరాయి. అందరికీ మా హృదయపూర్వక కృతజ్ఞతలు. ఇక ఈ వారం అంశాల్లోకి వస్తే... ఆద్యంతం ఉత్కంఠ రేకెత్తించే 'సన్‌సెట్ బౌల్‌వార్డ్' హాలీవుడ్ థ్రిల్లర్‌ని పరిచయం చేసే వ్యాసం ఉంది. పోషక విలువలుండే అల్పాహారం గురించి స్పెషల్ ఫీచర్‌లో తెలుసుకోండి. కొండల్ని తొలిచి నివాస గృహాలుగా మలుచుకుంటున్న చైనీయుల వింతైన ఇళ్లను 'చిత్ర ప్రపంచం'లో తిలకించండి. ఇంకా చాలా సంగతులున్నాయి. పత్రికను ఆసాంతం చదివి, అమూల్యమైన మీ అభిప్రాయాలను మాతో పంచుకోండి. కొత్త ఆకర్షణలతో మళ్లీ వచ్చేవారం కలుసుకుందాం.

మీ
ఎడిటర్

## సినిమా చూద్దాం రండి!

రకుల్‌ప్రీత్‌సింగ్ ముఖచిత్రంతో వెలువడిన పత్రిక కలర్‌ఫుల్‌గా వుంది. అదృష్ట జాతకుడు, ఆస్వాదన కథలు విభిన్నంగా వున్నాయి. సినిమా చూద్దాం రండి శీర్షికలో "రోమన్ హాలిడే' చిత్రాన్ని పరిచయం చేసిన తీరు ముగ్ధుల్ని చేసింది. ఈ వ్యాసం చదివిన తర్వాత ఆ సినిమాని తప్పక చూడాలనిపించింది. కాంచీపురం శ్రీ యథోక్తకారి స్వామి క్షేత్రానికి సంబంధించిన పూర్తి వివరాలను తెలియజేసిన చంద్రశేఖర్‌గారికి ధన్యవాదాలు. మీరందిస్తున్న శీర్షికలన్నీ ఒకదాన్ని మించి ఒకటి ఆకట్టుకుంటున్నాయి.

-ఎం.ఎం.గౌతమీ మీనన్ (చెన్నయ్)

## స్పెషల్ ఫీచర్ నచ్చింది

16 నవంబర్ సంచిక మా ఇంటిల్లిపాదికీ ఎంతోనచ్చింది. 'నడక-నడత' పల్లవి స్ఫూర్తి కలిగించేలా వుంది. 'ప్రబుద్ధులు-పెదబుద్ధులు' అద్దంలో మనంలో లక్ష్మిగారి విశ్లేషణాత్మక వ్యాసం మమ్మల్నెంతగానో ఆలోచింపజేసింది. ఎలర్జీ వల్ల సంక్రమించే వ్యాధులు తగ్గడానికి చక్కని ఆరోగ్య సూత్రాలను తెలియజేసిన డా.పూర్ణ చందుగారికి కృతజ్ఞతలు. 'ముంచుకొస్తున్న జీవ వినాశనం' స్పెషల్ ఫీచర్ ఉపయుక్తంగా వుంది. తానెక్కిన కొమ్మను తానే నరికినట్టు భూమి సమతౌల్యతను దెబ్బతీస్తున్న మనిషి ఇప్పటికైనా కళ్లు తెరిస్తే ఎంత బాగుంటుంది.

-వై.వి.తులసీప్రసాద్ (పోచంపాడు)

## ఉత్కంఠ రేకెత్తిస్తున్నాయి

రకుల్‌ప్రీత్‌సింగ్ ముఖచిత్రంతో వచ్చిన 'భూమి' సర్వాంగ సుందరంగా వుంది. మైండ్ బ్లాక్, అదృష్ట జాతకుడు కథలు బాగున్నాయి. కళల వాకిట్లో, జననికిదె వందనం కోయిల కవితలు నచ్చాయి. 'రోమన్ హాలిడే' హాలీవుడ్ చిత్ర విశేషాలను శ్రీదేవీ మురళీధర్ చాలాబాగా వివరించారు. బృందావనం, కృష్ణకణం సీరియల్స్ వారం వారం ఉత్కంఠ రేకెత్తిస్తున్నాయి.

-కె.వి.ఆనందరావు (ఖమ్మం)

## సినిమా పరిచయం బాగుంది

9 నవంబర్ ఆంధ్రభూమి వీక్లీ చూడముచ్చట కలిగించింది. అత్తగారి మడిచీర, రోనక్ కథలు వైవిధ్యంగా వున్నాయి. పొన్నూరు శ్రీ సహస్ర లింగేశ్వర స్వామి క్షేత్ర విశేషాలను వివరంగా తెలియజేసినందుకు ధన్యవాదాలు. కృష్ణకణం, బృందావనం సీరియల్స్ ఆసక్తికరంగా సాగుతున్నాయి. 'కాసబ్లాంకా' హాలీవుడ్ సినిమా పరిచయం చాలాబాగుంది. గంగానదీ తీరంలోని పుణ్యక్షేత్ర వివరాలను తెలియజేసిన డా.కళ్యాణీ సచ్చిదానందం గారికి కృతజ్ఞతలు.

-సిహెచ్.సదాశివరావు (గుంటూరు)

## కథలు కొత్తగా ఉన్నాయి

9 నవంబర్ సంచిక చూడముచ్చటగా వుంది. రోనక్, ఒక్క నిముషం కథలు కొత్తగా వున్నాయి. రెండవ ప్రపంచ యుద్ధం నేపథ్యంలో అద్భుతంగా తెరకెక్కించిన 'కాసబ్లాంకా' చిత్రాన్ని చాలా చక్కగా పరిచయం చేశారు. సత్సంప్రదాయాన్ని చాటే బొమ్మలకొలువు కన్నులపండుగ చేసింది. అందమైన పర్పుల్ ఆక్సాలిస్ పూలమొక్కలను పెంచే విధానం గురించి పూర్తి సమాచారం అందించిన కృష్ణమూర్తిగారికి థాంక్స్. పల్లవి, కోయిల కవితలు బాగున్నాయి.

-ఆర్.జె.కామేశ్వరి (విజయవాడ)

## 'అద్దం'లో చురకలు భేష్!

2 నవంబర్ పత్రిక ఇంట్రెస్టింగ్‌గా చదివించింది. మా పెళ్లికి రండి, ఫ్యాషన్ కథలు వాస్తవానికి దగ్గరగా వున్నాయి. ప్లే స్కూల్ పిల్లలకి 'టెక్' పాఠాలెందుకని విద్యా వ్యాపారం చేస్తున్నవారికి 'అద్దం'లో లక్ష్మిగారు వేసిన చురకలు భేషుగ్గా వున్నాయి. 'వెరైటీగా వెడ్డింగ్ వెన్యూ' చిత్రాలు చూడముచ్చటగా వున్నాయి. శ్రీ సరస్వతీ నమోస్తుతే సీరియల్ ఆధ్యాత్మిక సంగతులతో ఆకట్టుకుంటోంది. కృష్ణకణం సీరియల్ ఉత్కంఠభరితంగా సాగుతోంది. విశ్వంలో వింతలు ఆశ్చర్యం కలిగించాయి. కరకరలాడే కట్‌లెట్స్ 'రుచి'కరంగా వున్నాయి.

-యస్.రాధిక (సాలూరు)

## సస్పెన్స్ సీరియల్

2 నవంబర్ 'భూమి' కలర్‌ఫుల్‌గా వుంది. లెక్క తప్పింది, మా పెళ్లికి రండి, పక్కింటోళ్ల చలవ కథలు బాగున్నాయి. 'టు కిల్ ఎ మాకింగ్ బర్డ్' విశేషాలు చదువుతుంటే సినిమా చూస్తున్న అనుభూతి కలిగింది. ఇంత చక్కని క్లాసిక్స్‌ని అందిస్తున్న శ్రీదేవీ మురళీధర్‌గారికి అభినందనలు. రాజముద్ర సీరియల్ సూపర్ సస్పెన్స్‌తో ఆసక్తికరంగా చదివిస్తోంది. 'ఆలయ దర్శనం'లో ఝరాసంగం శ్రీ కేతకి సంగమేశ్వరుడి క్షేత్ర విశేషాలు తెలుసుకున్నాం. 'మహావీర కర్ణ' బొమ్మల కథ నచ్చింది. స్నేహం మధురం, అర్ధాంగీకారం కోయిల కవితలు బాగున్నాయి.

-వి.వి.రామమోహనరావు (విశాఖపట్నం)


ఆలోచించండి

భారత విచ్ఛిత్తికి విదేశీకుట్ర

ప్రొఫెసర్ ముదిగొండ శివప్రసాద్

# సహేతుకంగా విశ్లేషించారు

'భారత విచ్ఛిత్తికి విదేశీ కుట్ర' వ్యాసంలో ప్రొఫెసర్ ముదిగొండ శివప్రసాద్‌గారు వాస్తవాలను సహేతుకంగా విశ్లేషించిన తీరును మెచ్చుకుని తీరాలి. భారతీయ సంస్కృతిపై పూర్తి అవగాహన లేకుండా ఐలయ్యగారు చేసిన రచనలు వర్గ, వర్ణ విభేదాలను రెచ్చగొట్టేలా వున్నాయి. అమర్‌నాథ్ యాత్రీకులపై ఉగ్రవాదులు బాంబులు వేస్తుంటే మానవ హక్కుల సంఘం వారు అతి తెలివిని ప్రదర్శించడం శోచనీయం. 'ఒక సంగ్రహ విజ్ఞాన కోశం-రెడ్డి వైభవం' పుస్తక సమీక్షలో తెలుగువారి పరిపాలనా దక్షత, సంస్కృతి రక్షణకై వారు చేసిన యత్నాలకు సంక్షిప్త కరదీపికలా వుంది.

-జి.ఆర్.కె.రెడ్డి (నిజాంపేట)

## 'అద్దం'లో వాస్తవాల్ని చెప్పారు

2 నవంబర్ పత్రికలో 'అద్దంలో మనం' అద్భుతం. కొరడాతో చెళ్లున చరిచినట్టు వాస్తవాలను చక్కగా విశ్లేషించారు. తమ పిల్లల ఫోన్ నాలెడ్జ్ గురించి గొప్పలు చెప్పుకునే తల్లిదండ్రులున్న సమాజం మనది. లక్ష్మిగారు చెప్పినట్టు మన టెక్నాలజీ మనుషుల్ని తిరిగి మూగజీవాలుగా మార్చేస్తుందేమో. ఈ వారం అద్దాన్ని సందేశాత్మకంగా అందించినందుకు అభినందనలు. పక్కింటోళ్ల చలవ, లెక్క తప్పింది కథలు బాగున్నాయి.

-ఎం.వి.ఎస్.ఎస్.ప్రసాద్ (కాకినాడ)

## 'అల్లరి' ప్రత్యేకత కనిపించలేదు

పిల్లలు ఎంత వయసువారైనా అమ్మ ముందు పసివాళ్లేనని 'పల్లవి'లో హృద్యంగా చెప్పారు. చదువుకోనివాళ్లు ఇన్‌లాండ్ లెటర్‌ని ఇంగ్లాండ్ లెటర్ అని పలకడం తప్ప ఈ వారం 'అల్లరి'లో ప్రత్యేకతేమీ కనిపించలేదు. సమస్యల పరిష్కారం జీవితాలకు వెలుగు, అక్షరాలు జగతికి వెలుగు బాటలని కోయిల కవితలో అర్థవంతంగా చెప్పారు. 'చేపలు పట్టడం నేర్పాలి' కథలో నేటి సమాజ పరిస్థితిని కళ్లకు కట్టినట్టు చూపారు. రాజముద్ర సీరియల్ ఆసక్తి కలిగిస్తోంది. 'వల్లరి'తో మళ్లీ సత్యమూర్తి గారి కార్టూన్స్ కనిపిస్తూండటం ఆనందమైనా వాటిలో హాస్యం తగ్గింది. 'కందుకము వోలె' కథ నచ్చింది.

-డా.శివభూషణం (కర్నూలు)

## పఠనాసక్తి కలిగిస్తోంది

'విన్నపం' పల్లవి ఎంతో నచ్చింది. 'మహావీర కర్ణ' బొమ్మల కథ ఆదిలోనే ఆసక్తి కలిగించింది. షజేశ్వరీదేవి ఆలయ చరిత్రను, పౌరాణిక కథనాలను, అక్కడ జరిగే ముఖ్యమైన ఉత్సవాలను వివరంగా తెలియజేసిన శ్రీలత గారికి కృతజ్ఞతలు. ఈ వ్యాసాన్ని చదివిన తర్వాత ఆ క్షేత్రాన్ని తప్పక దర్శించాలనే కోరిక కలిగింది. 'రాజముద్ర' భవనం మీద గద్ద వచ్చి వాలుతున్న ప్రతిసారీ ఎలాంటి ఘోరం జరుగుతుందోననే ఉత్కంఠ మొదలౌతోంది. చక్కని సస్పెన్స్‌తో పఠనాసక్తి కలిగిస్తున్న రాజేశ్వరీ చంద్రజ గారికి అభినందనలు.

-వి.వి.గోవిందనాయక్ (నారాయణ్‌ఖేడ్)

కొత్త ఫీచర్

# ఫ్యామిలీ ట్రిప్

కొత్త ప్రదేశాలను చూడాలని, అక్కడి విశేషాలు తెలుసుకోవాలని అందరికీ ఉంటుంది. యాంత్రిక జీవితం నుంచి కాస్త రిలీఫ్ కోసం యాత్రలు చేయాలనుకుంటారు. అలాంటి మీ యాత్రానుభవాలను మళ్లీ మీకు గుర్తుచేసి, మీ ఆనందాన్ని రెట్టింపు చేయడానికి మీ అభిమాన పత్రిక చేస్తున్న చిన్న ప్రయత్నం ఇది!

మీరు చేయవలసిందల్లా మీ టూర్‌కి సంబంధించిన విశేషాలను పది వాక్యాలు మించకుండా రాసి, ముచ్చటైన మీ ఫ్యామిలీ ఫొటోలు నాలుగు పంపిస్తే చాలు. పది కాలాల పాటు భద్రంగా దాచుకునేలా మీ టూర్ ఫొటోలను ఆంధ్రభూమిలో ప్రచురిస్తాము.

నిబంధనలు:

★ దేశ విదేశాలలోని పుణ్యక్షేత్రాలు కావచ్చు, అందమైన పర్యాటక ప్రదేశాలు కావచ్చు, మీరు కుటుంబ సభ్యులతో కలిసి వెళ్ళిన ట్రిప్ అయితే చాలు.

★ పోస్ట్‌కార్డ్ లేదా క్యాబినెట్ సైజ్ ఫొటోలు నాలుగు పంపండి. క్లారిటీ ఉన్న ఫొటోలైతే ప్రింటింగ్‌లో బాగా వస్తాయి. నలిగిపోయినవి, స్పష్టత లేనివి, స్టూడియోలో తీయించుకున్న ఫొటోలు వద్దు. స్కాన్ చేసి మెయిల్ కూడా పంపచ్చు.

★ మీ ఫొటోలు తిప్పి పంపించడం సాధ్యం కాదు కాబట్టి పోస్టు కవరు జత చేయాల్సిన అవసరం లేదు.

★ బాగున్నవాటిని వీలువెంబడి ప్రచురిస్తాము కాబట్టి ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.

మా చిరునామా

ఎడిటర్

ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక,

36, సరోజినీదేవి రోడ్, సికింద్రాబాద్ - 500 003, తెలంగాణ.

e-mail :abwfamilytrip@gmail.com ఈ మెయిల్ ఐ.డి.కి వేరే రచనలు పంపవద్దు.

## అల్లరి చేద్దాం



### టికెట్ ప్లీజ్...

ఆధార్‌లు, ఐడీ ప్రూఫ్‌లు అడగని రోజుల్లో...

ముగ్గురు లాయర్లు, ముగ్గురు ఇంజనీర్లు ఒక కాన్ఫరెన్స్‌కు అటెండ్ కావడానికి ట్రెయిన్‌లో వెళుతున్నారు.
ఐతే లాయర్లు ముగ్గురు మూడు టికెట్లు తీసుకున్నారు. కానీ ముగ్గురు ఇంజనీర్లు కలిసి ఒకే టికెట్ తీసుకున్నారు. ఒక లాయర్,
"ఒక్క టికెట్ మీద ముగ్గురూ ఎలా ప్రయాణిస్తారు?" అని అడిగాడు.
"వెయిట్ అండ్ వాచ్" అన్నాడో ఇంజనీరు.

ట్రెయిన్లో లాయర్లు వాళ్ల సీట్లలో వాళ్లు కూర్చున్నారు. ముగ్గురు ఇంజనీర్లు టాయిలెట్ రూంలోకి వెళ్ళి తలుపు మూసుకున్నారు. కాసేపటికి టికెట్ అంటూ టి.సి. వచ్చి, టాయిలెట్ రూం తలుపుతట్టాడు. తలుపుకొద్దిగా తెరిచి, ఒక చెయ్యి బయటికి వచ్చి, టికెట్ ఇచ్చింది.
టి.సి.టికెట్ చూసి ఇచ్చాడు.
లాయర్లు ఇది చూసి, ఈ ఐడియా బాగానే వుంది. ఇంజనీర్లు చాలా తెలివైనవాళ్లు. మనం కూడా తిరిగి వచ్చేటప్పుడు ఒకే టికెట్ తీసుకుందాం అన్నారు.
కాన్ఫరెన్స్‌కు అటెండై తిరుగు ప్రయాణంలో, లాయర్లు ముగ్గురు కలిసి ఒకే టికెట్ తీసుకున్నారు.
ఇంజనీర్లు అసలు టికెట్టే కొన్లేదు.
"కనీసం, ఒక టికెట్ కూడా లేకుండా మీరు ఎలా ప్రయాణిస్తారు?" అని ఒక లాయర్ ఆశ్చర్యం ప్రకటించాడు.
ఒక ఇంజనీరు "వెయిట్ అండ్ సీ" అన్నాడు.
ట్రెయిన్ కదిలింది. లాయర్లు ఒక టాయిలెట్‌లోకి దూరారు. ఇంజనీర్లు ఇంకో టాయిలెట్‌లోకి దూరారు.
కాసేపటికి ఇంజనీర్లు బయటికి వచ్చారు. ఒక ఇంజనీరు, లాయర్లున్న టాయిలెట్ దగ్గరికి వచ్చి, గొంతుమార్చి,
"టికెట్ ప్లీజ్" అన్నాడు.
వాళ్ళు ఇచ్చేశారు!

-అబ్బగాని భాస్కర్ (మహబూబాబాద్)

##  వీళ్ళనేమందాం?

### వేలాడే విద్యాసుమాలు వీరు!



విశ్వనగరంలో ఉదయం, సాయంత్రం వేళల్లో ఆర్టీసీ బస్సుల్లో రద్దీ నానాటికీ పెరుగుతోంది. కళాశాలలకు వెళ్ళే విద్యార్థులు, కార్యాలయాలకు వెళ్ళే ఉద్యోగులతో బస్సులిలా కిటకిటలాడిపోతున్నాయి. పాదాలు రెండూ పెట్టుకోలేని పరిస్థితి ఎంత దయనీయం? కూకట్‌పల్లిలో కనిపించిన దృశ్యం ఇది!

-తటవర్తి

**దిక్కుమాలిన ట్రాఫిక్కు....**
**ప్రజల నమస్యలని పట్టించుకోని ప్రభుత్వం...**
**కేర్ చెయ్యని అధికారులు....**

ఇలా నిత్యం తిట్టుకుంటూనే ఉంటాం. కానీ ఇక్కడ కనిపించే ఫోటోల్లో సర్కస్ ఫీట్లు చేస్తున్న వాళ్ళకి మాత్రం అలా తిట్టే హక్కు లేదు. పైపెచ్చు వాళ్ళే తిట్లు తినాలి. ఇలాంటి రిస్కులు ఎప్పుడూ తీసుకోకూడదనీ, పోలీసులున్నా లేకపోయినా ట్రాఫిక్ రూల్సుని పాటిస్తామనీ కొందరైనా గట్టి నిర్ణయం తీసుకుంటారేమో అన్న చిన్న ఆశతో ఇది మొదలుపెట్టాం.మీకు కూడా ఇలాంటి దృశ్యాలు కంటపడితే ఓ ఫోటో క్లిక్ చేసి పంపవచ్చు. మీ పేరూ, మీ కెమెరా, ఆ సీన్‌ని పట్టుకున్న ప్లేసూ, టైమూ కూడా ఇవ్వండి. మరీ ఒళ్ళు మండితే ఆ శాల్తీలకి బుద్ధొచ్చేలా ఓ సరదా కేప్షన్ కూడా రాయండి.
బాగున్నవాటికి బహుమతి ఉంటుంది.
మీ ఫోటోలను bhoomiaw@gmail.comకి లేదా పోస్టులోనైనా పంపవచ్చు.

మో.డీ..మో!

......అంటే మోడీగారి డీమోనిటైజేషన్!

పెద్దనోట్ల రద్దు అనే ఈ బాంబు భారతీయుల మీద పడి ఏడాదయ్యింది. అది సృష్టించిన అలజడి వల్ల అంతర్జాతీయస్థాయి వార్త అయ్యి ప్రపంచమంతటినీ ఆకర్షించింది. భారత్‌లోనే కాదు. ఎన్నో దేశాల్లో మేధావులు, ఆర్థిక నిపుణుల మధ్య ఈ టాపిక్ మీద చర్చలు, వాదోపవాదాలు జరిగాయి. ఇంకా జరుగుతున్నాయి. అతి తక్కువ కాలంలో అతి ఎక్కువ కష్టం, నష్టం కలిగించిన చర్యగా మోడిగారి డీ.మో (DeMonetisation) అక్కర్లేనంత అపఖ్యాతిని మూటకట్టుకుంది.

"ఇది నల్లధనం మీద యుద్ధం..." అంటూ సామాన్యుడి నాడి పట్టుకున్న మోడీగారు మాత్రం సామాన్యులు కారు. ప్రజల మనసుల్లో నాటుకునేలా తన వుపన్యాసాల్లో భావోద్వేగాలని పలికిస్తూ, ఏ పదాలు వాడితే వారిని పడేయచ్చో బాగా తెలిసిన రాజకీయ నాయకుడు. అందుకే "జస్ట్ 50 రోజులు భరించండి" అన్న ఆయన విన్నపానికి, వినయానికీ జనం ఫిదా అయిపోయారు. ఆయన 50 అంటే వీరు ఉదారంగా 100 రోజులు భరించారు. ఓపిగ్గా బాంకుల ముందు క్యూలు కట్టారు. చేతిలోని నోట్లు చెల్లక, సమయానికి కేష్ అందక శుభకార్యాలు వాయిదా వేసుకున్నారు. ప్రయాణాలు మానుకున్నారు. షాపింగ్ తగ్గించుకున్నారు. ఇళ్ళ నిర్మాణాలు ఆపేశారు. చిన్నా చితకా వ్యాపారాలు దెబ్బతింటున్నా 'అచ్ఛేదిన్' పై ఆశలు పెంచుకుంటూ ఎదురుచూశారు. చిల్లర కష్టాలెన్నో ఎదుర్కొన్నారు.

ప్రధాని ప్రామిస్ చేసిన యాభై రోజుల తర్వాతా అద్భుతం ఏమీ జరగలేదు. అయినా జనం ఆశ పడుతూనే ఉన్నారు పాపం. ఈ నమ్మకంతోనే చండీగఢ్, ముంబయి, మహారాష్ట్ర, గుజరాత్, ఒడిషా స్థానిక ఎన్నికల్లో బిజెపిని గెలిపించారు. యు.పి., ఉత్తరాఖండ్, గోవా, మణిపూర్ రాష్ట్రాల్లోనూ భారతీయ జనతాపార్టీనే, మోడీనే నమ్ముకుని ఓట్లు వేశారు.

నల్లధనం వెనక్కి రాగానే అందరి అకౌంట్లలోకీ ఆ డబ్బులు పంచేస్తా అని కూడా ప్రధానిగారు హామీ ఇచ్చారు. బ్లాక్‌మనీ ఏమోగాని 95 శాతం పాతనోట్లు వెనక్కి వచ్చాయి. ఖాతాలు నిండలేదు కాని జనం జేబులు ఖాళీ అయ్యాయి. అంచనాలు ఇలా తప్పాయేమిటా అని రిజర్వ్ బాంక్ వారు తలకిందులయ్యారు.

ఇంతకీ డీమోనిటైజేషన్‌తో ఏం ఒరగబెట్టారు? - అంటూ వస్తున్న విమర్శనాస్త్రాలని తిప్పికొట్టలేక కొన్నాళ్ళకి డిజిటలైజేషన్ అనే కొత్తపాట ఎత్తుకున్నారు. కానీ ఈ పాటకి పల్లవి అతకలేదు. అనుకూల మీడియాతో ఎంతగా పొగిడించినా లాభం లేకపోయింది. రిజర్వ్‌బాంక్ నుంచి 5,10,20,50 నోట్లు ఇంకా రిలీజవ లేదు. నగదు కోసం కష్టపడుతున్నా, మెజారిటీ జనం కార్డుల జోలికి పోవడం లేదు. దానికి కర్ణుడి చావుకున్నన్ని కారణాలున్నాయనుకోండి. కానీ కార్డు పేమెంట్ల మీద సర్ ఛార్జిల బాదుడు తగ్గకపోవటం అసలు మెలిక.

ది ఫస్ట్ కేష్ లెస్ విలేజ్ అంటూ వార్తల్లోకి ఎక్కించిన ఇబ్రహీంపూర్‌లో 1200మందికి డెబిట్ కార్డులిచ్చారు. ఎంతో ఆర్భాటమూ చేశారు. కానీ కొద్దిరోజులకే ఆ ముచ్చట తీరిపోయి వాళ్ళు వాటిని మూలనపడేసి నగదు లావాదేవీలే జరుపుతున్నారన్న నిజం మాత్రం బైటికి రాలేదు.






మొత్తానికి డీ.మో. వల్ల లాభాలు-నష్టాలు అన్న పట్టిక వేస్తే ఎక్కువ పాయింట్లు నష్టాలవైపే వస్తున్నాయి.

బాంకులకి నిధుల కోసం వేట తప్పింది, పన్ను చెల్లింపుదారుల సంఖ్య బాగా పెరిగింది, దొంగనోట్ల వ్యవస్థ కుదేలైంది, తీవ్రవాదులకి నగదు అందటం తగ్గింది అంటూ ప్రభుత్వం లాభాల చిట్టాని ఏకరువు పెడుతోంది.

జీడీపీ తగ్గిపోయింది, కొత్తనోట్ల ముద్రణకి ఖర్చు వందశాతం పెరిగిపోయింది, నగదు లావాదేవీల మీదే ఆధారపడే వ్యవసాయంలాంటి రంగాలెన్నింటిలోనో ఉన్నవారికి కోలుకోలేని నష్టాలు వచ్చాయి. హవాలా శాల్తీలు దివాలా తీయలేదు, వ్యాపారానికి కొత్తదారులు వెదుక్కున్నారు అంతే - అని నోట్ల రద్దుని వ్యతిరేకిస్తున్నవారు మరో పది పాయింట్లు ఎక్కువే చెబుతున్నారు.

డీమోనిటైజేషన్ నిర్ణయం నల్లధనవంతులని కాక, సక్రమంగా పన్ను చెల్లించేవారిని, గ్రామీణ ప్రజల్ని చాలా బాధలకి గురిచేసింది. ఇది నా మాట కాదు. - అక్షరాలా పార్లమెంటరీ పానెల్ నివేదిక చెప్పినది.

అటు మోడీ సర్కారు వాదనలూ, ఇటు వ్యతిరేకించేవారి ఆరోపణలూ - అన్నీ సబబుగానే అనిపిస్తుండటంతో ప్రజల్లో ఇంకాస్త కన్ఫ్యూజన్ పెరిగింది. ఈ లాభనష్టాల బేలన్స్ షీట్ ఇంకా బేలన్స్ కాలేదు. మహరాజా అని మొర పెట్టుకుంటే మరిన్ని తగలనీ అన్న సామెతలాగా ఈలోగా జీఎస్‌టీ వచ్చిపడింది. ఇప్పటికి వున్న అయోమయం చాలదన్నట్టు దానికి సాధ్యమైనంత లెవల్లో ఆజ్యం పోసింది.

ఆర్థిక సంస్కరణల విషయంలో ఆచితూచి అడుగువేయాలన్న పాఠాన్ని ఇకనైనా నాయకులు నేర్చుకోవాల్సిందే. దూరదృష్టితో తీసుకున్న నిర్ణయాల తాలూకు ఫలితాలూ సుదూరంగానే ఉండి, నెమ్మదిగా అనుభవంలోకి వస్తాయనడం ఎవరికీ మింగుడుపడని సంగతి. పైగా, దేశంలోని కుబేరపుత్రుల్లో ఒక్కరికి కూడా ఈ నోట్లరద్దు ఏ ఇబ్బందీ కలిగించిన దాఖలా లేదు. మరి అది ప్రజల్లో అనేకరకాల అనుమానాలు కలిగించడంలో ఆశ్చర్యం ఏముంది?



**తెలిసిన సంగతులకే కొత్తకోణం**

# వస్తావు కదూ!




కలువ కళ్ళల్లో నిండిన నీ రూపం
గుండెల్లో నిక్షిప్తమైంది
అందమైన ఊహల పల్లకిపై
ఆశల ఊయల ఊగుతుంటే
గుండె గుండెలో జత కలిసి
గుసగుసలాడుతోంది
ఎదురు చూపులను
గుమ్మాలకు
తోరణాలుగా
అలంకరించి
నులివెచ్చని కోరికలను
రంగవల్లులుగా
తీర్చిదిద్దాను!
మనసు మల్లెతోటలా
విరబూస్తే
వయసు వసంతంలా
మత్తెక్కిస్తోంది
కోమలత్వం
కూనిరాగాలు తీస్తుంటే
లావణ్యం లాస్యం
చేస్తోంది
సోయగం వెన్నెల సోనలు
జాలువారుతోంటే
రెక్కలు తొడిగిన మక్కువ
ప్రేమకి పాదులు చేస్తోంది
మమతానుబంధాలు పందిళ్లు వేసి
అనురాగ సుమాలు దోసిళ్లు నింపి
అభిసారికలా ఎదురుచూస్తున్న నాకోసం
ప్రియా... వస్తావు కదూ!

-కర్లపూడి విజయలక్ష్మి (శేరిలింగంపల్లి)



# మౌనం ఒక విశ్వభాష

మౌనం ఒక తిరస్కారం
మౌనం ఒక అంగీకారం
మౌనం ఒక మహావృక్షం
మౌనం ఒక నిష్క్రమణం
మౌనం ఒక సంభాషణం
మనస్సులు ఊసులాడే వేళ
మౌనం ఒక ధిక్కారం
అతకని మనస్సుల మధ్య
మౌనం ఒక శతఘ్ని
వివరణకు వచ్చే క్షణం ముందు
మౌనం
అక్షరాలలో కూర్చలేని
ఒక విశ్వభాష!

- కొప్పర్తి వసుంధర (నరసాపురం)





# బృందావనం

- శ్రీకళ అబ్బరాజు srilu.abbaraju@gmail.com

**రాధికకి ఇలాంటివన్నీ కొత్త. తను కూడా నమస్కారం చేయాలేమో అనుకుని, ఒక అడుగు ముందుకు వేసి వంగబోయింది.**

**వెంటనే, గట్టిగా జబ్బ పట్టుకుని ఆపింది పార్వతి. ఆ పట్టుకోవండలోనే ఆమెకి రాధిక మీదున్న కోపం, కసి తెలుస్తూ వున్నాయి.**

రక్తం గడ్డకట్టుకుపోయినట్టవడంతో "అబ్బా.." అని బాధతో చేయి వదిలించుకుని, కమిలినచోట గట్టిగా అరచేత్తో రుద్దుకుంది.

"ఇద్దరూ ఒక్కసారే అలా కాళ్ళమీద పడకూడదని కూడా తెలియదు కాబోలు. ఈ పిల్లకి బొత్తిగా పద్ధతులూ, సంప్రదాయాలూ నేర్పించినట్టు లేరు. ఏదైనా పెంపకాన్ని బట్టి వుంటుందిలే" ఖంగుమన్న గొంతుతో అక్కడున్న వారందరూ వినాలన్నట్టే అంది.

ఇదివరకటి రాధిక అయితే, పార్వతి మాటలకి టపీమని జవాబు చెప్పేదే. కానీ, ఒక కుటుంబం సవ్యంగా సాగాలంటే, ఎంతో వివేకమూ, ఓపిక కావాలని ఇక్కడికి వచ్చేకే అర్థమైంది. ముఖ్యంగా మేనత్తను ఇబ్బందిలో పడేసే పని ఏదీ చేయదల్చుకోలేదు. అందుకే మౌనం వహించింది.

ఆవిడ ఇంకా వూరుకోలేదు.

"ఏరా! నువ్వింకా ఏ పనిమీదో, పూర్ణిమతోనో బైటికి వెళ్లి వుంటావనుకున్నాను. పిల్లని వెంటేసుకుని వెళ్లే పని ఏంటిరా?" చనువుగా మందలించింది అనంత్‌ని.

ఆవిడ మాటలు అక్కదున్న వారందరికీ ఎబ్బెట్టుగా

**జరిగిన కథ 12**

మోహన్రావు-మీనాక్షి దంపతులిద్దరూ ఉద్యోగస్తులే. వారి సంతానం రాధిక, మధు. కాలేజీలో చదువుతున్న రాధిక రోజూ బయటికెళుతున్నప్పుడు తమ ఇంటి పక్కనే ఎంతో భారీగా వుండే భవంతి వైపు చూస్తుంటుంది. ఆ ఇల్లన్నా, అందులో నివసించేవాళ్లన్నా రాధికకు ఆసక్తి ఎక్కువ. కాలేజీ ఫెస్టివల్‌లో డాన్స్ ప్రోగ్రామ్‌కి రిహార్సల్స్ చేస్తుంటుంది రాధిక. అందమైన అమ్మాయిలను వేధించి వెంటాడే మైథిల్ తరచూ రాధికను కలుస్తూ ఆమెను ఆకట్టుకునే ప్రయత్నాలు చేస్తుంటాడు. కానీ రాధిక ఎప్పటికప్పుడు తప్పించుకుంటూ వుంటుంది. పక్క ఇంటి శశాంక్‌ని తను ప్రేమిస్తున్నట్టు సంధ్యకి చెబుతుంది రాధిక. శశాంక్ రావడంతో తనని అల్లరి చేస్తున్న మైథిల్ పారిపోవడంతో ఊపిరి పీల్చుకుంటుంది రాధిక.ఎంబీయే చేసిన శశాంక్‌కి బిఎస్సీ చదువుతున్న నచ్చుతానో లేదో అనే సందేహం కలుగుతుంది రాధికకి. మేనత్త చూపిస్తున్న ప్రేమానురాగాలకు ఆనందపడుతుంది రాధిక. హోటల్‌రూంకి వచ్చిన తనపై శశాంక్ అత్యాచార యత్నం చేయబోతే తెలివిగా తప్పించుకుంటుంది రాధిక. తనని తల్లి అనవసరంగా తిట్టడం గురించి విశాల దగ్గర చెప్పుకుని బాధపడుతుంది రాధిక. సుధాకర్ చెల్లెలు పార్వతి తన ఇద్దరు కూతుళ్ళతో కలిసి ఊర్నుంచి వస్తుంది. తన పుట్టినరోజునాడు హడావుడి చేస్తున్న చెల్లెలు పార్వతి ప్రేమానురాగాలకు ఆనందిస్తాడు సుధాకర్.

ఆనందాల వెల్లువలో ప్రేమజల్లు కురిపించే లవ్లీ సీరియల్

తోచాయి. ఉలుకూ, పలుకూ లేకుండా కూర్చు న్నారంతా. రాధిక మౌనంగా మేడ మీద తన గదికి వెళ్ళిపోయింది.

చుడీదార్ చేతిని పైకి లాగి చూస్తే, ఎర్రగా రెండు వేళ్ళ ముద్రలు తెల్లటి చేతిమీద కనిపించాయి. రక్తం గూడుకట్టుకుని పోయివుంది. కొబ్బరినూనె తీసి రాసుకుంటుండగా గౌరి గదిలోకి వచ్చింది.

"ఆమె అంతేనమ్మాయిగోరు! ఇష్టమైతే నెత్తి నెట్టుకుంటారు. లేకపోతే పురుగుని విదిలించినట్టు విదిలిస్తారు. ఓసారేమైందో తెలుసా..? మీ అత్తమ్మగోరి అత్తగారు మంచంలో ఉన్నప్పుడు ఈ అమ్మ వచ్చింది. ఉన్నట్టుండి వాళ్ళమ్మ మీద ప్రేమ ముంచుకొచ్చిందో లేక మీ అత్తమ్మ మీద కోపం ముంచుకొచ్చిందో తెలీదుగానీ...మా అమ్మని సరిగ్గా చూట్టం లేదు నువ్వు అని ఇంతెత్తున ఎగిరింది. మా అమ్మని నేను బంగారంలా చూసుకుంటాను అని, అప్పటికప్పుడు ముసలావిడిని లేపి తలంటు పోసింది. మా అమ్మకి మంచి తిండి పెట్టడం లేదు అని, పోట్లాడి పథ్యం అన్నా వినిపించుకోకుండా పాయసం వండి పెట్టింది. అంతే! ఆ రాత్రికే ముసలమ్మ వాతం కమ్మి చచ్చిపోయింది" ముసిముసిగా నవ్వుతూ చెప్పింది గౌరి.

"ఏమిటే ఆ కొక్కిరాయి మాటలు?" గద్దింపు స్వరం వినిపించడంతో ఇద్దరూ గుమ్మం వైపు తిరిగారు.

గుమ్మంలో విశాల నిలబడివుంది.

"గౌరీ! కిందకి వెళ్లి ఈ కవరు పార్వతికి ఇచ్చిరా!" చెప్పడంతో గౌరి నాలిక్కర్చుకుని విశాల చేతిలోని పాకెట్ అందుకుని కిందకి వెళ్ళిపోయింది.

"పార్వతి చెడ్డది కాదమ్మా! కానీ మనసులో ఏదన్నా పడితే సాధిస్తూనే వుంటుంది. దాని వల్ల ఎదుటివారిని ఎంత బాధపెడుతుందో అర్థం చేసుకోదు. ఒకరు చెబితే వినదు. అహంకారం ఎక్కువ. నువ్వే కొంచెం జాగ్రత్తగా వుండాలి"

"చెడ్డవాళ్ళెవ్వరూ వుండరు. అహంకారం, పరిస్థితుల వల్ల అలా వుంటారంటావు. అయితే...ఈ పరిస్థితికి తలొంచుకుని నేనే ఎందుకు ఓర్పుగా వుండాలి? అనుకుంటే.." స్వరంలో కోపం ధ్వనించినా, ప్రశ్నలో ఆలోచన వుంది.

విశాల నవ్వింది. "నువ్విలా అనుకుంటే అలాగే వుంటుంది...అవసరాలే అన్నీ నేర్పి



స్తాయి. నా సంగతి చెప్తాను విను...మీ మావయ్య కృష్ణుడి పటంలో వెనకాల నిలబడి వుండే గోవు లాంటివారు. 'దేవుడి ఆవు తన్నదు..పాలివ్వదు' అన్నట్టు ఆయనకు నా గురించి పట్టదు. ఎన్నో సార్లు విసుగుబుట్టి ఈ సంసారం వదిలేద్దామనిపిం చేది. సరదాలూ, సంతోషాలూ లేవని కావు...అవన్నీ ఆయన కావాలనుకున్నప్పుడే వుండాలి. పెద్ద కష్టాలేవీ వుండేవి కాదు...కానీ, ఏదో కోల్పోతున్నట్లుగా వుండేది. అది నా అస్తిత్వం. నేను స్వేచ్ఛగా నా మనసులో మాట చెప్పుకోలేను. మగాళ్ల ఫ్రస్ట్రేషన్ని, అహంకారాన్నీ భరించే శక్తి ఆడవాళ్ళకి వుండాలి కానీ, ఆడవాళ్ళు స్వతంత్ర అభిప్రాయాలు చెబితే మాత్రం తట్టుకో లేరు. అలాగే..నా నోరూ మూతబడింది.

దాన్ని అలుసుగా తీసుకుంటుంది పార్వతి. నా మీద పెత్తనం చలాయిస్తూ వుంటుంది. పిల్లల భవి ష్యత్తు కోసం అన్నీ ఓర్పుతో సహించాను అని పెద్ద పెద్ద మాటలు చెప్పలేను. కానీ, వాళ్ళ పెంపకంలో వాళ్ళ ప్రేమతో నాలోని లోటు పూర్తిగా భర్తీ అయి పోయింది.

మనిషి తనకి ఎటువంటి వ్యక్తిత్వం వున్నా వున్న దున్నట్టుగా అంగీకరించి ప్రేమించే తోడు ఉండాల నుకుంటాడు. అలా నా పిల్లలు నన్ను ప్రేమించారు.

వాళ్ళకి అమ్మ ఏది చేసినా సూపర్...

అమ్మ చెప్పిందంటే..మన కోసమే...

అమ్మ వల్ల ఏదైనా ఇబ్బంది కలిగినా పోన్లే మన అమ్మే కదా..

అమ్మ మంచిది...

ఇలా నన్ను పూర్తిగా మార్చేశారు.

నాలో రవ్వంత అసంతృప్తి కూడా మిగల్లేదు. పిల్లలు తల్లిదండ్రుల ఋణం తీర్చుకోవాలని పెద్ద పెద్ద మాటలు అంటుంటారు కొందరు. కానీ, నా విషయంలో మాత్రం నేను వాళ్ళకే ఋణపడి ఉన్నాను. వాళ్ళు నా జీవితంలో వెలుగుని నింపారు.

ఓర్పు దానంతట అదే వచ్చేసింది.

వయసు పెరిగేకొద్దీ ఎవరూ ఎవరికీ సొంతం కాదన్న సత్యాన్ని జీర్ణించుకునే శక్తి వచ్చింది. ప్రేమను పంచడం వరకే మన చేతుల్లో వుంది. దాన్ని పొందేవాళ్లు ఎలా వుండాలి? అని నిర్ణ యించే అధికారం మాత్రం మనకి లేదు. ఇది తెలిస్తే ఓర్పు దానంతట అదే వస్తుందమ్మా!"

విశాల చెబుతూ వుంటే, రాధిక విస్మయంగా వింటూ వుంది. 'ఓర్పు అంటే బలవంతుల్ని ఎదిరిం చలేక నోరుమూసుకుని వుండడం అనుకునేదాన్ని. కానీ దానికి ఎంతో ఆత్మబలం వుండాలన్నమాట' రాధిక మనసులో ఈ ఊహ మెదులుతూనే, మేనత్త

# ముంగిట పండుగ ముగ్గులు

సంప్రదాయ పండుగలొస్తున్నాయంటే అమ్మాయిలకు పండగే. ముత్యాల ముగ్గులతో, రంగుల గొబ్బెమ్మలతో ప్రతి ముంగిట్లో కోలాహలమే. ఆ సందడి, ఆ ఆనందం, ప్రతి ఇంట్లో విలసిల్లే ఆ సంప్రదాయ వైభవాన్ని మాటల్లో చెప్పడం సాధ్యం కాదు. కనులకింపైన ఆ అందాలను చూసి తీరవలసిందే. దానికోసం మన తరుణీమణులు ముందునుంచీ విభిన్నమైన ముగ్గులను వేయాలనే తపనతో ప్రాక్టీస్ చేస్తూ ఉంటారు. అదే ఆసక్తిని చూపించి మీరు చక్కని ముగ్గుల్ని గీసి మాకు పంపిస్తే, వారం వారం 'భూమి'లో ప్రచురిస్తాము. వేసిన ప్రతి ముగ్గుకీ పారితోషికం ఇస్తాము. ఇక మీదే ఆలస్యం... బెస్టాఫ్ లక్!

## నిబంధనలు

- ★ తెల్లటి దళసరి అరటావు కాగితం మీద బ్లాక్ ఇంకుతో ముగ్గులు గీయండి.
- ★ పెన్సిలుతో వేయకండి. రంగులు నింపితే మరీ మంచిది.
- ★ రూళ్ల పేపర్లపై, ఇన్‌లాండ్ లెటర్లపై వేసి పంపకండి.
- ★ దేవుళ్ల బొమ్మల్ని నేలపై వేయకూడదు కాబట్టి అలాంటి ముగ్గులు వేయకండి.
- ★ ఇతర పత్రికలలో ప్రచురించబడిన ముగ్గులు, ఇంతకుముందు పంపినవి మళ్లీ వేయకండి. కొత్త ముగ్గులు వేయడంలో మీ సృజనాత్మకత చూపించండి.
- ★ మాకు నచ్చని మీ ముగ్గులు తిప్పి పంపించాలంటే, తగిన పోస్టేజీ జతచేసిన కవర్లు తప్పనిసరిగా పెట్టండి. ముగ్గుల ఎంపిక గురించి ఫోన్లు, ఉత్తరప్రత్యుత్తరాలకు అవకాశం లేదు సుమండీ.
- ★ మీ ముగ్గు, పాస్‌పోర్ట్ కలర్ ఫొటోతో పాటు ఈ క్రింది కూపన్‌లో వివరాలు రాసి పంపించండి.

మీ పేరు : ------------------------------------

ముగ్గు పేరు : ------------------------------------

చుక్కల సంఖ్య: ------------------------------------

మీ చిరునామా: ------------------------------------

------------------------------------

------------------------------------

మా చిరునామా:
ఎడిటర్
ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక,
36, సరోజినీదేవి రోడ్,
సికింద్రాబాద్-500 003,
తెలంగాణ.

మీ ముగ్గులు మాకు చేరవలసిన ఆఖరు తేదీ :
**31 డిసెంబర్ 2017**

పట్ల గౌరవం రెట్టింపయ్యింది.

★ ★ ★

"అమ్మాయ్!..నేనూ ఈ గదిలోనే పడుకుంటానే! మీ నాన్నకి ఏ.సి. వద్దుట. నేను ఉడికిపోతున్నా ఆ గదిలో. హాయిగా, మీతోపాటూ ఇక్కడే పడుకుందామని వచ్చా" అంటూ పార్వతి గదిలోకి వచ్చింది. డబుల్‌కాట్ బెడ్ మీద రాధిక, బుజ్జి పడుకుంటున్నారు. గోడవారగా వున్న దివాన్ మీద బుజ్జి పడుకుంటుంది.

"నీకు ఇక్కడ మంచం లేదు కదమ్మా! పోనీ, నువ్వీ దివాన్ మీద పడుకో! నేను వేరే గదిలో పడుకుంటాను" బుజ్జి అంది.

"ఏం ఫర్వాలేదు. నేను హాయిగా చాప పరుచుకుని కిందపడుకుంటాను. మీరు ఎక్కడివాళ్లక్కడ సర్దుకోండి! నేను పడుకుంటానంటే మీకేంటి నొప్పి?" అంది శ్లేషగా రాధిక వైపుచూస్తూ.

రాధికకి ఆవిడ పన్నాగం అర్థమైంది. అనంత్ గది పక్కనే వుంది కాబట్టి ఆమె కాపలా కాయడానికి వచ్చిందన్నమాట.

ఆవిడ పిచ్చితనానికి రాధికకి నవ్వొచ్చింది. నిజంగా తప్పు చేయాలనుకుంటే, వీళ్ళ ప్రయత్నాలు ఆపుతాయా? ప్రతి నిమిషం ఎలా కాపలా కాస్తారు?

"మాకేం ఇబ్బంది లేదు పిన్నీ! మీరు ఇక్కడే పడుకోవచ్చు" అంది మనసులో భావం పైకి కనబడనీయకుండా.

అదే మొదటిసారి, రాధిక జీవితంలో లోపల చిరాకుని అణుచుకని పైకి నవ్వుతూ మాట్లాడడం. 'అబద్ధాలు చెప్పడం కూడా ఇలానే మొదలవుతుంది కాబోలు' అనుకుంటూ పక్కకి తిరిగి పడుకుంది.

రాధిక నిద్రపోవాలని ప్రయత్నించింది కానీ, నిద్రపట్టలేదు.

గుర్ర్..ర్...ర్...ర్..అంటూ ఒకటే శబ్దం.

పార్వతి పెదవులు, చెంపలు..భారీగా ఉన్న పొట్ట రైలింజను కూత పెట్టినట్టున్న గురక దెబ్బకి అదిరిపోతున్నాయి.

బుజ్జి, బుల్లికి గురక గోల అలవాటులా వుంది. హాయిగా ఒళ్లెరక్కుండా నిద్రపోతున్నారు.

నెమ్మదిగా తలుపు తట్టిన చప్పుడు. ఆ వెంటనే 'రాధీ' అన్న పిలుపు.

'అనంత్.. ఆ గొంతుని కోటి మందిలో కూడా గుర్తుపట్టగలదు. వెంటనే లేచి కూర్చుంది. కాలికి అడుగు దూరంలోనే పార్వతి పడుకుని వుంది.

నెమ్మదిగా ఆవిడని తప్పించుకుని వచ్చేలోపే మళ్ళీ "రాధీ" అంటూ పిలిచాడు.

'మహానుభావా! నీకు ఆడవాళ్ళ ఇబ్బందులు తెలియవు. మళ్ళీ పెద్దగా పిలవకు' అనుకుంటూ గబగబా తలుపుతీసుకుని వెళ్లి, తిరిగి చప్పుడు కాకుండా దగ్గరకు వేసింది.

పడుకుని లేవడంవల్లేమో జుట్టుకి వేసిన బాండ్ జారిపోయి చిందరవందరగా భుజాలమీద, చెంపల మీద పరుచుకుని వుంది.

"ఏమిటో..చెప్పు అనంత్" నిద్రమత్తు వల్ల కంఠంలో కొత్త బరువు. వంపు తిరిగిన కనురెప్పలు వాలిపోతున్నాయి. మంచులో తడిసిన తెల్లని మల్లె పూవులా వుంది.

"హలో..!!" అలాగే చూస్తూ నిలబడిపోయిన అనంత్ రాధిక మొహం మీద చిటికె వేయడంతో ఉలిక్కిపడ్డాడు.

"ఏమిటో చెప్పు" రెట్టించింది.

"ఇంకా పడుకోలేదా?"

"బావుంది.." రాధిక అందంగా నవ్వింది. "ఇప్పుడు నిద్రలో నడుస్తూ వచ్చాననుకున్నావా?"

అనంత్ చిరునవ్వు నవ్వాడు.

"ఇంతకీ, విషయం ఏమిటో చెప్పు"

"నాకు కాసేపటి క్రితం హైదరాబాద్ నుంచి ఫోన్ వచ్చింది"

అతను ఇంకా ఏం చెప్పబోతాడా అని రాధిక ముందుకి వంగి మోచేతిని కారిడార్ రైలింగ్‌పై ఆనించి చూస్తూ వుంది.

ఇంతలో...'ధన్'మని ఒక్క వుదుటున తలుపులు తెరుచుకున్నాయి. రాధిక వైపే కోపంగా చూస్తూ పార్వతి నిలబడి వుంది.

"ప్లీజ్ ..అనంత్..నాకు వాట్సప్‌లో మెసేజ్ పెట్టు.." అతనికి మాత్రమే వినబడేలా చెప్పి, దూదాపు పరుగెత్తినట్టే వెళ్ళిపోయింది.

ఆ తర్వాత, అనంత్‌కి ఎన్నో మెసేజ్‌లు పెట్టింది.

ఒక్క దానికీ రిప్లై రాలేదు.

పొద్దున్న లేస్తూనే అనంత్ కోసం చూసింది. ఎక్కడా కనిపించలేదు.

"అత్తా! అనంత్ ఇంత పొద్దుటే ఆఫీస్‌కి వెళ్లిపోయాడా?" వంట గదిలో చేరి విశాలను అడిగింది.

"హైదరాబాద్ వెళ్లాల్సిన పనొకటి వచ్చింది. ఫ్లైట్ పట్టుకోవాలంటే వెంటనే బయలుదేరాలి అని ఐదున్నరకే కాఫీ కూడా తాగకుండా హడావుడిగా వెళ్ళాడు. ఇంతలా అడుగుతున్నావు నీకేమైనా పనుందా?"

"ఊహూ.." తల అడ్డంగా వూపి బయటకు వచ్చింది.

ఆరోజు పదింటికల్లా మీనాక్షి, మోహన్రావూ, మధు వచ్చారు. మీనాక్షికి, మధుకి సెలవులు అయిపోక ముందే రాధికను తీసుకుని, అట్నుంచటే సింహాచలం, అన్నవరం చూసుకుని హైదరాబాదు వెళ్లాలని వాళ్ళ ప్లాను.

పార్వతి వాళ్లని నామమాత్రంగా పలకరించి వూరుకుంది. "ఈవిడేదో చదువుకుని, ఉద్యోగం వెలగబెడుతుందని టెక్కు" అని పార్వతి మీనాక్షిని గురించి రుసరుసలాడితే,

"బొత్తిగా మేనర్స్ తెలియని మేళం" మీనాక్షి విసుక్కుంది.

ఇంటినిండా జనాలు వుండడంతో గౌరికి సాయంగా ఇంకో వంటమనిషి వచ్చింది. మీనాక్షి ఎప్పుడూ ఉద్యోగం, ఇంటిపనితో విసుగుపుట్టి ఈ రెండు రోజులు హాలీడేస్‌గా డిక్లేర్ చేసుకుని వంటింటి వైపు తొంగిచూడలేదు.

పార్వతిని పిలవాలంటే భయం... ఒక పనికి పది పనులు పురమాయిస్తుందని. పై పనులు చూసుకోవడానికి విశాలకి సాయంగా పనులు అందిపుచ్చుకుంది రాధిక.

మా ఇంట్లో గిన్నెలో నీళ్ళు కింద పొయ్యడానికి



కూడా బద్ధకిస్తుంది రాధిక. అలాంటిది దాని చేత పనిచేయించడం నీకే చేతనైంది అక్కయ్యా" అని మోహన్రావ్ అంటే, విశాల, రాధిక ఒకరి మొహాలు ఒకరు చూసుకుని నవ్వుకున్నారు.

మరునటి రోజు సత్యనారాయణ స్వామి వ్రతానికి, ముందురోజే ఇంకా కొద్దిమంది ముఖ్యమైన బంధువులు దిగారు. పలకరింపులతో, పనులతో బిజీగా వున్నా, రాధికకి అనంత్ని గురించిన ఆలోచన వదల్లేదు. ఫోన్ చేస్తే తీయడం లేదు...మెసేజ్ లకి రిప్లైలు కూడా ఇవ్వడం లేదతను.

వ్రతానికి, ఆ రోజు సాయంకాలం నుంచే సన్నాహాలు మొదలయ్యాయి. ఇంటి ముందు షామియానాలు, గుమ్మాలకి మావిడాకులు వెలిశాయి. హాల్లో సోఫాలు, టీపాయ్లు పక్కకి సర్దించి, వచ్చేవాళ్లు కూర్చోవడానికి ఏర్పాట్లు చేశారు.

నలుగురు ఆడవాళ్లు బస్తాలతో బంతిపూలు గుమ్మరించి చకచకా దండలు గుచ్చి, గుమ్మాలకి, గోడలకి బారులుగా కట్టి అలంకరించారు.

ఇంటికి వచ్చేపోయే వాళ్ళు, నౌకర్లు...ఏర్పాట్లు... అట్టహాసం చూసి మీనాక్షి ఆశ్చర్యపోయింది.

"ఒకప్పుడు దాదాపుగా బ్యాంక్రప్ట్ అయిపోయరన్నారు. ఇప్పుడు సంపాదన బాగా వున్నట్టుంది" తల్లి, తండ్రి మాట్లాడుకోవడం రాధిక వింది.

కానీ, మీనాక్షి ఒక్కసారి కూడా డబ్బువుంది కాబట్టి, మన అమ్మాయిని అనంత్కి యిచ్చి చేస్తే లాంటి మాటలు మాట్లాడలేదు. పార్వతిని చూశాక రాధికకి తల్లిపై గౌరవం పెరిగింది.

★ ★ ★

తెల్లవారుఝామునుంచే ఇంట్లో సందడి మొదలైంది. బాత్రూం తలుపులు తీసివేస్తున్న చప్పుళ్ళు... మాటలు వినిపిస్తున్నాయి. రాధిక బద్ధకంగా పక్కకి తిరిగి పడుకుంది.

"రాధీ! ఆరయ్యింది...లేవవా?" బుజ్జి తట్టి లేపడంతో విసుక్కుంటూ లేచింది.

బెడ్రూమ్ బయట కారిడార్లో, ఫోన్లో మాట్లాడుతున్న గొంతుక విని రాధిక నిద్రమత్తు కాస్తా వదిలిపోయింది.

'అనంత్!! నిన్న ఎన్నింటికి వచ్చాడో!' బెడ్ దిగి బట్టలు సరిచేసుకుని గబగబా కారిడార్లోకి వెళ్లేలోగా మనిషి మాయం అయ్యాడు.

'ఆ రోజు రాత్రి ఏం చెప్పాలని వచ్చాడో! అది మరీ ఇంపార్టెంట్ విషయం అయితే అంత ఉదాసీనంగా వుండదు' రాధిక సమాధానపరచుకుంది.

నిజానికి అసలు విషయమేమిటో తెలుసుకోవడం కంటే, ఈ వంకతో ఒక సారి అనంత్ని కలవాలి...మాట్లాడాలి...అన్న ఆరాటమే ఎక్కువగా వున్నదన్న విషయం రాధికకీ తెలియకపోలేదు.

తొమ్మిది గంటలకల్లా ఆడవాళ్ళందరూ పట్టుచీరలు కట్టి పూలు, నగలు అలంకరించుకున్నారు.

రాధికకి బుజ్జి చీర కట్టింది. రాధిక బుజ్జికి మేకప్ వేసింది. ఇద్దరూ పక్కపక్కనే నిలబడి నిలువుటద్దంలో చూసుకున్నారు.

"మెడ బోసిగా వుంది. నా దగ్గర ముత్యాల హారం వుంది వేసుకో" అంటూ బుజ్జి వెనక్కి తిరగ్గానే, రాధికకి చటుక్కున ఏదో గుర్తొచ్చింది.

"ఇప్పుడే వస్తానుండు!" అంటూ చీరని ఎత్తి పట్టుకుని అవస్థపడుతూనే, పరుగులాంటి నడకతో అనంత్ కోసం అతని రూంలో చూసింది. లేడు...!

మెట్లు దిగి హాల్లో, ఫ్యామిలీ రూంలో వెతికింది. గుమ్మంలో నిలబడి బయటకి తొంగిచూసింది.

దూరంగా లాన్లో కొబ్బరి చెట్ల కింద బెంచీ మీద లాప్టాప్ పెట్టుకుని కూర్చుని కనిపించాడు. కొబ్బరాకుల సందుల్లో నుంచి నీరెండ అతని జుట్టు పైన పడి మెరుస్తూ వుంది.

రాధిక ఆయాసపడుతూ వెళ్లి అతని పక్కన కూర్చుంది.

అతను ముఖ్యమైన విషయం చూస్తున్నట్టుగా వున్నాడు. తల పక్కకి తిప్పలేదు.

రాధిక అతని చేతి మీద గట్టిగా గిల్లింది.

"అబ్బా..రాధీ..!"

"ఫోజు కొట్టకు! పిలుస్తుంటే వినిపించుకోవేం"

"పిలిచావా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"పోనీ ...పిలవలేదనుకో! పక్కనే కూర్చున్న వాళ్ళని పలకరించాలని తెలియదా?"

ఇక అయ్యేపని కాదనుకున్నాడేమో...లాప్టాప్ మూసేసి, "ఏమిటి?" అంటూ రాధిక వైపు తిరిగాడు.

"మరి...నీకు ఇదివరకు గొలుసు ఇచ్చాను కదా! అది...అది కావాలి" గోముగా అడిగింది.

అతను రాధికని పై నుంచి కింద దాకా ఒక సారి పరీక్షగా చూశాడు. హఠాత్తుగా అతని కళ్ళల్లోకి చిలిపిదనం వచ్చింది.

"ఏ గొలుసు?" అమాయకత్వం నటిస్తూ అడిగాడు.

"ప్లీజ్..! అమ్మమ్మ గొలుసు..అత్తయ్య నాకు ఇచ్చింది చూడు...అది"

"అరెరె...దాన్ని నేనెలా ఇస్తాను. అసలే బంగారం ధర చాలా ఎక్కువగా వుంది"

## ఇది విన్నారా?



★ రాజమౌళి తీసిన 'ఈగ' సినిమా 100 రోజుల పైన ఆడింది. అందులో ఈగ హీరోచిత విన్యాసాలు చూసి 'ఆహా' అనుకున్నాం. కాని, మన ఇళ్ళల్లో విసుగు తెప్పించే ఈగ బతికేది కేవలం 14 రోజులే!

★ ఆరోగ్యవంతమైన ఈగ దాని అనుకూల వాతావరణంలో నెల నుంచి రెండు నెలలు బతకగలుగుతుంది.

★ ఆడ ఈగ ఒకేసారి 400 గుడ్లుపెడుతుంది. 24 గంటల్లోనే గుడ్ల నుంచి ఈగలు బయటి ప్రపంచంలోకి వస్తాయి.

"అనంత్...ఇంకెప్పుడైనా ఆటపట్టించు కానీ..ప్లీజ్ ఇప్పుడు నాకా గొలుసు కావాలి"

"అవును...ఇలా ధైర్యంగా కూర్చుని మాట్లాడు తున్నావేంటి? అదిగో పార్వతత్త వస్తుంది. పారిపో" అన్నాడు నవ్వుతూ.

"పార్వతత్త కాదు...వాళ్ల అత్త వచ్చినా నేను కదిలేది లేదు... ఆ గొలుసు ఇవ్వవా?"

"అప్పుడేదో నేను విలన్‌లా చూశానని నువ్వు చాలా ఫీలయిపోయావుగా..."

"ప్లీజ్ అనంత్! ఇప్పుడు వేళాకోళం కాదు. అత్తయ్య ప్రేమతో ఇచ్చింది. నేను వేసుకోకపోతే బాధపడుతుంది. నీ ప్లేస్‌లో రాజేష్ వుంటేనా ఈపాటికి చెవులు మెలిపెట్ట లాక్కునేదాన్ని. నువ్వు కాబట్టి ఆ పని చేయలేకపోతున్నా"

"ఎందుకనీ?" అనంత్ గొంతు సడన్‌గా సీరియస్‌గా మారిపోవడంతో కలవరపడింది రాధిక.

"చెప్పు...ఎందుకని? రాజేష్ కన్నా నేను దగ్గర వాడిని కాదనా?"

అంత సూటిగా అడిగేసరికి రాధికకి ఏం చెప్పాలో తోచలేదు. సంభాషణ దారి తప్పుతోందని భయపడింది.

"మేమంటే యూత్..నువ్వు మిస్టర్ ఓల్డ్‌వి. మాకు నీతిసూత్రాలు బోధించి, హెల్ప్ చేసే రోల్ నీది. అందుకని గౌరవం అన్నమాట. ఇక డిస్కషన్స్ ఆపి గొలుసు ఇవ్వు.." మాటలతో వాతావరణాన్ని తేలిక చేస్తూ, అతని చేయిపట్టుకుని పైకి లేపింది.

తప్పదన్నట్టు లేచాడతను. రాధిక అతని వెనకాలే నడిచింది.

అనంత్ గదిలో డ్రా తాళాలు తీసి, గొలుసు వుంచిన జిప్‌లాక్ కవర్ బయటికి తీశాడు.

"నువ్వు చాలా లక్కీ. నిన్ను ఎక్కువ ఏడిపించకుండానే ఇచ్చేస్తున్నాను" అంటూ కవర్‌ని అందకుండా వెనక్కి పట్టుకున్నాడు.

రాధిక మెరుపులా చటుక్కున జిప్‌లాక్ కవర్ లాక్కుని బయటికి పరిగెత్తింది. గుమ్మం దాటాక కాస్త దూరంలోనే ఎదురుగా వస్తున్న మనిషిని ఢఖీమని గుద్దింది. ఎదురుగా వచ్చినావిడ పార్వతమ్మ.

ఆవిడ ఒక్కసారిగా, రాధిక జబ్బు పట్టుకుని విసిరేసినట్టు లాగింది.

"ఈ కాలం పిల్లలకి ఒళ్లు తెలియడం లేదు" గుడ్లురిమి, రాధిక వంక, అనంత్ గది గుమ్మం వంక మార్చి చూస్తూ కసురుకుంది.

★ ★ ★

వ్రతానికి స్నేహితులు, సిటీలో వున్న బంధువులు వచ్చారు. బిజినెస్ పరిచయాలు ఉన్నవారిని మాత్రం పిలవలేదు. కేవలం ఫ్యామిలీ అండ్ ఫ్రెండ్స్‌కి మాత్రమే ఆహ్వానాలు వెళ్లాయి.

వ్రతం ప్రారంభమైన కొద్దిసేపటికి రాజారావు దంపతులు, పూర్ణిమ కూడా వచ్చారు.

పుట్టింటివారి తరుపున మోహన్రావూ, మీనాక్షి బట్టలు పెడితే, కాబోయే వియ్యంకులుగా రాజారావుగారు కూడా కట్నాలు చదివించారు.

అనంత్ వారికి దగ్గరుండి మర్యాదలు చేస్తున్నాడు.

రాధిక పూజ దగ్గర కావలసిన వస్తువులు అందిస్తూ ఓరకంట అనంత్‌ని గమనిస్తూనే వుంది.

వ్రతకథ పూర్తయ్యాక తీర్థప్రసాదాలు ఇచ్చారు. లాన్‌లో పందిరి కింద బఫే భోజనానికి లేచారందరూ.

రాధిక, బుజ్జి- విశాల, సుధాకర్‌లకి చదివించిన కట్నాలూ, గిఫ్టులు జాగ్రత్త చేసి గదిలో సర్దే పనిలో వున్నారు.

చేతుల నిండా కవర్లు, గిఫ్ట్ బాక్స్‌లు పట్టుకుని గదిలోకి వెళ్ళబోతూ రాధిక కిటికీ పక్కన ఆగింది.

దూరంగా అనంత్-పూర్ణిమ మాట్లాడుకుంటూ కనిపించారు. అనంత్‌కి, పూర్ణిమకి హైట్‌లో కొద్ది అంగుళాలే తేడా! పక్కపక్కనే నిలబడితే జంట బావుంది అనిపించేట్టున్నారు.

ఆరోజు విశాల ఇచ్చిన చీరనే కట్టుకుంది పూర్ణిమ. చదువు, సంస్కారం, అందం-ఐశ్వర్యంతోబాటు...అత్తగారి పట్ల గౌరవం కూడా చూపిస్తూ వుంది. రాధికకి ఆ విషయం స్ఫురిస్తూనే...మనసంతా అదోలా అయిపోయింది. అప్రయత్నంగా తన ఒంటిమీద చీరకేసి చూసుకుంది.

అది కూడా విశాల కొనిచ్చిన చీరే! ఇద్దరికీ ఒకే రోజు, ఒకే డిజైన్‌లో సెలక్ట్ చేసింది. కానీ అది తన కంటే పూర్ణిమకే బాగా నప్పినట్టు తోచింది.

అనంత్ మాట్లాడుతున్న వాడల్లా తలతిప్పి రాధిక వైపు చూశాడు.

అతను చిన్నగా నవ్వి, కనుబొమలు ఎగరేయడంతో పట్టుబడిన దొంగలా తలతిప్పుకుని గబగబా అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

పూర్ణిమ బయలదేరే ముందు మీనాక్షికీ, మోహన్రావుకీ పరిచయం చేశాడు అనంత్. పూర్ణిమ వినయంతో నమస్కరించడం, మీనాక్షి మొహం వికసించడం రాధిక గమనిస్తూనే వుంది.

'పూర్ణిమని ఎవరైనా ఇష్టపడతారు. అనంత్ సరదాగా, చిలిపిగా మాట్లాడతాడు...కానీ గుండె లోపల ఖచ్చితంగా పూర్ణిమ కొలువై వుంటుంది. అందులోనూ రాజారావుగారి కూతురు కదా' ఎంత వద్దనుకున్నా ఆలోచనలు అనంత్ చుట్టూనే తిరుగుతూ వున్నాయి.

పూర్ణిమ వెళ్ళిపోయాక కూడా మీనాక్షి అనంత్‌ని కూర్చోబెట్టి అతని బిజినెస్ గురించిన వివరాలు అడుగుతూనే వుంది.

అతను ఓపిగ్గా అన్నింటికీ సమాధానాలు ఇచ్చాడు.

అతనటు వెళ్లిపోగానే...

"అనంత్ ఎంత బాగా ఎదిగిపోయాడండీ..." మోహన్రావుతో అంది మీనాక్షి.

"అవునవును...చాలా పొడుగ్గా అయ్యాడు"

"నేననేది పొడవు గురించి మాత్రమే కాదు హి హేజ్ గ్రోన్ యాస్ యాన్ ఎఫిషియంట్ అండ్ నైస్ జంటిల్మెన్..అని...తెలుగులో కరెక్ట్‌గా చెప్పడం నాకు తెలియడం లేదు.." అంది నవ్వుతూ.

"అవునవును. ఇలాంటి పొగడ్తలు ఇంగ్లీషులోనే బావుంటాయి" మోహన్రావుకూడా నవ్వాడు. ఆ నవ్వు మేనల్లుడిని చూసుకుని గర్వపడుతున్నట్టుగా వుంది.

**- ఇంకా వుంది**



# సినిమా కబుర్లు!

...::మౌర్య



## 100 కోట్లు!

దర్శకుడు గుణశేఖర్ 'రుద్రమదేవి' తర్వాత మరో భారీ చిత్రం 'హిరణ్యకశిపుడు' నిర్మాణానికి సన్నాహాలు చేస్తున్నట్టుగా కొంత కాలంగా వినిపిస్తోంది. 'బాహుబలి'తో తనదైన పాపులారిటీని సంపాదించుకున్న 'రానా'ని ఇందులో హిరణ్యకశిపుడిగా అనుకుంటున్నట్టుగా కూడా తెలుస్తోంది. ఈ చిత్రం అనుకున్నది అనుకున్నట్టుగా తీయాలంటే దాదాపు 100 కోట్లు కావాల్సి వుంటుందని కూడా అంచనాలు సాగుతున్నాయి. మరి ఇంత బడ్జెట్‌తో 'హిరణ్యకశిపుడు' సినిమాని తీసేందుకు ఏ నిర్మాత ముందుకు వస్తాడో చూడాలి!



● అనుష్క

## సంక్రాంతి బరిలో...

సంక్రాంతికి కొత్త చిత్రాల విడుదల దాదాపు ప్రతి ఏటా వుండేదే. గత ఏడాది ఖైదీ నంబర్ 150, గౌతమిపుత్ర శాతకర్ణి, శతమానం భవతి చిత్రాలు విడుదలయ్యాయి. 2018 సంక్రాంతికి పవన్ కల్యాణ్ 'అజ్ఞాతవాసి', బాలకృష్ణ 'జై సింహా' విడుదలవుతుంటే వాటితోపాటు ఈసారి సంక్రాంతి బరిలోకి అనుష్క కూడా చేరుతోంది. అనుష్క ప్రధాన పాత్ర పోషిస్తున్న 'భాగమతి' సంక్రాంతికి విడుదలయ్యే అవకాశాలు వున్నాయని తెలుస్తోంది. ఈసారి సంక్రాంతి విజేత ఎవరవుతారో మరి?



## తాప్సీ నమ్మకం

తాప్సీకి తెలుగులో సినిమాలు కరువైన సమయంలో ఆమె నటించిన 'ఆనందో[బహ్మ' మంచి విజయాన్ని సాధించింది. కామెడీ హారర్ నేపథ్యంలో రూపొందిన ఈ చిత్రాన్ని తనే స్వయంగా హిందీలో నిర్మించేందుకు తాప్సీ సన్నాహాలు చేస్తోందని వినికిడి. తెలుగులో ధరించిన పాత్రను తనే పోషిస్తూ నిర్మాతగా మారుతోందిట తాప్సీ. హిందీకి తగినట్టుగా కొన్ని మార్పుల్ని చేస్తారని, తెలుగు వెర్షన్ దర్శకుడు మహినే ఈ హిందీ సినిమాని కూడా డైరెక్ట్ చేస్తాడట.

## కలిసొచ్చేనా...!

వెటరన్ హిందీ తారలు దిలీప్‌కుమార్-సైరా బానులకు మనవరాలి వరసయ్యే సాయేషా సైగల్ తొలిసారిగా 'అఖిల్' చిత్రంలో అక్కినేని అఖిల్‌కి జంటగా నటించింది. అయితే ఈ చిత్రం పరాజయం ఆమెను నిరాశపరిచింది. కానీ తాజాగా ఆమెకి తమిళంలో మంచి ఆఫర్‌లు వస్తుంటే ఆనందంతో ఉక్కిరి బిక్కిరవుతోంది సాయేషా. మూడు చిత్రాల్లో నటిస్తోందామె ఇప్పుడు. వాటిలో కార్తికి జంటగా ఓ చిత్రం వుండడం విశేషం.

● సాయేషా సైగల్

## లక్కీ కైరా

హిందీలో 'ఎం.ఎస్.ధోనీ'లో నటించాక వెలుగులోకి వచ్చిన కైరా అద్వానీ తెలుగులోకి కూడా వస్తోంది. మహేష్ బాబు సరసన 'భరత్ అను నేను' సినిమాలో నాయికగా ఎంపికైన కైరాకి ఇప్పుడు ఆ చిత్రం ఇంకా పూర్తయి, విడుదల కాకుండానే తమిళ రంగం నుంచి కూడా ఆఫర్‌లు మొదలయ్యాయి. మురుగదాస్ దర్శకత్వంలో విజయ్ హీరోగా నిర్మాణం కాబోయే కొత్త చిత్రంలో హీరోయిన్‌గా కైరాని ఎంపిక చేసే ఆలోచనలో వున్నారట.

● కైరా అద్వానీ

## విలన్‌పై మోజు

తమిళంలో హీరోలుగా నటించే వారు తెలుగులో విలన్‌లుగా నటించడానికి ఆసక్తి కనబరుస్తున్నారు. ఆమధ్య ఆర్య 'వరుడు'లో, ఆది పినిశెట్టి 'సరైనోడు'లో, 'స్పైడర్'లో భరత్ విలన్‌గా నటించి మెప్పించారు. ఇప్పుడు మరో తమిళ హీరో కూడా తెలుగులో విలన్ వేషానికి 'సై' అంటున్నాడు. తెలుగు వాడైన విశాల్ తమిళంలో హీరోగా బాగా గుర్తింపు తెచ్చుకున్నాడు. కానీ తెలుగులో ఎందుకనో అతనికి హీరో చాన్సులు రావడం లేదు. అందుకనే కాబోలు ఇప్పుడు స్ట్రెయిట్ తెలుగు చిత్రంలో విలన్‌గా నటించడానికైనా రెడీ అంటున్నాడు.

● విశాల్




# జలంధర



reachjijji@gmail.com

**రావు (???)**

మేడం! నేను మైత్రి బాగా ఫాలో అవుతాను. ముందు మా అక్కయ్య, మా అమ్మ చెబితే పట్టించుకోలేదు. కానీ..తరువాత నేను మీకు ఫాన్ అయ్యాను. పున్నాగపూలు మూడుసార్లు చదివాను. మీ మైత్రి చదువుతూవుంటే, నాకు ఒక సందేహం కలుగుతోంది. మీరు ప్రతి విషయంలో పాజిటివిటీ చూస్తారు. చూడాలని చెప్తారు. సబ్‌కాన్షియస్‌కు మెసేజ్ అర్థమైతే, దానికి ఎమోషన్ అర్థమైతే అనుకున్నది జరుగుతుంది అంటారు. నేను రెండు విషయాల్లో చాలా సమస్యలు అనుకున్నవి సాల్వ్ చెయ్యగలిగాను.

మీరు మంత్రశాస్త్రాన్ని, సైకిక్ సైన్సెస్‌ను, మెడిటేషన్, ప్రేయరు, ఒక్కొక్కసారి పూజలు - ఇవన్నీ నమ్ముతారు (బహుశా ఆచరిస్తారు కూడా) మళ్లీ మానవత, సంఘంలో అసమానత, స్త్రీ వివక్షత, కుల వ్యవస్థ - హిపోక్రసీని అమానుషత్వాన్ని తూర్పారబడతారు. మరొక్కపక్క ప్రతిరోజూ 'థాంక్యూ', 'సారీ' మిర్రర్ ఎక్సర్‌సైజ్, మైండ్‌పవరు, అఫర్మేషన్స్ నమ్ముతారు, చెప్తారు. మీరు ఆచరించడమే మీ సక్సెస్ కూడానేమో! మీరు దైవాన్ని, కర్మసిద్ధాంతాన్ని గురించి వివరిస్తారు. .

మరి భగవంతుడు, ధర్మం, మతం ఇవన్నీ ఒకటిని అనుసరించి మరొకటి ఉంటాయి కదా! దేముడిని, పూజలను, సంఘ ధర్మాలను నమ్మకపోతే, అరాచకము రాదా!

నాకు చాలా కన్ఫ్యూజింగ్‌గా ఉన్నది మేడం. కొంచెం నాకు అర్థమయ్యేట్టు చెప్పరా?!

★ చాలా కష్టమైన ప్రశ్నలు వేశారు. నా బుద్ధికి తోచినంతవరకు జవాబు చెబుతాను. నేను చెప్పేది మీరు ఫాలో అవడానికి కాదు. కేవలం అక్కడినుంచి ప్రారంభించి ఆలోచించడానికే.

దేముడు, ధర్మము, పూజలు, అరాచకం - ఇవన్నీ కలగూరగంప కింద కట్టి ఆలోచించకుండా, విడివిడిగా ఆలోచించండి. భగవత్ భక్తి ఇది ఆత్మకు సంబంధించింది. వైబ్రేషన్స్‌వల్ల వేవ్‌లెన్త్‌వల్ల మారుతుంది.

ధర్మం అంటే... దేశాన్నిబట్టి, కాలాన్నిబట్టి, పాత్రనుబట్టి అంటే మన కర్తవ్యమేమిటోగ్రహించి దానికి తగినట్టు, ఆచారవ్యవహారాలు, పద్ధతులు ఏర్పరుచుకోవడం. కొంతమంది స్వార్థపరులు మనను ఒప్పించి, కట్టుబాట్లలో పెడదామనుకుంటారు. మనను భయపెట్టి, నిస్సహాయుల్ని చేసి, లొంగదీసుకునే అరాచకత్వం మానవుల్లో పెరిగిపోవడం వలన వచ్చింది. నిజంగా చెప్పే ధర్మాలు, నీతులు ఆచరిస్తే, వాటిలో నిజముంటే, ఇంత అధర్మం, అరాచకం రాకూడదుగా! గౌరవం పొందడానికో, ఎదుటివాడిని లొంగదీసుకోడానికో, లేదా ధనాశతోనో చెప్పేవి ఎంత గొప్పగా కనిపించినా జనానికి ఉపయోగపడవు. కాబట్టి ఈ ఎగో ప్రదర్శనకు, అది తెచ్చే అరాచకానికి భగవంతుడికి 'లింకు' లేదు.

భగవంతుడనే అద్భుతమైన వైబ్రేషన్ మనం అడిగినా, అడక్కపోయినా, గుర్తించినా, గుర్తించకపోయినా వెన్నెలలా అణువణువులో మన చుట్టూ వ్యాపించి ఉంటుంది.

"నన్ను నువ్వు గుర్తించి పూజించి, దండలు వేయలేదు కాబట్టి, నేను నిన్ను కరుణించను" అనే నిరంకుశత్వానికి, ప్రేమరాహిత్యానికి ఆ డివైన్ ఎనర్జీకి సంబంధం లేదు.

ఇక్కడ మీకొక ఆశ్చర్యకరమైన విషయం చెప్తాను. డెన్మార్క్, నార్వే, స్వీడన్ - ఈ మూడు దేశాలు..ఐక్యరాజసమితి ప్రతి సంవత్సరం ప్రకటించే ఐశ్వర్యం, ఆనందం, హాయి విషయంలో అత్యున్నతస్థాయిలో ఉండే దేశాలుగా ప్రకటించబడ్డాయి. ఈ దేశాల్లో క్రైమ్ రేట్ అత్యంత తక్కువ శాతం ఉంటుందిట. నోబుల్ ప్రైజ్ వచ్చిన వాళ్ళలో చాలా మంది ఈ దేశాలకు పౌరులే. వాళ్ల GDPలో పెద్దశాతం ఆర్తులకు, అవసరమైనవారికి, మిగతావారి ఆనందానికి డొనేషన్‌గా ఇచ్చే మహాత్ములు ఈ దేశాల జనాభాలో ఎక్కువ శాతం ఉన్నారట. రోజుకు ఐదుసార్లు ప్రార్థనో, రెండుసార్లు జపమో చెయ్యకపోతే నరకానికి పోవడం గురించి వారిని ఎవరూ భయపెట్టలేదు. వారికి, వారి జీవన విధానం 'అభద్రతా భావాన్ని' ఇవ్వడం లేదు. ఆనందంగా హాయిగా జీవించడాన్ని గిల్టీగా ఫీలవరు. భగవత్తత్వం - స్వర్గధామం - ఇది వారు ఈ పేర్లు లేకుండా అనుభవిస్తున్నారు.

ఎక్కడ దేనివలన కానీ unconditional love, ఆనందం వైబ్రేట్ అవుతుందో అదే దైవత్వం. ప్రకృతి ధర్మం - సంఘ ధర్మం రెండూ సమానాంతర రేఖలుగా ఉన్నప్పుడు - తెలివిగలవాడు సంఘ ధర్మానికి తామరాకు మీద నీటిబొట్టులా వుండి, ప్రకృతి ధర్మాన్ని గౌరవించి, హాయిగా బ్రతుకుతాడు.

సంఘసంస్కర్త, ఈ సంఘధర్మాన్ని ఎదిరించి, పోరాడి తన తోటివారిని రక్షించాలనుకుంటాడు. పైగా సంఘధర్మాన్ని మట్టుబెట్టాలని చూస్తాడు. ఆచారం వర్ధిల్లాలని ప్రయత్నించే ఏ మతాధికారులు క్షేమం, రక్షణ ఇవ్వడం లేదు. భయం, బానిసత్వం పెంచితే అది మత ధర్మమేమిటి?! పైన చెప్పుకున్న డెన్మార్క్, నార్వే, స్వీడన్ విలువల అభివృద్ధిలో ఉన్నాయిగా. అక్కడ ఉండే అద్భుతమైన ఎనర్జీ, అదే భగవంతుడు నా దృష్టిలో.

మీరు మరింత గొప్పగా ఆలోచించి, మథించి, శోధించి జీవితాన్ని మలుచుకోండి. దైవికమైన ప్రేమ, మన జీవితం మీద మనకు గౌరవం, ప్రదర్శన ఆక్కర్లేని కరుణ, మన చుట్టూ ఉండే ఆనందకరమైన వైబ్రేషన్స్ పెంచి, 'హాయి'ని ఇస్తే, పూజ, వ్రతం, హోమం, నమాజు, ప్రేయర్..ఏదైనా గొప్పదే.

అందుకే మన మైత్రిలో రోజూ పింక్ ఎనర్జీ పంపండి - మీరు చేసే ప్రేయర్, మెడిటేషన్, హీలింగ్ ఎందులోనైనా సరే, ప్రపంచశాంతి, మన దేశ అభ్యుదయం, మన నదులన్నీ "healing energy', "Loving energy' తో ఛార్జ్ అవడం, మన రైతులు, సైనికులు, రక్షణ, ప్రభుత్వానికి దిశానిర్దేశం - ప్రతి రోజూ కొన్ని వేలమంది ఈ రకమైన ప్రార్థన చేస్తే మన దేశంలో మార్పు వస్తుంది" అని పదే పదే హెచ్చరించడం, అప్పుడు Collective consciousness లో మార్పు వస్తుంది.

అందుకని ప్రతిరోజూ మీరు చెప్పుకునే సంకల్పంలో ఈ పాయింట్స్ ఉన్నాయా?! అని చెక్ చేసుకోండి. అలా జరుగుతున్నట్టు విజువలైజ్ చెయ్యండి. అప్పుడు మీరు ఎంత ఆనందంగా ఉంటారో ఆనందాన్ని ఎమోషనల్‌గా చెప్పండి. అప్పుడు కానీ, ఈ ప్రేయర్ పని చెయ్యదు. అదేమిటి? ప్రతిసారీ "లోకాసమస్తా, సుఖినోభవంతు" అంటున్నాం కదా అన్న మాటలో "సారం" ఉన్నదా?! అది యాంత్రికంగా వస్తోందా? ఎనర్జీతో, ప్రేమతో, కళ్లు తడిపేటంత ఎమోషనల్‌తో వస్తోందా?! పరీక్షించుకోండి.

మనం చెప్పుకున్న దేశాల జీవనసరళిలో ఈ వైబ్రేషన్ ఏ పద్ధతిలోనో నిబిడీకృతమై ఉన్నదీ గమనిద్దాం, నేర్చుకుందాం.

All the best.

★




# భార్యంటే సేవకురాలా?

**రామకూరు లక్ష్మీమణి** (హైదరాబాద్)

ఒక స్త్రీ, ఒక పురుషుడు కలిసివుండి, వారి ద్వారా సంతానోత్పత్తి జరిగి, వంశాభివృద్ధి చెందడానికి వివాహవ్యవస్థ ఏర్పడింది. ఏ మతమయినా, కులమయినా, జాతి అయినా వృద్ధిచెందాలంటే వివాహం అనే బంధంతో కలిసి వుండాలనే ఏర్పాటును మన పూర్వీకులు చేశారు. ఇది కొన్ని తరాలుగా, ఇంకా చెప్పాలంటే కొన్ని యుగాలుగా వస్తున్న సాంప్రదాయం. అందుకే భార్యభర్తలబంధం ఎంతో గొప్పది. భార్యలేందే భర్త లేడు, భర్త లేందే భార్య లేదు. ఒకరినొకరు అర్థంచేసుకుని, సంసారం చేసుకుంటే ఆ ఇల్లే స్వర్గసీమ. వారికి పుట్టిన పిల్లలు ఆ స్వర్గంలో విహరిస్తారు.

ఒకప్పుడు మనకి కన్యాశుల్కం అనే పద్ధతి ఉండేది. అంటే మగవాడు, ఆడపిల్ల తల్లిదండ్రులకు కొంత డబ్బు ఇచ్చి, వాళ్ల అమ్మాయిని తన ఇంటికి తెచ్చుకునేవాడు. ఆ క్రమంలో ఆడపిల్లల తల్లిదండ్రులు వారిచ్చే డబ్బుకులోబడి, వయస్సుతో, గుణాలతో, అందంతో సంబంధం లేకుండా తమ ఆడపిల్లల్ని వారికిచ్చి పెళ్లిచేసేవారు. ఒక్కోసారి బాల్యవివాహాలు కూడా జరిగేవి. కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావుగారులాంటి సంఘ సంస్కర్తలు ఎంతో పోరాడి, కొంత మార్పుని తేగలిగారు. అయితే, ఆ తర్వాత వరకట్నం వచ్చింది. ఇప్పుడు ఈ వ్యవస్థలో ఆడపిల్లే ఎదురు డబ్బులివ్వాలి. అసలీ పరిస్థితి ఎందుకు ఏర్పడిందో అర్థంకావడం లేదు. ఆడదానికి, మగవాడితోడు ఎంత అవసరమో, మగవాడికి ఆడదాని అవసరం కూడా అంతే ఉంది. మగవారి వంశాభివృద్ధికి ఆడదికావాలి కదా! పెళ్లి అయిన తర్వాత తన ఇంటిపేరును కూడా మార్చుకుని, అత్తింట్లో అడుగుపెట్టిన ఆడపిల్ల, తన అత్తింటివారి కోసమే జీవితం అంకితం చేస్తోంది. తన భర్త, తన పిల్లలు, తన అత్తమామలు అంటూ వారందరినీ కలుపుకునిపోతోంది.

అలాంటి పరిస్థితులలో భర్త ఆమెను ఏవిధంగా చూసుకోవాలి? ఒక సేవకురాలిగానా, ఒక కుటుంబ సభ్యురాలిగానా అన్న విషయం భర్త ఆలోచించాలి. సంబంధాలు కలుపుకున్నప్పుడు ఒకరి గురించి ఒకరు తెలుసుకున్నాక, అన్నీ నచ్చి పెళ్లి చేసుకోవడానికి సిద్ధపడతారు కానీ పెళ్లి అయిన తర్వాత మాత్రం, నిన్ను ఉద్ధరించడానికే పెళ్లి చేసుకున్నాను అన్నట్టుగా ప్రవర్తిస్తారు. భార్య స్థానాన్ని ఒక సేవకురాలిగానే ఉంచుతారు. కూర్చున్న చోటునుండి అది ఇవ్వు, ఇది ఇవ్వు అంటూ ఆజ్ఞలు జారీచేస్తారు. ఇంటి పని, వంట పని చేసి, ఆరోగ్యాన్నీ పణంగా పెడుతుంది ఆడది. భర్తకు ఎదురు చెప్పలేదు. ఎందుకంటే ఎదురుచెబితే గొడవలు అవుతాయి. ఒక్కోసారి దెబ్బలు కూడా తినాల్సివస్తోంది. కొంతమంది భర్తలు, తాము ఏదో ఎడ్జెస్టు అవుతున్నాము అన్నట్టుగా మాట్లాడతారు. ఒక్కోసారి చుట్టా లందరి ముందూ, భార్యని హేళన చేస్తూ అవమానకరంగా మాట్లాడతారు. పెళ్లయి ఎన్నో ఏళ్లయినా, వారు అలాగే మాట్లాడుతూ ఉంటారు. జీవితమంతా సర్దుకుపోతూ ఉన్నట్టు ఫోజులు కొడుతూ ఉంటారు. వారన్న మాటలకు ఎదిరించే భార్యలయితే, ఇక ఆ ఇల్లు రణరంగమవుతుంది. ఏమీ అనకుండా ఎందుకులే రగడ, అనుకునే భార్యలుంటే, ఇక వారి సణుగుడుకు అంతే ఉండదు. తాము చేసే పనులు నచ్చకపోయినా, భార్యలు సర్దుకుపోతున్నారనే విషయాన్ని వారు గ్రహించరు. వారు అన్నీ సవ్యంగా చేస్తున్నామనే ధీమాతో ఉంటారు. ఎందుకంటే, భార్యలు వారికి ఎదురు చెప్పరు కనుక. ఎదురుచెపితే మాత్రం ఇక ఆ ఇల్లు నరకమే! అలా కాకుండా ఈ సంసారం మనది, ఈ ఇల్లు మనది. ఇద్దరం మన సంసారం కోసం కష్టపడాలి. ఇందులో ఒకరు తక్కువ, ఒకరు ఎక్కువ అనుకోకుండా ఉండాలి. ఒకరిని ఒకరు సంప్రదించుకుని ఇద్దరూ సమానంగా కష్టపడాలి. అప్పుడు గృహమే స్వర్గసీమ అవుతుంది కదా! ఏమంటారు? ఆలోచించండి. భార్యాభర్తలు ఒకరి మనస్సులు ఒకరు నొప్పించకుండా హాయిగా ఉంటే, ఆ ఇల్లే భూతలస్వర్గం కాదంటారా?! ఆలోచించండి. ○

## ఇరుగు పొరుగు వారి సెంటిమెంట్సును గౌరవించండి

మా కాంప్లెక్స్‌లో 24 ఫ్లాట్స్ వున్నాయి. అందరం కలిసి మెలిసి వుంటాము. కానీ ఎవరింట్లోనైనా ఏదైనా ఫంక్షన్స్ జరిగినపుడు చాలా ఇబ్బంది పడుతుంటాము. శాఖాహారులు, మాంసాహారులు వున్నారు. అందరూ వాళ్ల వాళ్ల పద్ధతుల ప్రకారం చేసుకుంటారు, తింటారు. కానీ ఒక్కోసారి అందరికీ తెలిసేటట్టుగా అన్నీ చేస్తుంటారు. మిగిలిన వారు బాధ పడ్తారని అనుకోరు. మా యిల్లు మా ఇష్టం వచ్చినట్లు చేసుకుంటాం అంటారు. ఈమధ్య మా అపార్టుమెంటులో ఒక అబ్బాయి పెళ్లి అయింది. పెళ్లికి ముందు ఇంట్లో ఏదో ఫంక్షన్, అంతవరకు బావుంది, వాళ్లు మాంసాహారులు. ఒక మేకను తీసుకొచ్చి ఇంట్లోనే చంపి ఉపయోగించుకున్నారు. దానిని చంపే ముందు అది తప్పించుకుని నాలుగో ఫ్లోర్ నుంచి కిందకు దూకేసింది, కాళ్లు విరిగాయి. అది హృదయవిదారకంగా అరుపులు. వాళ్లు మాత్రం కిందకు వచ్చి దానిని తీసుకొని వెళ్లి వాళ్లపని వాళ్లు కానిచ్చుకున్నారు. మా పిల్లలు మేక ఎందుకు వచ్చిందమ్మా, వాళ్లు దానిని చంపేస్తారా? అని అడుగుతుంటే ఏం చెప్పాలో తెలీలేదు. అర్థం చేసుకుంటారని అనుకుంటున్నాను. ఈ విధంగా రాసినందుకు అన్యథా భావించకండి.

**-తల్లాప్రగడ రాజేశ్వరి** (హైదరాబాద్)

# కామెడీ అంటే ఇదా?

**టీ**వీ ఛానళ్ళలో కామెడీ షోలు 'వెర్రి ముదిరింది, రోకలి తలకి చుట్టండి' అన్నట్టుగా ఉన్నాయి ఒక ఛానల్‌లోని కామెడీ ప్రోగ్రామ్స్. కొన్ని మరీ వల్గర్‌గావుంటే, మరికొన్ని ఛానల్స్‌లో అవే కామెడీ పోగ్రామ్స్, అవే వల్గర్ జోక్స్. పైగా ప్రతి కామెడీ పోగ్రామ్స్‌లోనూ కనబడేదీ వాళ్ళే. క్రొత్తముఖాలే కనబడవు. ఒక వేళ కనబడినా, వాళ్ళూ అదేదో రాజమార్గం అయినట్టు, సీనియర్ కమెడిన్స్ నడిచే బాట లోనే నడుస్తున్నారు.

ఇక పురుషులే చీరలు ధరించి - భార్య, తల్లి, చెల్లి, కూతురు అంటూ అన్నిపాత్రలూ తామే ధరించడం, అదేదో గొప్ప ఘనకార్యం లాగా భావించడం జరుగుతోంది. ఇక భార్యాభర్తల పాత్రదారులు ఒకరిమీద ఒకరు వేసుకునే జోక్స్‌గానీ, నటించే విధానంగానీ వినేట్టు, చూసేట్టుగా ఉండవు.

లేడీస్ ఏ డ్రెస్ వేసుకున్నా, పురుషులకంటే బాగానే ఉంటారు.

పురుషులు, స్త్రీ పాత్రలు ధరిస్తే, డిగ్నిటీని, కల్చర్‌ని ఫాలో అయ్యే స్త్రీలే కాదు పురుషులు కూడా అటువంటి ప్రోగ్రామ్స్ ఆదరించరు. పైగా భార్యాభర్తలు వల్గర్‌గా ఒకరిమీద ఒకరు వేసుకునే జోక్స్ (ప్రోగ్రామ్స్) నటన చూస్తుంటే, పెళ్ళి చేసుకునేవారికి పెళ్ళిమీద విరక్తిపుట్టక మానదు. టీవీ, ఆకాశవాణి, సినిమా ఏవి అయినా జోక్స్ బాగుంటేనే ఆదరిస్తారు. ఇకనైనా కామెడీ ప్రోగ్రామ్స్ చేసేవారు, మంచి జోక్స్ ప్రచారం చేస్తే బాగుంటుంది. అలాగే తమ పర్సనాలిటీ, బాడీ లాంగ్వేజ్, రూపం వంటివి దృష్టిలో పెట్టుకుని నటిస్తే ఇంకా బాగుంటుంది. జోక్స్ అంటే వెగటుపుట్టి, ఛానల్స్ కట్టేస్తున్న మాలాంటి ప్రేక్షకులు మళ్ళీ కామెడీ ఛానల్స్ చూస్తారేమో ఆలోచించండి.

అలాగే యాంకర్స్, సెలబ్రెటీస్ కూడా డిగ్నిటీని మెయిన్‌టైన్ చేస్తున్నట్టయితే, ఆ ప్రోగ్రామ్స్ బాగుంటాయి. ఇంత ఇంపార్టెంట్ విషయాన్ని అన్ని టీవీఛానల్స్ వాళ్ళుకూడా దృష్టిలో ఉంచుకోవడం కూడా మంచిదని గ్రహించగలరు.

**-ఎన్.లీలాప్రసూనాదేవి**
(సికింద్రాబాద్)

# ఆలోచించండి



ప్రతివాళ్ళకీ ఎన్నో ఆలోచనలు మదిలో మెదులుతూనే ఉంటాయి. వాటిలో మీ వ్యక్తిగత జీవితానికి సంబంధించినవి భద్రంగా దాచుకోండి. సమాజం గురించీ, దేశం గురించీ, అందరికీ సమస్యలుగా తయారయ్యే విషయాల గురించీ మీకొచ్చే ఆలోచనలని ఆంధ్రభూమి వారపత్రికలో మీ సహపాఠకులతో పంచుకోండి. వీలైతే మీకు తోచిన పరిష్కారాలు చెప్పండి. మంచి సూచనలు చేయండి. మీ మనసులో మాటల్ని రెండు అరఠావు పేజీల్లో అక్షరాలుగా కూర్చి కాగితం మీద పెట్టండి. మీ పాస్ పోర్టు సైజు ఫోటో జత చేయండి. మీ ఆలోచనలు ఎందరికో కనువిప్పు కలిగించవచ్చు. కొందరికి ఓదార్పు నివ్వచ్చు. సమాజానికి మేలు కొలుపూ కావొచ్చు.

మీ ఆలోచనలు
పంపాల్సిన చిరునామా:

**ఆలోచించండి**

ఎడిటర్,
ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక,
36, సరోజినీదేవి రోడ్,
సికింద్రాబాద్-500003.

ఇది మీకోసం!
ఇందులో మీరే
రాయాలి మరి!




# బతకనేర్చినవాళ్ళు



ఎవరో ఏదో అన్నారని పుట్టుకతోనో, పెరిగే వయసుతోనో వచ్చే స్వభావాలు అంత త్వరగా ఒక పట్టాన మారేవి కాదు! 'పుట్టుకతో వచ్చిన బుద్ధి..'' అంటారు అందుకే.

పొద్దున్నే నిద్రలేచినప్పటినుంచీ మళ్ళీ రాత్రికి పక్కమీదకు చేరి నిద్రకొరిగేవరకూ.. రోజంతా ఎన్ని పనులు చేయాల్సివస్తుందో... ఎన్ని వ్యవహారాలు నడపాల్సి వస్తుందో.. మన ఇంట్లో మనవాళ్ళతోకాక ఎన్నిచోట్లకు వెళ్ళాల్సి వస్తుందో... ఎంత మందిని కలవాల్సి వస్తుందో!

ఈ దైనందిన కార్యకలాపాలు అందరి జీవితాల్లోనూ చాలా సహజమైనవీ... తప్పనిసరి అయినవీ అయినా వాటిని ఒక్కొక్కరు నిర్వహించే తీరు ఒక్కోరకంగా ఉంటుంది... చూసి తీరాల్సిందే! మనుషుల్ని అబ్జర్వ్ చేయటం నాకు అలవాటు. అది నేను నేర్చిన విద్య కనుక.. వాళ్ళ వాళ్ళ స్వభావాన్ని బట్టి ధైర్యసాహసాలు, చొరవనుబట్టి చూసేవాళ్ళకు చూడ ముచ్చట.. కన్నులకు కావాల్సినంత విందు అన్నట్టుగా తమాషాగా ఉంటుంది.

అంతేకాదు ఒక్కోసారి.. అన్యాయాన్ని, వోవరాక్షన్ను సహించలేని వాళ్ళకు ఒళ్ళు మండేదిగా కూడా ఉంటుంది.

ఈ రకరకాల మనుషుల్లో నేనొక నమూనా..!

నేను చాలా సిగ్గరిని.. మొహమాటస్తుడిని.. అంతర్ముఖుడిని కూడా కనుక లోలోపల ఉడుక్కోవటమేగానీ బయటికి నా గొంతు పెగలదు.

నా ముఖం మీద ఏం రాసిపెట్టి ఉంటుందోగానీ నన్ను చూసిన వాళ్ళందరూ.. 'నోట్లో నాలుకలేని మనిషి!' అంటారు.

నాలుక ఎందుకు లేదూ నోట్లో.. నిక్షేపంగా ఉంది, కాకుంటే దాన్ని ఎక్కువగా ఉపయోగించను. అందుకే ఎక్కడికన్నా వెళ్ళి ఏదయినా పని చేసుకునిరావటం అంటే అది పెద్ద సమస్య అయి కూర్చుంటుంది నా విషయంలో.

చిన్నప్పుడు అమ్మ రేషన్‌షాపుకెళ్ళి.. షుగర్ పట్టుకు రారా అని కార్డు, సంచీ ఇచ్చి పంపిస్తే... అక్కడ ఆల్రెడీ ఉన్న పెద్ద 'క్యూ' చూసి బెంబేలెత్తిపోయేవాడిని. 'క్యూ'లో అమాయక ముఖం పెట్టుకుని నిల్చున్న నన్ను చూసి.. నా వెనుక నిల్చున్న వాళ్ళు 'బాబూ.. ఒక్క నిముషం.. నువ్వు కుర్రాడివికదా.. నేను ఎక్కువసేపు నిల్చోలేను' అని ఒకరూ, 'అబ్బాయ్! కొంచెం నన్ను ముందు వెళ్ళనివ్వవా.. చంటిపిల్లనెత్తుకుని ఇందాకటి నుంచీ ఎండలో నిల్చున్నాను' అంటూ మరొకరూ నన్ను వెనక్కు నెట్టి, వాళ్ళు ముందుకు వెళ్ళిపోయేవాళ్ళు. ఎవరికీ ఎదురు చెప్పటం, పోట్లాడటం చేతకాని నేను అలా నిల్చున్నవాడ్ని అలాగే వెనుక నిల్చుని పోయేవాడిని. ఈలోగా దుకాణం టైమ్ అయిపోవడమో... సరుకు అయిపోవడమో జరిగేది. ఖాళీ చేతులతో ఇంటికొచ్చిన నన్ను అమ్మ 'నీకు ఏ పనీ చేతకాదేంటిరా?' అని కోపం

డా.కొరారి
వాణీ చలపతిరావు

చేసేది.

ఒక్కో రోజు - మా వీధి చివరలో ఉన్న కూరగాయల మార్కెట్‌కి అమ్మ నన్ను ఏ వంకాయలో, బెండకాయలో తెమ్మని పంపిస్తే షాప్ వాడు బాస్కెట్‌లో ఏవి పోస్తే అవి తెచ్చేవాడ్ని. అమ్మ వాటిని కిందకు వంపి 'ఇదేంటిరా.. పుచ్చిపోయిన వంకాయలు, ముదిరిపోయిన బెండకాయలూ తెచ్చావు.. చూసుకుని మంచివి ఏరలేదా.. ఇంత బుర్ర తక్కువ వాడివేంటిరా?' అని చీవాట్లు పెట్టేది.

నాన్న డబ్బులు తెమ్మని ఏటీఎమ్‌కి పంపించినా, కరెంట్ బిల్లో, వాటర్ బిల్లో కట్టి రమ్మన్నా అలాంటిదే ఏదో ఒకటి జరిగేది. దాంతో నాన్న 'ఫూలిష్ ఫెలో..' 'చిన్న చిన్న పనులు కూడా చెయ్యటం రాని వాడివి ఈ లోకంలో ఎలా బతుకుతావురా?' అనేవాడు.

'ఇలా అయితే అందరూ నిన్ను ఆడిస్తారు.. నిన్ను ఉపయోగించుకుంటారు. అలుసైపోతావు. జాగ్రత్త!" అని ఇద్దరూ కలిసి యుగళగీతం పాడుతున్నట్టు హెచ్చరించేవారు.

ఇప్పుడు నా వయసు ఇరవై ఎనిమిది సంవత్సరాలు.. డిగ్రీ పాసై, ఎమ్.బి.ఏ. కూడా చేసాను.. 'చదువు ఎలా అబ్బిందని' ఆశ్చర్యపోవాల్సిన అవసరం లేదు. చదువులో నేను దిట్టనే..!

క్లాసులో టీచర్ చెప్పిన పాఠాలను, ఇంటికొచ్చి మెదడులో వేసి.. బాగానే రుబ్బుతాను..

నోట్సులు రాసుకోవడం, అస్తమానం చదవడం, పరీక్షలకు కష్టపడి ప్రిపేరవ్వడం, పేజీలకు పేజీలు రాసిపడేసి మార్కులు దండిగా తెచ్చుకోవడం.. ఇలాంటివన్నీ నాకు వెన్నతో పెట్టిన విద్యలు.

కాకుంటే లోకజ్ఞానం, లౌక్యం, బతకనేర్చినతనం... ఇవే తక్కువ.. లేక శూన్యం.

అందుకే డిగ్రీలయితే తెచ్చుకోగలిగాను గానీ ఉద్యోగం సంపాదించటం అనేసరికి నా స్వభావమే నాకు పెద్ద ఆటంకంగా తయారయింది. ఎక్కే ఆఫీస్ మెట్లు దిగే ఆఫీస్ మెట్లు అన్నట్టయింది నా పరిస్థితి. దాంతో - ఇలా అయితే లాభం లేదని నాన్న తన ఇన్‌ఫ్లూయెన్స్ ఉపయోగించి రికమెండేషన్ లెటర్‌ని ఒక పెద్ద తలకాయ నుంచి సంపాదించారు. అలా వచ్చింది ప్రస్తుతం చేస్తున్న ఉద్యోగం.

ఒక్కసారి ఫ్లాష్‌బ్యాక్‌లోకి వెళ్ళి.....

ఇంటర్వ్యూ సమయంలో నా బాడీలాంగ్వేజ్, నా బిహేవియర్ ఎలా మైనస్ పాయింట్లయ్యాయో చెప్పటానికి ఒక్క ఉదాహరణ చెబుతాను.

ఒకసారి ఒక ఆఫీసులో జూనియర్ ఆఫీసర్ పోస్ట్‌కి ఇంటర్వ్యూకి వెళ్ళాను. అక్కడ దిగ్గజాల్లాంటి సెలక్షన్ కమిటీ మెంబర్స్ నలుగురు ఉన్నారు. వాళ్ళను చూడగానే నాకు కాస్త కాళ్ళు వణికి, గుండె దడ పెరిగిన మాట వాస్తవం.




అందులోనూ నాకు కాస్త మొహమాటం, అతి వినయం కదా..!

"మిస్టర్ సుకుమార్! టేక్ యువర్ సీట్!" అని వాళ్ళలో ఒకరు అనగానే నిల్చున్నచోటే మెలికలు తిరిగిపోతూ "ఫరవాలేదు సార్!" అన్నాను. మళ్ళీ ఇంకోసారి సీట్ ఆఫర్ చేసినా మళ్ళీ అలాగే సమాధానం చెప్పాను.

జాబ్‌కు సెలెక్ట్ కాలేదు.

ఇంటికెళ్ళాక నాన్న 'ఇంటర్వ్యూ ఎలా చేసావ్?' అని అడిగితే,

బుద్ధిగా 'రాముడు మంచి బాలుడు' స్టైల్‌లో జరిగింది చెప్పాను.

నాన్న "నువ్వెళ్ళింది ఆఫీసర్ పోస్ట్ ఇంటర్వ్యూకా, ప్యూన్ పోస్ట్‌కా?" అంటూ మొహం వాచిపోయేలా చివాట్లు పెట్టాడు. 'వినయం' కూడా ఎక్కడ ప్రదర్శించాలో అక్కడే ప్రదర్శించాలని అప్పుడు అర్థమయింది నాకు.

డ్యాషింగ్, డేరింగ్, సెల్ఫ్ రెస్పెక్ట్ రాజ్యమేలుతున్న కాలంలో.. మెతకదనం మైనస్ పాయింట్ కాకుండా ఎలా ఉంటుంది. నా విషయంలో అదే

జరిగింది. దాంతో మరో మార్గంలో జాబ్ సంపాదించవలసి వచ్చింది.

'ఉద్యోగం పురుష లక్షణం' కదా.. అదీగాక బతకడానికి ఉద్యోగం చేసి డబ్బు సంపాదించక తప్పదు.

మీదు మిక్కిలి మగపిల్లాడికి ఉద్యోగం లేకుంటే పెళ్ళి కావటం కష్టం... పిల్లనెవ్వరూ ఇవ్వరు..!

ఈ మాటలు మా అమ్మా, నాన్నల ఉవాచ.

ఎందుకంటే నాకు సంబంధాలు చూస్తున్నారు గనుక..!

ఆడపిల్లలకు సంబంధాలు చూసే రోజులు పోయి ఇప్పుడు మగపిల్లలకు సంబంధాలు చూడాల్సిన రోజులు వచ్చాయి కదా?

అక్కడా నాకు అవమానాలు ఎదుర్కోక తప్పలేదు.

అమ్మ నా పెళ్ళి ముచ్చట తేగానే నాన్న "వాడసలే అమాయక చక్రవర్తి. వచ్చే అమ్మాయి కూడా అలాంటిదే వచ్చిందంటే సంసారం ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్టు ఉంటుంది. కాస్త లోకం, లౌక్యం తెలిసిన అమ్మాయిని సెలెక్ట్ చేయాలి" అనటం నాకు తలకొట్టేసినంత పని అయింది.

అయినా ఏమీ అనలేని పరిస్థితి కదా నాది!

ఎవరో ఏదో అన్నారని పుట్టుకతోనో, పెరిగే వయసుతోనో వచ్చే స్వభావాలు అంత త్వరగా - ఒక పట్టాన మారేవి కాదు కదా! 'పుట్టుకతో వచ్చిన బుద్ధి..' అంటారు అందుకే.

అమ్మా వాళ్ళు తీసుకెళ్ళిన పెళ్ళిచూపులకు తలవంచుకుని, వాళ్ళతో కలిసి వెళ్ళాను. చూపించిన అమ్మాయినల్లా చూశాను.

చివరకు వాళ్ళు నెల్లూరు సంబంధం అమ్మాయి మెళ్ళో తాళి కట్టమంటే కట్టేసాను.

నా భార్య పేరు రమణి.

* * *

రమణి ముద్దబంతి పువ్వులాంటి గుండ్రటి.. పచ్చటి ముఖంతో.. కొంచెం బొద్దుగా ఉండే శరీరాకృతితో ఉంటుంది.

చురుకైన చూపులు, కంచులాంటి కంఠం, నవ్వుతూ ఉండే పెదాలు.. అవన్నీ రమణి ఎక్కడున్నా, ఆమెకో గుర్తింపును తెచ్చి పెట్టేలా ఉంటాయి.

నలుగురిలో ఉన్నప్పుడు గలగలా మాట్లాడుతుంది.

జంకూ గొంకూ లేకుండా ఏది చెప్పదలుచుకున్నా సూటిగా, సుత్తి లేకుండా మొహం మీద గుద్దినట్టు చెప్పేస్తుంది.

ఆ స్పీడు.. ఆ దూసుకుపోయే తత్వం చూసి ప్రతి దానికీ నేను కాస్త వెనకడుగు వేయటం నాకు తెలియకుండానే నాలో జరిగిపోతున్నాయి. ఆమె ముక్కుసూటి స్వభావం నాకు మరీ దినదినగండంగా మారిపోయింది.

"మీరేమిటండీ.. మన పెళ్ళిచూపులప్పుడు మరీ అలా చలిమిడి ముద్దలా కూర్చుండిపోయారు?" అంది పెళ్ళయిన కొత్తలో ఓరోజు.

"ఏం చేయాలి మరి.. హనుమంతుడిలా కుప్పిగంతులేయాలా?" అన్నాను అహం అడ్డురాగా.

"అవసరంలేదు... కూర్చున్న చోట కుదురుగా కూర్చునే కాబోయే పెళ్లాంమీద కనీసం ఓ కొంటె చూపు.. ఓ చిలిపి నవ్వు అయినా రువ్వవచ్చు కదా.. మా ఫ్రెండ్స్ అంతా 'నువ్వు కుందేలు, మీ ఆయన తాబేలు' అని ఆటపట్టించారు పెళ్ళిలో అందుకే" అని తను నవ్వుతుంటే నాకు ఒళ్ళు మండి...

"నేనంతే!" అని అక్కడి నుంచి లేచి బయటకు




## ఇది విన్నారా?



★ బూడిద రంగు ఉడుతలు పక్షుల్లాగే చెట్లమీద గూళ్ళు ఏర్పరచుకుంటాయి. కొమ్మలతో తయారు చేసిన ఆ గూళ్ళు చుట్టూ గడ్డితోనూ, ఈకలతోను, బెరళ్ళతోను, నాచుతోను లైనింగ్ వేస్తాయి.

★ ఉడుతల్లో మొత్తం 280 జాతులున్నాయి. వాటిలో ఎక్కువ చిన్న ఉడుతలే ఉంటాయి. వాటికి పెద్దకళ్ళు, గుబురు తోకలు ఉంటాయి.

★ ఉడుతలు మనుషుల్ని బాగా నమ్ముతాయి. మన చేతుల్లోంచి ఆహారం తీసుకుని తినగల అతి కొద్ది అడవి జంతువుల్లో అవి ఒకటి.

# ఇది విన్నారా?



★ శీతల దేశాల్లో ఉడుతలు ముందు జాగ్రత్తగా శీతాకాలానికి సరిపడా కాయలను, విత్తనాలను నిల్వ చేసుకుంటాయి.

★ శత్రువుల చేతికి చిక్కకుండా ఉండేందుకోసం, ఉడుతలు అడ్డదిడ్డంగా పరుగెత్తడం అలవాటుచేసుకున్నాయి.

★ ఉడుతలు చాలా తెలివైనవి. సాటి ఉడుతలో, శత్రువులో చూసేలా ఆహారాన్ని పూడ్చిపెడుతున్నట్టు భ్రమ కలిగిస్తాయి. నిజమైన ఆహారాన్ని ఎవరూ చూడని చోట నిల్వ చేసుకుంటాయి.

వచ్చేసాను.

మా ఆవిడ మరీ పాత సినిమాల్లో సూర్యకాంతంలా గద్దరిదేమీ కాదు గానీ.. ఎక్కడికెళ్ళినా పనులు చేసుకురావటంలో మాత్రం దిట్ట! మాటలతో ఎదుటివాళ్ళను దబాయించటం.. మళ్ళీ మాట్లాడకుండా నోరు మూయించడం వంటివి తను అవలీలగా చేసి పడేస్తుంది. అవతలి వాళ్ళను లొంగదీయడమే తప్ప తను లొంగటం అంటూ ఉండదు.

ఒకరోజు పొద్దున్నే నేను మా బాల్కనీలో పచార్లు చేస్తున్నాను. మా ఆవిడ అక్కడే కుర్చీ వేసుకుని కూర్చుంది.

ఇంతలో కింద రోడ్డుమీద కూరగాయల బండి వెళుతూ కనిపించింది.

"ఏయ్.. అబ్బాయ్! ఆగు!" అంటూ రమణి కూరలబుట్ట, పర్సు పట్టుకుని కిందకెళ్ళింది.

తమాషా ఏమిటంటే ఆ కూరలబ్బాయికి తెలుగు రాదు..

మా రమణికి హిందీ రాదు..

"క్యాహోనా అమ్మా... బైంగన్ పావ్ సాత్ రూపియా, బేండీ పావ్ పాంచ్ రూపియా!" అన్నాడు.

అర్థం కాని మా ఆవిడ... "ఏయ్... ఏం మాట్లాడుతున్నావ్.. తెలుగులో మాట్లాడు!" అంది గద్దిస్తూ.

"తెలుగూ నై ఆతా అమ్మా!" అన్నాడు కూరలబ్బాయ్.

దాంతో తనకు హిందీ రానందుకు రమణి సిగ్గుపడిపోతుందేమో అనుకున్నాను. కానీ అలా జరగలేదు...!

"ఏంటీ తెలుగు రాదా? తెలుగు రాష్ట్రంలో ఉంటూ, తెలుగు నేర్చుకోలేదా నువ్వు? భాష రాకుండా కూరలు కొనటానికి వచ్చే వాళ్ళతో అమ్మకం ఎలా చేద్దామనుకున్నావ్ నువ్వు?" అంటూ దబాయించింది.

దాంతో సగం మాటలు అర్థమై.. సగం మాటలు అర్థం కాని కూరలబ్బాయి బిత్తరపోయి చూసాడు.

తల గోక్కుంటూ నిల్చున్న అతన్ని "భాష నేర్చుకున్నాక మళ్ళీ ఈ బజారుకు రా!" అని వార్నింగ్ ఇచ్చి పంపించింది.

'ఆహా.. ఏం తెలివి!' అని ఆశ్చర్యంగా అలాగే చూస్తూ నిల్చుండిపోయాను నేను. 'ఇలాంటి వాళ్ళను.. బంగాళాఖాతంలో పడేసినా హాయిగా ఏ ఆధారమో దొరకపుచ్చుకుని ఈదుకుంటూ మళ్ళీ ఒడ్డుకు చేరుకోగలరు. అంతేకాదు.. ఆల్ ఇండియా లోనే కాదు.. హోల్ వరల్డ్‌లో ఎక్కడికి పంపినా బతకనేర్చినతనంతో నెట్టుకురాగలరు' అనిపించింది.

అలా అనిపించగానే నా భార్య తెలివితేటల ముందు నేను తేలిపోతున్నట్టు అనిపించి సిగ్గుపడిపోయాను నాలో నేను.

అలా ఒకసారా.. రెండు సార్లా.. ప్రతినిత్యం మా ఆవిడ లీలలు నన్ను అబ్బురపరుస్తూనే ఉన్నాయి.

ఆత్మన్యూనతకు నన్ను గురి చేస్తూనే ఉన్నాయి.

ఆరోజు నాకు ఫీవర్ వస్తే ఆఫీసుకు కూడా వెళ్ళకుండా లీవ్ పెట్టి ఇంట్లోనే ఉన్నాను.

"డాక్టర్ దగ్గరికి వెళ్దాం పదండి" అంటూ మా ఆవిడ నన్ను 'అదే తగ్గిపోతుందిలే' అంటున్నా వినకుండా బయలుదేరతీసింది.

మా కాలనీలో మా ఇంటికి కొంచెం దూరంగా.. ఓ మలిగెలో క్లినిక్ పెట్టిన ఫిజిషియన్ ఆయన.

ప్రాక్టీస్ బాగా ఉన్నవాడే!



మేం వెళ్ళేసరికి పేషెంట్లు, వాళ్ళ వెంట వచ్చిన వాళ్లతో అక్కడ అంతా కిటకిటలాడుతోంది.

"వామ్మో.. ఇంత జనమా.. మన నెంబర్ వచ్చేస రికి ఏ రెండు గంటల టైమో పడుతుంది.. వద్దులే వెళ్దాం పదా!" అన్నాను నేను.

"మీకు తెలియదు ఉండండి.. నేను లోపలికి తీసుకెళ్తాగా!" అంటూ కన్‌సల్టేషన్ రూమ్ ముంద రికి నా చెయ్యి పట్టుకుని తీసుకెళ్ళి నన్ను ముందు నిలబెట్టి నా పక్కన తను నిల్చుంది."అదేంటి?.." అని నేను ఆశ్చర్యపోతుంటే...

'ఉష్!' అని నాకు సైగ చేసింది.

ఆ అన్యాయానికి నాకు సిగ్గనిపించింది. పైగా ఎప్పటినుంచో వాళ్ళ వంతుకోసం ఎదురుచూస్తున్న మిగతా పేషెంట్లు మావంక ఆశ్చర్యంగా, కోపంగా చూస్తున్నారు.

"ఇదేంటి... ఇప్పుడు వచ్చి మీరు...?" అని ఒకా యన అడగనే అడిగాడు. ఈలోగా లోపలున్న పేషెంటు బయటకు వస్తున్నట్లుగా ఆకుపచ్చ కర్టెన్ కదిలింది.

"రండి!" అంటూ మా ఆవిడ రమణి నా చెయ్యి పట్టుకుని లోపలికి గుంజుకెళుతూ.. అడ్డువచ్చిన పేషెంట్‌నుద్దేశించి... "డాక్టర్‌గారు మా అన్ననే...! ముందు ఫోన్ చేసి, ఆయన రమ్మంటేనే వచ్చాం!" అంది గాలిలో చెయ్యూపుతూ.. నిటారుగా వెన్ను విరిచి నిల్చుని లోపలికి దూసుకుపోతూ...

'ఏం జరుగుతోందిక్కడ?' అన్న విషయం ఆక ళింపు కావటానికి నాకు ఒక నిముషం టైమ్ పట్టింది ఆ షాక్‌లో.

లోపలికెళ్ళి ముక్కు ముఖం తెలియని ఆ డాక్టర్ బావమరిదిని బిక్క ముఖం వేసుకుని కాసేపు చూసి.. ఆ తరువాత నవ్వాపుకోవటానికి మూతికి చెయ్యి అడ్డం పెట్టుకున్నాను.

'అమ్మ నా పెళ్ళామా... ఎన్ని తెలివితేటలే నీకు - గుండెలు తీసిన బంటువి నువ్వు.. అసలు అలాంటి ఆలోచన నీకు వచ్చినందుకూ.. అంత హైడ్రామాను అవలీలగా ఆడగలిగినందుకూ నీకు హేట్సాఫ్ చెప్పాలి!' అనుకున్నాను మనసులోనే.. మా ఆవిడ తెలివితేటలను పదే పదే తలుచుకుంటూ...

పెద్దగా చదువుకోలేదుగానీ, మా ఆవిడ చదువు కుని ఉంటే.. ఈ అఖండమైన తెలివితేటలకు ఏ ప్రైమ్‌మినిస్టర్ ఆఫ్ ఇండియానో అయి ఉండేది! అనుకున్నాను నేను మనసులోనే గుండెలు బాదు కుంటూ.

ఇంటికి తిరిగి వెళ్ళేటప్పుడు దారిలో.. నేను అదే మాట అంటే...

"ఉపాయం లేని వాడిని ఊళ్ళో నుంచి తరిమే యమన్నారు" అంది.

'అయితే ఇప్పుడు నన్ను ఇంట్లోనుంచి తరిమే స్తుందా?' అని కంగారుపడిపోయాను నేను.

ఏమాట కామాటే చెప్పుకోవాలి.. నేను ఆ రోజంతా మా ఆవిడ ధైర్యానికి, చొరవకు అబ్బురప డకుండా ఉండలేక పోయాను.

'బతక నేర్చిన మనిషి..! తన ముందున్నవాడ్ని వెనక్కినెట్టి, తనకన్నా పైన ఉన్నవాడ్ని.. కాలుపట్టి గుంజి కిందపడేసి ముందుకు నడుస్తూ తన పనులు భేషుగ్గా చక్కపెట్టుకరాగల చాకచక్యం ఆమెకుంది.

మఱ్ఱిచెట్టు నీడలో మరే ఇతర వృక్షాలు ఎదగ వంటారు....

మా ఆవిడలాంటి వాళ్ళ బారిన పడ్డ ఆ అల్పజీ వుల మాటేంటి..?

'ముక్కు సూటిగా పోయేవాళ్ళకు, పద్ధతిని పాటించే వాళ్ళకు పౌరధర్మాన్ని పాటించేవాళ్ళకు రోజులు కావా..? నోరున్నవాడిదే రాజ్యం అను కుంటా?' అనుకున్నాను నేను.. లోకం పోకడను నాలో నేను విశ్లేషించుకుంటూ.

○




## ఇది విన్నారా?



★ కామారెడ్డి జిల్లా పిట్లం మండలం లోని కిష్టాపూర్ తండాకి చెందిన పోత్రోచ్ చందర్‌కి తెల్సింది ఒక్కటే వ్యవసాయం. కొంత భూమి లేక ఎకరం భూమిని కౌలుకి తీసుకుని, అప్పుచేసి, మొక్కజొన్నపంటని పండించాడు. చేనులో కలుపుతీ యడానికి ఎడ్లు లేక తానే కాడె డ్లుగా మారి భార్య సాయంతో కలుపుతీస్తున్నాడు.

★ శత్రువుల బారినపడకుండా చెట్లను సర సరా ఎక్కేయడంలో ఉడుతలకి సాయపడేది పెద్దకళ్ళే. కాని, విచిత్రమేమిటంటే, పుట్టు కతో అవి గుడ్డివి. తర్వాతనే చూపు వస్తుంది.

# రాజముద్ర

- డా.వి.ఆర్.ఎల్.రాజేశ్వరీ చంద్రజ

vrlrchandraja@gmail.com

## జరిగిన కథ 14

మీనాక్షీ గ్రూప్ ఆఫ్ కంపెనీస్‌కి అధిపతి హర్షవర్థన్. హైదరాబాద్ నగరానికి దూరంగా వున్న భవనాన్ని చూసిన అతనికి ఎంతో నచ్చి దాన్ని కొనేస్తాడు. పెద్దగా ఆర్భాటాలేమీ లేకుండా భార్య అలకనంద, తల్లి మీనాక్షిదేవితో కలిసి ఇంట్లో దిగిపోతాడు. పూజలూ, వ్రతాలూ లాంటివాటి మీద బొత్తిగా నమ్మకంలేని హర్షకి- ఏదైనా పూజ చేసి, నలుగురికీ భోజనాలు పెట్టాలని తల్లి చెప్పడం నచ్చదు. తన భార్య అలకనంద పేరిట ఇంటిని రిజిస్టర్ చేయిస్తాడు. తమ ముగ్గురితోపాటు ఆ ఇంట్లో వుండేది వంటమనిషి సీత, పనివాడు గోస్వామి. ఆ ఇంటి గత యజమానులు దానికి 'రాజముద్ర' అనే పేరు పెట్టడం, అది హర్షకి కూడా నచ్చడంతో అలాగే ఉంచేస్తాడు. పార్సెల్ డెలివరీ చేయడానికొచ్చిన చందూ రాజముద్ర భవనం ముందే ప్రమాదానికి గురై గాయపడడంతో కంగారుపడుతుంది మీనాక్షీదేవి. దీక్షిత్‌కి ఆ ఇంటిపై పెద్ద గద్ద వచ్చి వాలడం అశుభంగా తోస్తుంది. తన మిత్రుడి కుటుంబాన్ని ఎలాగైనా రక్షించితీరాలని నిర్ణయించుకుంటాడు ప్రొఫెసర్ వరదరాజన్. స్టవ్ అంటించకుండా గదిలో మంటలు వ్యాపించడం ఏమిటో హర్ష, దీక్షిత్‌లకి అంతుపట్టదు. తనని కలవమని వరదరాజన్‌నించి ఫోన్ అందుకున్న దీక్షిత్ ఆ రాత్రి సమయంలో కారులో బయల్దేరతాడు.కెమెరాల్లో రికార్డయిన వీడియోల్ని చూసేందుకు హర్ష, వరదరాజన్ సిద్ధంగా వుంటారు. దుష్టశక్తిని పిలిచి సమస్యను తీర్చే ప్రమాదకరమైన ప్రయోగానికి సిద్ధమవుతారు వరదరాజన్, సుమతి. రాజముద్రలో నివసించే కుటుంబానికి అభివృద్ధి వుండదనీ, ఇంకా అనేక నష్టాలకు గురికావాల్సి వస్తుందని చెబుతాడు కులపతి.

"అంతకంటేనా? నేను చెప్తున్న వివరాలు నోట్ చేయడానికి ఒకరుంటే నా పని మరీ సులువవుతుంది. ఆ హెల్ప్ చేయండి సార్.." కులపతి చెప్పాడు.

"ఓ.కే. హరీ.. మన విద్యకి ఫోన్ చేసి అడ్రస్ చెప్పి రమ్మను. హరి యప్.. టైం వేస్ట్ కాకూడదు. కులపతి గారి రిపోర్టు చాలా చాలా కీలకం. డూ యిట్" అన్నారు ప్రొఫెసర్. హరి ఫోన్ ట్రై చేయసాగాడు.

"దీక్షిత్! మీ పనెంత వరకు వచ్చింది?"

"రూం నెం. 1 చూస్తున్నాం సార్. ప్రత్యేకంగా ఏం కనిపించలేదు. అందులో ఒక మంచం, రెండు కుర్చీలు టీపాయి గోడకి బిగించిన అద్దం, ఒక రాకింగ్ ఛెయిర్ ఏవో కార్నర్ టేబుల్స్ ఉన్నాయి సార్.." చెప్పాడు దీక్షిత్.

"హర్షా.. ఈ బిల్డింగ్‌ని ఫర్నిచర్‌తోనే కొన్నావా?"

నందూ చెప్పింది.

"సార్! ఈ ఇంట్లో కొన్ననాటినుండీ ఇప్పటివరకూ అసలు తాళం తియ్యని గదులు చాలా ఉన్నాయి. దీక్షిత్ అన్నయ్య తీసింది కూడా అలాంటిదే.. మేము చూడలేదు..."

ప్రొఫెసర్ సాలోచనగా తలపంకించాడు.

టైం రెండు దాటింది. కాసేపు రెస్ట్ తరువాత మళ్ళీ ఎవరి పనుల్లోకి వాళ్ళు దిగారు. ప్రొఫెసర్ కెమెరా రికార్డ్స్ అన్ని చూసుకుంటున్నాడు.

మీనాక్షిదేవి నెమ్మదిగా వీల్ ఛెయిర్ తోసుకుంటూ వచ్చారు. "ప్రొఫెసర్‌గారూ.. చిన్న మాట"

"చెప్పండమ్మా.." వరదరాజన్ అన్నారు. అదే ఆమె అయనతో తొలిసారి మాట్లాడటం...మొహమాటంగా.

"హర్ష మానసికంగా చాలా దెబ్బతిని ఉన్నాడు సార్. మీరందరూ ఇంత శ్రమ తీసుకుని మావాడికి సాయం చేస్తున్నారు. ఇది ఎంత ప్రమాదకరమైన విషయమో నాకు బాగా అర్థమైంది. పార్శిల్ తెచ్చిన ఆ కుర్రాడు ఈ బిల్డింగ్ లోని దుష్టశక్తివల్లనే చనిపోయాడని నాకర్థమైంది.

మీరంతా కుటుంబాలతో పచ్చగా ఉన్నారు. ఈ ప్రయత్నంలో మావల్ల ఎవ్వరికీ ఎలాంటి అపకారం జరిగినా అందుకు అన్ని విధాలా మేమే బాధ్యత వహించవలసి ఉంటుంది. మీలాంటి వారు డబ్బుకోసం పనిచేయడం అనేది ఎన్నడూ ఉండదు. అలాంటి మాటలు మాట్లాడి మీలో ఎవ్వర్నీ అవమానించలేను.

కానీ నాకు హర్ష ఎంతో మీరంతా అంతే. అందరూ బావుండాలి. మిమ్మల్ని తక్కువ చేయడం లేదు. కానీ మీకు సహాయంగా ఎవరైనా మీలాంటి మేధావంతుల్ని మీరు తెచ్చుకుంటే బావుంటుంది. ఇక్కడందరూ మీరు కాపాడవలసిన స్థితిలో ఉన్నవాళ్ళే. మీ చెయ్యి దాటిపోయే పరిస్థితి ఒకవేళ ఏర్పడితే మిమ్మల్ని చూసుకోగల తోడు మరొకరుంటే బావుంటుందని నా ఉద్దేశం.

ఈ దుష్టశక్తి మీద పూర్తిస్థాయి పని ఈరోజే మొదలుపెట్టారు. అందుకు మనమంతా ఎలాంటి ఫలితం

**రాత్రిపూట మాత్రం చదవకండి!**

ఎదుర్కోవలసి వస్తుందో మనకి తెలీదు. మీరు నా మాటలు తప్పుగా తీసుకోకండి. మీ సోదరి లాంటిదాన్ని.. మీ శక్తిని తక్కువ అంచనా వేశా నని మీకనిపిస్తే మన్నించండి. నా అభిప్రాయం ఇది" అన్నారావిడ.

చలించిపోయాడు వరదరాజన్. ఇంతగా ఆమె తన గురించి ఆలోచించడం... హెచ్చరిం చడం తన క్షేమం గురించి సలహా ఇవ్వడం.. ఇన్నేళ్ళ తన సర్వీసులో ఈ విషయంగా చాలా మందికీ సహాయపడ్డాడు. వాళ్ళెవరూ కూడా తమ వాళ్ళకోసమే తప్ప తనకోసం ఎవ్వరూ ఆలోచించలేదు ఎప్పుడూ. ఆయనకి ఆవిడ మీద సోదరీభావం కలిగి ఆత్మీయత ఏర్పడింది.

సానుకూలంగా స్పందిస్తూ "ఎంత మాట న్నారమ్మా.. మీ మనసులో ఉద్దేశం నాకర్థం అయింది. నేనూ మీలాగానే ఆలోచించాను. లండన్‌లో మైక్ అని నా స్నేహితుడున్నాడు. అతడిని రమ్మని మాట్లాడాను. ఈవిషయం చెప్పాను. అతడు రెండు రోజుల్లో వస్తాడు.

నాలాగే గత నలభై యేళ్లుగా పరిశోధనలు చేస్తున్నాడు. ప్రపంచవ్యాప్తంగా అతిడికి పేరుంది. అందుకనే మైక్ వచ్చేవరకూ సీరి యస్ ఆపరేషన్స్ ఏవీ మొదలుపెట్టను. మీరేం కంగారుపడకండమ్మ. నాలో ప్రాణం ఉన్నంత వరకూ ఎవ్వరికీ ఏ ప్రమాదమూ లేదు. రాని వ్వను.

మీరు నిశ్చింతగా ఉండండి. త్వరలోనే ఈ సమస్యలన్నీ తీరిపోగలవని నాకు నమ్మకం ఉంది.

అందరం ఒక్కమాట మీద ఉంటేనే ఇందు లోంచి బయటపడగలం. మీ ముందుచూ పుకూ, అభిమానానికీ ధన్యవాదాలమ్మా.." ప్రొఫెసర్ చాలా నమ్మకంగా ఎమోషనల్‌గా అన్నారు.

మీనాక్షీదేవి కృతజ్ఞతగా రెండు చేతులు జోడించింది. ఆమె నెమ్మదిగా తన గదికేసి కుర్చీని తోసుకుంటూ వెళ్ళిపోయారు.

ఆలోచనల్లో పడిపోయిన ప్రొఫెసర్ "గుడ్ ఈవెనింగ్ ప్రొఫెసర్" అన్న తియ్యని కంఠం పలకరింపుతో ఉలికిపాటుగా కదిలాడు.

"గుడ్ ఈవెనింగ్ విద్యా" నవ్వుతూ పలక రించాడు.

"హౌ ఆర్యూ సర్" నమ్రతగా అడిగిందా అమ్మాయి.

"ఫైన్ విద్యా.. వియ్ నీడ్ యువర్ హెల్ప్" అన్నారు.

"చెప్పండి సర్.. తప్పకుండా చేస్తాను. మేడమ్ బాగున్నారా?"

"షీ ఈజ్ ఫైన్.. హౌ ఆర్ యువర్ పేరెంట్స్?"

"ఫైన్ సార్... నేనేం చేయాలి సార్.." అడి గిందామె.

క్లుప్తంగా ఆమెకి వర్క్ వివరించారాయన. ఆమె శ్రద్ధగా అంతా విన్నది. ఆమె సైకాలజీలో రీసెర్చ్ స్కాలర్ - ఆమెకి సుమతి గైడ్‌గా వ్యవ హరిస్తోంది. చాలా చురుకైన అమ్మాయి.

అంతా వింటూనే ఆశ్చర్యంతో ఆమె కళ్ళు విశాలమైనాయి.

"ఇంట్రెస్టింగ్ సార్... ఈ ఇంటి గురించి ఆమధ్య నేనూ నెట్‌లో చూశాను. ఎక్కడో అను కున్నాను కానీ పెద్దగా ఆలోచించలేదు. ఇంత దగ్గర్లో ఉందనీ, నేనే ఇక్కడికి వస్తా ననీ అసలనుకోలేదు. తప్పకుండా చేస్తాను సార్.." అన్నది విద్య.

"గోస్వామీ! కులపతిగార్ని పిలువ్" వర దరాజన్ చెప్పారు. రెండు నిమిషాల్లో కుల పతి వచ్చాడు.

"కులపతిగారూ! షీ ఈజ్ విద్య. మీ అసి స్టెంట్. వెరీ బ్రిలియంట్ అండ్ ఒబిడి యంట్... బయట ఏ వివరాలూ చెప్పదు"

"విద్యా! ఆయనే కులపతి. ప్రసిద్ధ వాస్తు శాస్త్రజ్ఞుడు. ఆయన దగ్గర ఈవిధంగా నువ్వు వర్క్ చేయడం ఒకరకంగా నీకు మంచి లక్. యునో... ఈయన సబ్జెక్ట్‌లో ఈయన జెమ్. సో వర్క్ చేస్తూనే నీవూ కొంత ఆ విషయంలో ఎడ్యుకేట్ అవ్వొచ్చు" నవ్వుతూ పరిచయం చేశాడు వరదరాజన్.

"నమస్తే కులపతిగారూ.." చేతులు జోడించింది.

"ఆయుష్మాన్ భవ..థాంక్యూ ప్రొఫెసర్ గారూ. మరి మేం వెళ్తాం" అన్నాడు కుల పతి. తనకింద ఒక అసిస్టెంట్‌గా.. మరో కర్ని ఇవ్వడం తనని గురించి గొప్పగా చెప్పడం.. కులపతి చాలా సంతోషంగా ఉన్నాడు. అతడికి ఇలా సిస్టమేటిగ్గా పనిచే



యడం, టీమ్ వర్క్‌లో పార్టిసిపేషన్ అంతా కొత్తగా ఉంది. చాలా ఇంట్రెస్టింగ్‌గా చేస్తున్నాడు ఈ వర్క్‌ని.

"వెళ్ళండి కులపతీ.. టేక్ యువర్ టైం... గుడ్‌లక్.." ప్రొఫెసర్ చెయ్యెత్తాడు వెళ్ళమన్నట్టుగా.. ఇద్దరూ కొత్త ఉత్సాహంతో రూంలోకి వెళ్ళారు. హర్ష అప్పుడే లోపలినుండి వచ్చాడు..

★ ★ ★

మరోసారి అన్నీ సరిచూసి "తాళం వేసేద్దాం సార్" అన్నాడు హరి.

దీక్షిత్ "సరే! ఫైనల్ చెక్..." అంటూ గోడకి చేరబడి రాసిన లిస్ట్ చదువుతుంటే ఓకే చెప్తున్నాడు హరి. నిలబడి నిలబడి కాలు నొప్పిపుట్టి గోడకి గట్టిగా అదిమి దన్నుపెట్టుకుని నిలబడ్డాడు దీక్షిత్. కాలు గట్టిగా నొక్కిపెట్టి లిస్ట్ చదవసాగాడు.

ఆ గదిలో ఫ్లోర్‌కి మధ్య నలుచదరంగా ఒక చెక్కపలక... రోజ్‌వుడ్ డిజైన్‌తో పూలు, లతలూ చెక్కినది తాపడం చేయబడి ఉంది. అది ఫ్లోర్‌లో డిజైన్‌లా కలిసిపోయి ఉంది. హరి లిస్ట్ ఓకే చేసి వెనుతిరిగి రాబోతుండగా 'ధడక్'మన్న శబ్దంతో ఆ పలక మధ్యలో పువ్వులా చెక్కి ఉన్న ముక్క తెరుచుకుంది. అవాక్కైపోయారిద్దరూ.

దీక్షిత్ గబగబా వంగి నేలమీద కూర్చొని పరిశీలించసాగాడు. ఎలా వచ్చింది.. ఎలా తెరుచుకుందీ? కిందన ఏముంది? ఆ చిన్న నలుచదరపు పువ్వున్నంత మేరా నాలుగు అంగుళాల పలక మాత్రం లేచి వుంది. దానిలో ఏముంది? చూడటానికి ప్రయత్నించాడు. ఏమీ కనిపించలేదు. హరికి అర్థమైంది. ఇదో రహస్య అర. వెళ్ళి దీక్షిత్ నిలబడ్డ చోట చూశాడు. ఏమీ లేదు.

"సార్... సార్" హరి గట్టిగా అరిచి పిలుస్తూ కిందకి పరిగెత్తాడు. హల్లో మాట్లాడుకుంటున్న ప్రొఫెసర్, హర్షా అదిరి పడ్డారు. విద్యా, కులపతీ కూడా వచ్చారు. హరి పరుగున దిగుతూ.. "సార్.. సీక్రెట్ అర సార్... నేల మీద.." ఎక్సయిటింగ్‌గా చెప్పాడు. అందరూ పరుగున ఆ గదిలోకి వెళ్ళారు. ఇంకా దీక్షిత్ వంగోని ఆ పలకను జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు. పది నిమిషాల తరువాత "దీక్షిత్! మీరిద్దరూ ఏ పొజిషన్‌లో ఉండగా ఇది ఓపెన్ అయింది? నిలబడి చూపించండి" అడిగారు.

వాళ్ళిద్దరు గుర్తు చేసుకుంటూ నిలబడ్డారు. హరి నిలబడి ఉన్న చోటుని, దీక్షిత్ నిలబడిన చోటుని నిశితంగా పరిశీలించాక, గోడ దగ్గర చిన్న పువ్వు ఆకారంలో బొడిపెలాగా ఉంది. దాన్ని ప్రెస్ చేశాడు వరదరాజన్. రెండోసారి ప్రెస్ చేసేసరికి మళ్ళీ క్లోజ్ అయిపోయిందది. మళ్ళీ మళ్ళీ గట్టిగా వత్తేసరికి తిరిగి తెరుచుకుంది.

ఈసారి.. ఆ పలక దగ్గర చాలా జాగ్రత్తగా పరిశీలించాడు. చాలాసేపు చూశాక అతడికి తట్టింది. తిరిగి గోడని పరిశీలించాడు. ఆ బటన్ తప్ప ఇంకేమీ లేదు. ఆ పలకమీద లేచిన మందపాటి చిన్నపలకకి లోపలివైపున తగిలించి ఉందొక ఇత్తడి గొలుసు. ప్రొఫెసర్ ముఖం నవ్వుతో విచ్చుకుంది. మిగతా ఎవరికీ ఏమీ అర్థం కాలేదు.

మెల్లిగా లేచి "అందరూ వీలైనంత దూరంగా వెళ్ళండి" అన్నారు. అంతా ఆశ్చర్యంగా దూరంగా జరిగారు. ప్రొఫెసర్ ఒక కొక్కెంలాంటి ఇనుపరాడ్‌ని లోపలివైపు ఇత్తడి గొలుసుకి లంకెవేసి శక్తంతా ఉపయోగించి పైకి లాగాడు. ఉహూ.. రాలేదు.

ఈసారి దీక్షిత్ వంక చూశాడు. వెంటనే అర్థం చేసుకుని దీక్షిత్ శక్తి మొత్తం కేంద్రీకరించి బలంగా వ్యతిరేక దిశలో లాగాడది. లోపలవైపు ఏదో గడియ విడినట్టుగా 'ధన్'మని చప్పుడు, ఆపైన కిరకిర మని శబ్దం చేస్తూ ఆ చెక్కపలకకి అనుసంధించి ఉన్న పెద్ద పలక, పైకి సగం లేచింది. అంతా ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచారు.

హర్ష అయితే సినిమా చూస్తున్నట్టుగా థ్రిల్ ఫీలవుతున్నాడు. ప్రొఫెసర్, దీక్షిత్, హర్షా కలిసి బలంగా మరొక్కసారి గుంజారు. అంతే అవతల గోడకున్న కిటికీ వరకు పరుచుకుంటూ పెద్ద శబ్దం చేస్తూ నేలకి చాపలాగా అతుక్కుందది. ధూళి విపరీతంగా గదంతా కమ్ముకుంది. కర్చీఫ్‌లు అడ్డుపెట్టుకుని బయటికి పరుగెత్తారు.

హరికి డస్ట్ ఎలర్జీ కావడం వల్ల వరుసగా తుమ్ములు వచ్చేశాయి. దాదాపు పది నిమిషాలు అనంతరం దుమ్ము తగ్గింది. ప్రొఫెసర్ జాగ్రత్తగా గదిలో ప్రవేశించాడు. ధూళి, వాసన, మళ్ళా అందరూ చేరారు. ఆశ్చర్యం అద్భుతాల మేళవింపు ప్రతీ ఒక్కరి ముఖం లోనూ కొట్టవచ్చినట్టుగా కనబడుతోంది.

## ఇది విన్నారా?



★ ఫ్లెమింగో (ఎర్రకొంగలు)లను పరిశీలిస్తే..అది ఒంటికాలుమీద గంటల తరబడి నిలబడతాయి. అలానే నిద్ర కూడా పోతాయి. ఈ సంగతి తెలుసుకోవడానికి అమెరికన్ శాస్త్రవేత్తల బృందం వీటిపై ఇటీవల పరిశోధనలు చేసింది.

★ వాటి కాళ్ళ ముందు భాగాల్ని మట్టిలో గట్టిగా అదిమిపెట్టి ఉంచుతాయి. ఆ సమయంలో వాటి ఒంటి బరువంతా ఒంటికాలి పైనే పడుతుంది. అందుకనే అవి అలా నిల్చోగలుగుతున్నాయని శాస్త్రవేత్తల బృందం తేల్చింది.

★ ఫ్లెమింగోలు అలా ఒక కాలుపై నిలబడినప్పుడు వాటి కాళ్ళ కండరాల్లో కదలికలు ఆగిపోతాయిట.

## ఇది విన్నారా?



★ ఒంటెను ఎడారి ఓడ అంటారు. వీటిల్లో రెండే రకాలుంటాయి.

★ ఒంటెలు 150 లీటర్ల కంటే ఎక్కువ నీటిని ఒక్కసారే తాగేయగలవు.

★ ఒంటె నీటిని కడుపులో నిల్వ చేసుకుంటుందని అనుకుంటారంతా. కాని, ఇది కొవ్వును మాత్రమే నిల్వ చేసుకుంటుంది. అవసరమైనప్పుడు దాన్ని కరిగించుకుని శక్తిని తెచ్చుకుంటుంది.

★ ఒంటె కాళ్ళలో ఉండే ప్రత్యేక నిర్మాణంవల్ల ఇసుకలోనైనా చక్కగా నడవగలదు.

★ మన దేశంలో మొదటి వార్తాపత్రిక 1780లో మొదలైన బెంగాల్ గెజిట్!

ముందుగా తేరుకున్న ప్రొఫెసర్ "కమ్ బాయ్స్... రండి చూడండి" లోపలికి వంగి టార్చిలైట్ ఫోకస్ చేశాడు. అదొక నేలమాళిగ. లోపలికి మెట్లున్నాయి.

"మైగాడ్! సర్.. ఇంత నేలమాళిగ నేనింత వరకూ చూడలేదు.. సినిమాలో తప్ప..." దీక్షిత్ అన్నాడు.

"ఇదేదో మాయల ఫకీరు గుహలాగా ఇలాంటి వింతలు.. ఇంకా ఎన్నున్నాయో ఈ బిల్డింగ్‌లో" కులపతి ఆశ్చర్యపోసాగాడు.

"నిజం సార్! రియల్లీ స్ట్రేంజ్... చాలా ఆశ్చర్యంగా ఉంది.. నేనూ ఎప్పుడూ చూడలేదు" విద్య అంది.

హర్ష ఫీలింగ్స్‌కి అతీతంగా ఉన్నాడు. ఓవిధంగా మనిషి తనూహించనిదేదైనా నచ్చనిది - వద్దనుకున్నది ఎదురైనప్పుడు ఎలా స్పందించాలో తోచక నిస్తేజంగా నిర్లిప్తస్థాయిని దాటి మౌనంగా ఉండిపోతాడు. మాటలు రావు.

ప్రస్తుతం హర్ష అలాంటి స్థితిలోనే ఉన్నాడు. అతడికి ఆశ్చర్యంగానూ లేదు. ఇబ్బందిగానూ లేదు. విషం తాగక తప్పదను కున్నప్పుడు అది ఏ రుచిలో ఉంటే ఏంటి? ఒకోసారి అన్నింటికన్నా బాధపెట్టేదీ, గుండెకి తూట్లు గుచ్చేదీ వాస్తవాన్ని మించింది లేదు. హర్ష తెలివితేటలు హేతువాదం తుక్కుదూగలాగా ఎగిరిపోతున్న క్షణాలు మొదలైన తరువాత ఏదీ ఆశ్చర్యపరచడం మానేసింది. ఇన్నేళ్ళ తన హేతువాద సౌధంలో రారాజులా వెలిగాడు. రాజముద్ర ఆ సౌధాన్ని పేకమేడగా మార్చేసింది. వాస్తవ జీవిత చిత్రంలో చెరగని సిరాతో హర్ష సిద్ధాంతాన్ని తిరగరాస్తోంది. అంగీకరించక తప్పని నిజాలు హర్షని కొత్తగా మారుస్తున్నాయి. అదే ఈ నిర్వేదస్థాయికి కారణం.

"ఇందులో ఏముంది సార్" దీక్షిత్ వంగి చూస్తూ అన్నాడు.

"మెట్లున్నాయిగా వెళ్ళి చూద్దాం" ప్రొఫెసర్ అన్నారు.

"నేను రెడీ.." ఉత్సాహంగా బ్యాగ్‌లో కెమెరా తీస్తూ అంది విద్య.

"మీ ఆల్సో సార్!" ముక్కుకి రుమాలు చుట్టుకుని వస్తూ హరి.

"మరి నన్నూ రానివ్వండి" కులపతి లేస్తూ అన్నాడు.

ప్రొఫెసర్ ఆలోచిస్తూ "కులపతీ! మీరూ, విద్యా, దీక్షిత్, హరీ వెళ్ళండి! కావలసిన ఎక్విప్‌మెంట్ తేలేదు కనుక జస్ట్ చూసి వచ్చేయండి. రేపు ప్రిపేరై చూద్దాం. ఈలోగా నేనూ హర్షా దీన్ని మూత ఎలా వేయాలా! అనే విషయం చూస్తాం. మీకేదైనా హెల్ప్ కావాలంటే... హరికి తెలుసు ఏం చేయాలో.." అంటూ సూచనలివ్వసాగాడు.

గోస్వామి లోపల్నుంచి పెద్ద టార్చ్ తెచ్చి ఇచ్చాడు. అయిదు నిమిషాల్లో కావలసినవి సమకూర్చుకుని ముందు నిచ్చెన మీద కాలు పెట్టాడు హరి. ఎక్కడో తీతువు వికృతంగా అరిచింది. అందరూ మొహాలు చూసుకున్నారు. కులపతి చాలా ఉత్సాహంగా ఉన్నాడు.

"అందరూ పైనే ఉండండి. ముందు నేను దిగుతాను. ఏమీ ప్రమాదం లేదంటే సిగ్నల్ ఇస్తాను. ఒక్కొక్కరుగా రండి" అంటూనే హరి



చకచకా నిచ్చెన ఎట్లు దిగాడు. పదమూడు మెట్లున్నాయవి. ఆఖరి మెట్టుమీద అడుగుపెట్ట బోయాడు. చుట్టూ కలయచూశాడు. దుమ్ము పేరుకొని ఉంది. చాలా వస్తువులు పడేసి ఉన్నాయి. పెద్ద అద్దం మాసిపోయి ఉంది. చీక టిగా ఉంది. గబ్బిలాల వాసన. అందర్నీ రమ్మని చెయ్యి ఊపాడు. ముందు కులపతి తర్వాత విద్యా, దీక్షిత్ లోపలికి దిగారు. అందరూ దిగేదాకా చూస్తూ జాగ్రత్తలు చెప్పాడు వరదరాజన్.

ఆ నేల మాళిగకి దగ్గరలోనే కుర్చీలు రెండు తెప్పించుకుని కూర్చున్నారు హర్షా, ప్రొఫెసర్. ఇద్దరూ నిశ్శబ్దంగా ఉన్నారు. "సార్! ఇలాం టివి ఎందుకని కడతారు? ఈ బిల్డింగ్‌లో ఇంకా ఎన్నుంటాయివి? వీటివల్ల వెళ్ళిన వాళ్ళకేం ప్రమాదం లేదుగా!" ఆదుర్దాని అణు చుకుంటూ అన్నాడు హర్ష.

"ఎక్కువగా ఆలోచించకు మై బాయ్.. పెద్ద పెద్ద భవనాల్లో పూర్వం జమీందార్లు. తమ రహస్య వస్తువులు అతి ఖరీదైన నగలూ, డాక్యు మెంట్లు, వంశ చరిత్ర, వంశపారంపర్య సంపదా, ఇవన్నీ దాచుకోవటానికి, అప్పుడ ప్పుడు ఏదైనా తిరుగుబాట్లు జరిగినప్పుడు తమ స్ర్తీలని రహస్యంగా భవంతి లేదా కోట నుండి దాటించడానికి ఇవి కట్టేవారు" ఈ భూగర్భ గుహల్లో అధికశాతం నిధి నిక్షేపాలు దాచుకోవటానికి వాడేవారు.

ఈ భవంతి అసలు ఎన్నాళ్ళ కిందట కట్టబ డిందో తెలియాలంటే ఆర్కియాలజీ వాళ్ళు చెప్పాల్సిందే" అన్నారు.

ప్రొఫెసర్ వివరణ విన్న హర్ష ముఖంలో ఏదో తెలీని భావం తారట్లాడింది.

"అది కాదు ప్రొఫెసర్... ఈ ఇంట్లో అందర్నీ బాధిస్తున్న ఆ దుష్టశక్తి గానీ ఈ నేల మాళిగలో లేదు కదా? ఒకవేళ అదే నిజమైతే వెళ్ళిన వాళ్ళకి ప్రమాదం జరిగే అవకాశం ఉందని అడిగాను" అన్నాడు హర్ష.

"యస్ హర్షా యు ఆర్ రైట్.. నిజమే. ఆ దుష్టశక్తికి సంబంధించి ఏం ఉన్నాయో ఎక్క దున్నాయో ఇంకా మనకి తెలీదు. దురదృష్టవ శాత్తు ఇందులో ఏమైనా ఉంటే, తప్పకుండా మన వాళ్ళకి ప్రమాదం కిందే లెక్క" ప్రొఫెసర్ అన్నారు. హరీ వాళ్ళు వెళ్ళి పావుగంట దాటింది. లోపలినుండి ఇందాకటిదాకా లీలగా వినబడిన మాటలు ఇప్పుడు వినబ డటం లేదు. వాళ్ళకేమైంది. బాగా లోపలికి వెళ్ళద్దని చెప్పాడుగా తాను? వరదరాజన్‌కి డౌట్స్ మొదలయ్యాయి. ఆయన తన భావాల్ని బయటపెట్టుకోకుండా గంభీరంగా చూస్తు న్నారు. మెదడు మాత్రం వాయు వేగంతో ఆలో చిస్తోంది. ఆయనెందుకో టెన్షన్ పడుతున్నా డని గమనించాడు హర్ష.. ఇక ఊరుకోలేకపో యాడు.

మెల్లగా లోనికి వంగి "హరీ.." అని గట్టిగా అరిచాడు. సమాధానం రాలేదు. మళ్ళీ "కులప తిగారూ.." సమాధానం లేదు.

"సార్... ఏమై ఉంటుంది?" ఆందోళనగా అడిగాడు హర్ష. ప్రొఫెసర్‌లోనూ నిజానికీ ఆందోళన ఉంది. అయినా కనపడనివ్వకుండా ... "జస్ట్ అరగంట వెయిట్ చేద్దాం" అన్నాడా యన.

స్థిమితంగా అనిపించలేదు హర్షకి. అయినా, చేసేదేముంది కామ్‌గా కూర్చు న్నాడు. అరగంట కాస్తా యాభై నిమిషాల యింది. గంట దాటింది.. టైం తిరుగుతూనే ఉంది. వెళ్ళిన వాళ్ల జాడలేదు... క్షణాలు గడిచే కొద్దీ బయట వెయిట్ చేస్తున్న ఇద్దరిలోనూ ఉత్కంఠ తారాస్థాయికి చేరుకుంది. అప్పటికి వాళ్ళు అందులో దిగి దాదాపు రెండు గంటలు కావస్తుంది. వెంట ఆక్సిజన్ కూడా తీసుకెళ్ళ లేదు. ఏమై పోయారందరూ? జస్ట్ ఏముందో ఎలా ఉందో చూసి రమ్మంటే ఇంతసేపా? ప్రొఫెసర్ మస్తిష్కం వేడెక్కిపోతోంది...

ఒక్క క్షణం.... ఆగండి.....

రెండు గంటలు వెనక్కి వెళదాం...

★ ★ ★

చివరిగా కులపతి నిచ్చెన దిగాడు. అతడిని చాలా జాగ్రత్తగా దించారు. వయసు పైబడిన వ్యక్తి కావడంతో కొద్దిగా ఆయాసపడుతున్నా డాయన. నిచ్చెన మెట్టు మీదే క్షణంపాటు కూర్చుని అలుపు తీర్చుకున్నాడు. హరి నవ్వుతూ వాటర్ బాటిల్ అందించాడు. రెండు గుక్కలు నోట్లో పోసుకుని..

"హమ్మయ్య.. హరీ! ప్రాణం వచ్చిం దయ్యా... ఇంతవరకు మెట్లు ఎక్కడమే కష్టం అనుకున్నాను కానీ దిగడం కూడా ఇంత కష్ట మని తెలీదు నాకు" పైపంచతో మొహం తుడు చుకుంటూ అన్నాడాయన.

"ఇంతకీ.. ఈ పిల్లేదీ.. నా అసిస్టెంటు తల్లి.. విద్యా ఎక్కడ" పిలిచాడాయన.

## ఇది విన్నారా?



★ వడలు కర కరలాడేలా రావాలంటే మినప్పప్పుతోపాటు కొద్దిగా బియ్యం కూడా నానబెట్టి చూడండి.

★ బాధగా ఉంటే కన్నీళ్ళొస్తాయి. హద్దులేని ఆనందంలోనూ కన్నీళ్ళొ స్తాయి. ఇక ఉల్లిపాయలు తరిగినా టపటపమని కన్నీళ్ళు రాలతాయి. ఈ మూడు రకాల కన్నీళ్ళు మైక్రో స్కోప్‌తో చూస్తే..వేర్వేరుగా కనిపి స్తాయి.

★ కప్పలు రకరకాల రంగుల్లో ఉంటాయి. రంగునుబట్టి అవి విష పూరితమైనవో కావో వాటిని తినే జంతువులు గుర్తిస్తాయి.

"యస్సర్" కోమలంగా పలికింది విద్య కంఠం.

"ఏవుందీ.. ఎక్కడో పని మొదలెట్టేసి ఉంటుంది" హరి నవ్వుతూ అన్నాడు.

"ఏం పనయ్యా?"

"ఫోటోలు సార్.. ఫోటోలు తీసేస్తూ బిజీగా ఉంటుంది చూడండి!"

హరి చెప్పినట్టుగానే అక్కడ విచిత్రంగా కనబడ్డ ఓ అలమారని వీడియోలో కవర్ చేస్తోంది విద్య. దీక్షిత్ కూడా మెచ్చుకోలుగా చూశాడామె వంక.

"విద్యా కమాన్.. నువ్వలా టీం నుండి విడిపోకూడదు. ఇది ప్రమాదకరమైన చోటు. అందరూ జాగ్రత్తగా ఉండాలి. ఒక్క చోటే ఉండాలి. అడగకుండా అడుగైనా కదపకూడదూ. సర్ ఆర్డర్స్ ప్లీజ్" హరి మెల్లగా అన్నాడు.

"ఓ.కే.. హరీ.. సారీలొద్దు.. నాదే తప్పు జాగ్రత్తగా ఉందాం.. లెట్స్ గో" అంది విద్య.

అప్పటికి స్థిమితపడ్డ కులపతి.. "పదండి.. చూద్దాం.." అని బయలుదేరాడు.

తలా ఒక గుక్కెడు మంచి నీళ్లు తాగి, రుమాళ్లతో ముక్కు నోరు కవర్ చేసుకున్నారు. టార్చ్ వేసి చూశాడు దీక్షిత్. భయాన్ని గొలిపే సాలెగూళ్లు, మూడడుగుల వ్యాసార్థంలో సాలీళ్లు పెట్టిన బలమైన గూళ్లు, చిక్కగా పట్టి ఉన్నాయి. ఎక్కడికక్కడ వేలాడుతున్న బూజులు, పాత ఫర్నిచర్.. విరిగిపోయిన కుర్చీలు, బల్లలు, టీపాయ్‌లు ఓ మూలగా పడేసి ఉన్నాయి. మసి పట్టిన అద్దాలు ముక్కలుగా పగులకొట్టబడి పడివున్నాయి.

లోపల నేల మాళిగ వైశాల్యం చాలా ఉన్నట్టుంది.. అదో విశాలమైన హాలు. గోడలనిండా ఏవో అర్థంలేని గుర్తులు చిత్రలిపిలా రాయబడి ఉన్నాయి. కుడివైపున మలుపుకి ఒక తలుపు లాంటి పలక, ఎడంవైపున్న మలుపుకి పెద్ద 8 అడుగుల పలక తాపడం చేసినట్టుగా ఉన్నాయి.

ఆ హాలు మధ్యలో ఒక పన్నెండడుగుల వెడల్పు ఉన్న బేసిన్‌లాంటి కట్టడం, దాని మధ్యలో ఒక మనిషి ముఖంలాంటి పోలిక లున్న కంచుబొమ్మ తల బిగించబడి ఉంది. ఆ తలకి అటూ ఇటూ ఇనుప కత్తులు X ఆకారంలో పెట్టబడి ఉన్నాయి.

సీలింగ్‌కి 3 అడుగుల దూరానికి గుండ్రని కన్నాలు తొలవబడి ఉన్నాయి. ఒక్కో కన్నం స్టీలు పళ్లెమంత వెడల్పుతో ఉంది. మరోవేపు గోడకి పెద్ద పిల్లి చిత్రం చిత్రించబడి ఉంది. చూసి విస్తుపోయారు అందరూ.

హరి అంతా పరిశీలనగా చూశాక హాలు పొడవు వెడల్పులు అంచనాగా రాసుకున్నాడు. దీక్షిత్ ఉత్సాహంగా ఉన్నాడు. విద్య వీడియో కవర్ చేస్తోంది. అంతా చూశాక కుడివైపు ముందు చూద్దామా? లేక ఎడమవైపు ముందు చూద్దామా? అన్న మీమాంస వచ్చింది. కులపతి కుడివేపు వెళ్దాం అన్నాడు.

హరి తల అడ్డంగా ఊపుతూ "ఎడంవైపు చూద్దాం సార్" వివరాలన్నీ చక చకా నోట్ చేసుకుంటూ అన్నాడు హరి. అతడికి ఇలాంటి వ్యవహారాల్లో తమకంటే అనుభవం ఉండటంతో మరెవరూ మాట్లాడలేదు.

హరిని ఎడమవైపున 8 అడుగుల పలక ఆకర్షిస్తోంది. రమ్మని తొందర చేస్తోంది. అతడు ఎందుకో అవసరమైన దానికంటే త్వరపడుతున్నాడని అందరికీ అర్థమైంది. కానీ అతడి తొందర దేనికో తెలీయలేదు. త్వరగా చూసి పైకి ఎక్కడానికా? లేక తక్కువ టైంలో ఎక్కువ విశేషాలు చూపటానికా? అన్నది ఎవరూ నిర్ణయించుకోలేక పోతున్నారు. దీక్షిత్‌కి ఒకింత ఉద్వేగంగా ఉంది. మూసిన ఆ పలకల వెనుక ఏముంది?

ఆ గోడ మీద చిత్రించిన పిల్లిబొమ్మకి అర్థం ఏమిటి? ఆ హాలు సెంటర్‌లో చెవులు సాగదీసినట్టు మలచబడ్డ ఆ మనిషి తలబొమ్మ వెనుక మర్మం ఏమిటి? అసలిది నేలమాళిగేనా? అయితే ఈ కత్తులెందుకని పెట్టారు? వట్టి నేల మాళిగే అయితే ఇన్ని పజిల్స్ ఏమిటి? తాపడం చేసున్న తలుపుల వెనుక ఏముందోగానీ వాటిని తెరవడానికేమీ లేవు.. మరెలా తెరవడం?

దీక్షిత్ బుర్రలో గజిబిజి ప్రశ్నలు ఒకదాని వెంట ఒకటిగా తోసుకొస్తున్నాయి. ఇంచుమించు కులపతీ అలాగే ఉన్నాడు. కానీ హరీ, విద్యా ఉత్సాహంగా ఉన్నారు.

"ఓ.కే. సార్.. గెట్ రెడీ.." నలుగురూ ఎడం వైపున్న పలకముందు నిలబడ్డారు. హరి ఆ పలక బిగించి ఉన్న గోడంతా జాగ్రత్తగా పరిశీలించసాగాడు.

పైన హాల్లోలాగా ఏవైనా ఆధారాలు దొరుకుతాయేమో అన్న ఆశతో వెతుకుతున్నాడు. ఏమీ కనిపించడం లేదు. ఉత్కంఠగా నిలబడి చూస్తున్నారు మిగిలినవాళ్ళు. హరి ఒకవేపూ, దీక్షిత్ ఒకవేపూ పరిశీలిస్తున్నారు. విద్య తన పనిలో తనుంది. కులపతి విద్యనే చూస్తున్నాడు.

విద్య అద్భుతమైన అందగత్తేమీ కాదు కానీ పెద్ద పెద్ద కళ్ళూ తెలివిని సూచిస్తున్నట్టున్న ముక్కు, పట్టుదలని సూచించే పెదాలు, కోల ముఖం, భుజాలవరకూ కత్తిరించబడిన జుట్టు జీన్స్‌పాంట్ మీద - వైట్ కలర్ షర్టు టక్ చేసుకుని షూ వేసుకుంది. ఓ మోస్తరు తెలుపు. నవ్వితే ఆకర్షణీయంగా ఉండదు. ఆత్మీయంగా ఉంటుంది. అతడి చూపులు తగిలినట్లయ్యి వెనుతిరిగి చూసింది విద్య. తననే చూస్తున్న కులపతి కనిపించాడామెకి. ఆశ్చర్యంగా చూసింది విద్య.

**- ఇంకా వుంది**



# అల్పాహారం విలువ అనల్పం!

- తటవర్తి రామచంద్రరావు

**రో**జూ పనులు, విధుల్లో క్షణం తీరిక లేకుండా ఉండే వాళ్ళు ఎక్కువగా నిర్లక్ష్యం చేసేది ఆహారాన్నే! సమయం లేదని ఏదోటి తినేస్తారే తప్ప ప్రత్యేకంగా పోషకాహారం మీద దృష్టి పెట్టారు. దాంతో ఆరోగ్య సమస్యలు త్వరలోనే ముంచుకు వస్తాయి.





సమయం లేదని, బరువు పెరిగిపోతామన్న భయంతోను చాలా మంది పొద్దుటి పూట అల్పాహారం తినకుండా ఒకేసారి మధ్యాహ్నం భోజనం చేయవచ్చని అనుకుంటారు. కానీ, అల్పాహారం తీసుకోకపోవడంవల్ల జీవక్రియల పనితీరు చురుగ్గా సాగదు. అంతేకాదు... మధ్యాహ్నం అవసరానికి మించి తినేస్తాం. దాంతో కళ్ళు మూతలు పడతాయి. బరువూ పెరుగుతాం. భారీగా తినడంవల్ల చురుగ్గా పని చేయలేని పరిస్థితి వస్తుంది.





అందుకే, పొద్దుటి పూట రెండు ఇడ్లీలూ, ఓ దోశ, కప్పు ఓట్స్, ఓ పండూ... ఇలా ఏదోటి తీసుకోవాలి. మాంసకృత్తులున్న సమీకృతాహారాన్ని తీసుకోవడం అన్ని విధాలా మంచిది.

ఇదికాక, చాలామంది మంచి నీళ్ళు ఎక్కువగా తాగరు. ఇది డీహైడ్రేషన్‌కే కాదు. చర్మం పొడిబారడానికీ, మూత్రనాళ ఇన్ఫెక్షన్లకీ దారి తీస్తుంది. ముందే ఇలాంటి సమస్య ఉన్నవాళ్ళయితే ఇక నుంచయినా నీళ్ళు బాగా తాగడం ఓ అలవాటుగా మార్చుకోండి. దాహం వేసినా వేయకపోయినా అప్పుడప్పుడూ ఓ గ్లాసు నీళ్ళు తాగుతూ ఉండాలి.



వీలైనంత వరకూ నూనె, చక్కెర, ఉప్పు ఉన్న పదార్థాలను కాస్త తక్కువగా తీసుకుంటూ, తృణధాన్యాలూ, పండ్లూ, కూరగాయల మోతాదును పెంచితే స్థూలశరీరం వచ్చే బాధ ఉండదు.

పనుల్లో పడి ఇంతకాలం ఏ సమోసాతోనో, బోండాతోనో, బజ్జీలతోనో కడుపు నింపుకుంటున్న వాళ్ళు క్రమంగా ఆ అలవాటునుంచి బయటపడాలి. వాటికి బదులు పండ్ల ముక్కల్ని, సాలడ్స్‌ని, డ్రైఫ్రూట్స్‌ని, పెరుగుతో కలిపినదేదయినా సరే తీసుకోండి. అలాగని, తినే దాంట్లో కేలరీలు లెక్కపెట్టుకుంటూ తినమని కాదు. సీజనల్ ఫ్రూట్స్, కూరగాయలకు మించిన పోషక పదార్థాలు మరొకటి ఉండవు. వాటిమీద శ్రద్ధ పెట్టి తింటే ఎలాంటి ఇబ్బందీ ఉండదు.

★





# సినిమా చూద్దాం..రండి!

## నా హాలీవుడ్ డైరీ

# సన్‌సెట్ బొలివార్డ్ (1950)

1940-1950 కాలపు షోకైన క్రైమ్ మిస్టరీ డ్రామాలు కొన్ని ఫిల్మ్ నో వార్ (ilm-Noir) అనే కళాత్మక శ్రేణిగా వర్గీకరించబడ్డాయి.

ఈ చిత్రాలను చీకటి చిత్రాలుగా పేర్కొనవచ్చు. ఇందులో కొన్ని పాత్రలు కుటిలమైన లేదా ఉన్మత్తమైన మనస్తత్వాలు గలవిగా, కొన్నిసార్లు లైంగిక ప్రేరణ గలవిగా కూడా ఉండి, ఫోటోగ్రఫీ విభిన్నమైనదిగా ఉంటుంది. 'సన్‌సెట్ బొలివార్డ్' అలాంటి నోవార్ చిత్రాలలో ఎన్నదగినదిగా మన్నన పొందింది. 1950లో విడుదలైన ఈ చిత్రం సృజనాత్మకతకు, కళాత్మకతకు, అవిస్మరణీయమైన నటనకు కొత్త నిర్వచనం చెప్పింది.

1950 నుంచి 1952 వరకు చిత్రనిర్మాణం, తారల కథాంశాలతో కొన్ని చిత్రాలను హాలీవుడ్ నిర్మించింది. అందులో వాస్తవానికి దర్పణం వంటిది, ఎంతో ప్రజాదరణ, విమర్శకుల మన్ననలు పొందిన నోవార్-ఫిల్మ్ శైలి అసాధారణ చిత్రం 1950లో విడుదలైన 'సన్‌సెట్ బొలివార్డ్'. ఇది 2వ ప్రపంచ యుద్ధానంతర కాలపు అత్యంత ప్రముఖ చిత్రాలలో ఒకటిగా పేరు పొందింది. ఉత్తమ స్క్రీన్ ప్లే, ఉత్తమ సంగీతం శాఖలలో ఆస్కార్ పురస్కారాలు పొందింది. విమర్శకులు దీనిని హాలీవుడ్ చిత్ర రంగానికి దర్పణమని, చలనచిత్ర చరిత్రనే మలుపుతిప్పిన అద్భుత చిత్రమని వ్యాఖ్యానించారు.

టాకీ చిత్రాల ఆగమనంతో మూతపడిన మూకీ చిత్ర నిర్మాణం, సాంకేతికత రాకతో ముగిసిన మూకీ తారల వైభవం, వారు ప్రజాదరణకు దూరమై అనామకత్వంలో రోజులు గడపటం, టాకీ చిత్రాల నిర్మాణం బాగా పుంజుకున్న 25 ఏళ్ల తరువాతి కాలం..ఇదీ ఈ చిత్ర నేపథ్యం. 'ఎ కాన్ ఆఫ్ బీన్స్'

అనే తమ కథను చిత్రంగా మలిచారు చిత్రదర్శకుడు బిల్లీ వైల్డర్, సహరచయిత, నిర్మాత చార్లెస్ బ్రాకెట్. ఇది పారమౌంట్ పిక్చర్స్ నిర్మించిన చిత్రం. ఈ చిత్రం హాలీవుడ్ ద్వంద్వ వైఖరిపై, మానవ నైజంపై కరుకైన వ్యాఖ్య. వాస్తవదూరమైన భ్రమల కృత్రిమ ప్రపంచంలో జీవించే తారల అద్దూఅపూ లేని అహంభావంపై ఎక్కుపెట్టిన కర్కశమైన హెచ్చరిక.

ఒక తెల్లవారుఝామున హాలీవుడ్‌గా పిలువబడే లాస్ ఏంజెలిస్ నగరంలో సినీతారలు నివసించే బెవెర్లీహిల్స్ ప్రాంతంలోని సన్‌సెట్ బొల్‌వార్డ్ అనే వీధిలోని గొప్ప భవంతిలోకి పోలీసుల పటాలం చేరుకుంటుంది. ఆ భవంతి స్విమ్మింగ్ పూల్‌లో ఒక యువకుడి శవం తేలుతూ కనిపిస్తుంది.

ఆ భవంతితో ఆ యువకుడి సంబంధం ఆరునెలల క్రితం అనూహ్యంగా మొదలైంది. నిజానికి ఇది శవం చెప్పిన కథ!

సన్‌సెట్ బొల్‌వార్డ్‌లో నార్మా భవంతిలోకి అడుగుపెడుతున్న జో గిల్లీస్





సలోమ్ పాత్రలో లీనమైన నార్మా






జో గిల్లీస్ ఒక సినీరచయితగా హాలీవుడ్‌లో నిలదొక్కుకునే ప్రయత్నం చేస్తున్నాడు. అతడి కథలను, స్క్రీన్‌ప్లేలను నిర్మాతలు తిరస్కరిస్తున్నారు. అతడొక చిన్న అద్దెగదిలో నివసిస్తూ, అతి కష్టం మీద జీవిక వెళ్లదీస్తున్నాడు. అంతకుపూర్వం అతడు ఒహాయో అనే ఊళ్ళో చిన్నపాటి ఉద్యోగం చేసుకునేవాడు. హాలీవుడ్ రచయిత కావాలని, పేరు ప్రఖ్యాతులు గడించాలని అతడి కోరిక.

అతడు వాడుకునే కారుకు సంబంధించిన ఇన్సూరెన్స్ రుసుము మర్నాటికి చెల్లించాలని లేదా కారు కంపెనీకి తిరిగి అప్పగించాలని కోర్టు ఆదేశం వస్తుంది. చిల్లిగవ్వ దగ్గర లేని అతడు, మర్నాటికల్లా దాదాపు **300** డాలర్లు చెల్లించాలి. షేల్డ్రేక్ అనే హాలీవుడ్ నిర్మాత దగ్గరికి వెళ్లి, తన చిత్ర కథను ఒకదానిని ఆమోదించమని ప్రాధేయపడతాడు. ఆ నిర్మాత దగ్గర కథావిభాగంలో పనిచేసే బెట్టీ షెఫర్ అనే యువతి జో గిల్లీస్ కథలో ఏ ప్రత్యేకతా లేక సాధారణంగా ఉన్నదని విమర్శిస్తుంది. జో గిల్లీస్ తనకు చేబదులు ఇవ్వమని, కష్టాలలో ఉన్నానని నిర్మాతతోనూ, తరువాత తన ఏజెంట్‌తోనూ ప్రాధేయపడతాడు.

అందరూ నిరాకరించగా, ఇక తాను హాలీవుడ్‌లో సాధించేదేమీ లేదనే నిర్ణయానికి వచ్చి, పూర్వం ఒహాయో నగరంలో వార్తాపత్రిక రచయితగా చేసిన అత్తెసరు ఉద్యోగానికి తిరిగి వెళ్లాలని అనుకుంటాడు. అలా ఆందోళనలో కారు నడుపుతుండగా, వెనుక కారు జప్తుచెయ్యటానికి వచ్చిన ఇన్సూరెన్స్ ఉద్యోగులు వెంబడిస్తూ కనిపిస్తారు. అతడు కంగారుపడి వేగం పెంచి, వారిని తప్పించుకుంటూ మలుపులు తిరుగుతూ సన్‌సెట్ బొల్‌వార్డ్ అనే వీధిలోకి ప్రవేశిస్తాడు. అత్యంత ఐశ్వర్యవంతులైన హాలీవుడ్ తారల భవంతులు కల వీధి సన్‌సెట్ బొల్‌వార్డ్. ఒకచోట కారు పాడై ఆగిపోతున్న చిహ్నాలు కనిపించి, దగ్గరలో ఉన్న భవంతి గేటులోకి తిప్పుతాడు. ఇన్సూరెన్స్ ఉద్యోగులు ఇది గమనించకుండా, ముందుకు

వెళ్ళిపోతారు. బతుకు జీవుడా అనుకుని, ఆ పాతకాలం భవంతిలో ఒక ఖాళీ గేరేజ్ (కారు షెడ్) కనిపించి, తన పాడైన కారు తోసుకుంటూ వెళ్లి అందులో పెడతాడు. అదే షెడ్‌లో ఒక అద్భుతమైన ఖరీదైన ఇటలీ దేశపు కారు కనిపిస్తుంది.

ఆ భవంతిలోని యజమానులకు తన కారు అక్కడ పెట్టానని చెప్పి, అనుమతి పొందటానికి జో గిల్లీస్ ముఖద్వారం వైపు వెళ్తాడు. భవనం సంరక్షణ కరువై, పాడుబడ్డట్టు కనిపిస్తుంది. ఇంతలో మేడమీద నుంచి,

"ఇంత ఆలస్యమైందేమిటి? లోపలికి రమ్మని" ఒక స్త్రీ కంఠం వినిపిస్తుంది.

తలుపుతీసిన నడివయసు బట్లర్ మేడమీదికి వెళ్లమని పురమాయిస్తాడు. తానెవరో ఎందుకు అక్కడికి రావలసి వచ్చిందో చెప్పే అవకాశం జో గిల్లీస్‌కి దొరకదు.

అతడు మేడమీదికి వెళతాడు. అక్కడ ఒక స్త్రీ అతడిని చూసి, శవపేటికలు తయారుచేసే ఉద్యోగిగా అపార్థం చేసుకుని మాట్లాడుతుంది. ఆమె పెంపుడు చింపాంజీ అంతకుముందే మరణించింది. దానికోసం శవపేటిక తెచ్చే మనిషి కోసం ఆమె ఎదురుచూస్తోంది.

జో గిల్లీస్ తానెవరో, జరిగినది ఏమిటో పూర్తిగా విషయం ఆమెకు చెప్పి, వెళ్ళటానికి వెనుదిరుగుతాడు. అప్పుడు అతనికి ఆమె ఎవరో స్ఫురిస్తుంది. పాతకాలపు మూకీ చిత్రాల గొప్ప తార, నార్మా డెస్మండ్! ఆమెను తాను గుర్తించానని చెప్తే, టాకీ చలన చిత్రాల గురించి చులకనగా మాట్లాడుతుంది. తానొక అద్భుతమైన బైబిల్ కథానాయిక 'సలోమె' గురించి కథ రాశానని, తానే నాయికగా ఆ చిత్రంలో నటించబోతున్నానని, తాను ఎప్పటికీ గొప్ప తారనే అని, సినిమాలే చిన్నబోయాయని ఆక్షేపిస్తుంది.

అతడు సినీరచయిత కాబట్టి, తాను రాసిన చిత్రం తాలూకు స్క్రిప్ట్ చదవమని అతడిని నార్మా అడుగుతుంది. కేవలం కుతూహలంతో సరేనని జో గిల్లీస్ ఆ సుదీర్ఘమైన స్క్రిప్ట్ తిరగేస్తాడు. అది ఏమాత్రం నచ్చకపోయినా, పైకి అనలేక కొంత దిద్దుబాటు అవసరమని చెప్తాడు. జ్యోతిష్యశాస్త్రరీత్యా అతడిది కూడా ధనురాశి అని అడిగి తెలుసుకుని, తనకు అనుకూలమైనదని భావించి, అతడికి తన స్క్రిప్ట్ దిద్ది సినిమా యోగ్యంగా మార్చే పని అప్పగిస్తుంది. అందుకు వారానికి 500 డాలర్లు జీతం కూడా ఇస్తానని మాట ఇస్తుంది. ఇదేదో బాగానే ఉందనుకుని అంతకన్నా గత్యంతరం లేని జో గిల్లీస్ అంగీకరిస్తాడు.

తన కారు షెడ్ పైన ఉన్న గది అతడికి కేటాయిస్తుంది. అప్పటికే పొద్దుపోవటం చేత జో గిల్లీస్ అక్కడ నిద్రిస్తాడు. మర్నాడు లేచి చూస్తే, తన గదిలో సామాన్లన్నీ అక్కడ కనిపిస్తాయి. అతడి అప్పులు కూడా నార్మా ఆసరికే తీర్చి ఉంటుంది. ఆ పద్ధతి జో గిల్లీస్‌కి సంతోషం కలిగించదు. తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ఆమె నిరోధిస్తుందని భావిస్తాడు, వ్యతిరేకిస్తాడు. కానీ అతడు త్వరలోనే ఆ జీవితానికి రాజీపడిపోతాడు. అంతకన్నా దారిలేక.

జో గిల్లీస్ అక్కడ వుంటూ, ఎన్నో విషయాలను తెలుసుకుంటాడు. మొట్టమొదటగా ఈనాటికీ తానొక గొప్ప సినీ తారననే నార్మా అబద్ధపు అహంభావాన్ని వారం వారం వచ్చే అభిమానుల ఉత్తరాలు పెంచి పోషిస్తున్నాయి. బట్లర్ మాక్స్ ఆమె పాత హిట్ చిత్రాలను క్రమం తప్పకుండా హాల్‌లో ప్రొజెక్టర్ వేసి చూపిస్తూ ఉంటాడు. మూకీ చిత్రాల పాతకాలం తారలు తరచూ, ఆ భవంతికి వచ్చి, నార్మాతో పేకాడుతూ ఉంటారు. వాళ్ళను జో గిల్లీస్ 'మైనపు బొమ్మల'ని సంబోధిస్తాడు ఒకప్పటి కీర్తిప్రభల మసకబారిన ప్రతిబింబాలని. అలా ఒకసారి వాళ్లంతా పేకాడుతూ ఉన్నప్పుడు ఇద్దరు ఇన్సూరెన్స్ మనుషులు వచ్చి, జో గిల్లీస్ అక్కడి కారు షెడ్‌లో దాచివుంచిన కారును తాడు కట్టి లాక్కుని వెళ్ళిపోతారు. జో అవమానంతో బాధపడుతూ వుంటే, అతడిని బుజ్జగించడానికి, నార్మా తన ఖరీదైన పాత ఇటాలియన్ కారుకు అతడి కోసం కొత్తమెరుగులు దిద్దిస్తుంది.

రానురాను ఆమె తన జీవితాన్ని అతిగా నియంత్రించటం జో గిల్లీస్ ఇబ్బందిగా గమనిస్తాడు. ఒక తుపాను రాత్రి షెడ్‌పైనున్న జో గది వర్షంతో పూర్తిగా తడిసిపోతే నార్మా అతడి సామాన్లను తన భవనంలో తన గది పక్కనున్న గదిలోకి మార్పిస్తుంది. అది ఆమె ముగ్గురు మాజీభర్తలు వాడిన గది అని బట్లర్ మాక్స్ జో గిల్లీస్‌తో చెబుతాడు. ఆ గదికే కాక ఏ గదికీ గడియలు, తాళం లేకపోవటం గమనించిన జో అదేమిటని మాక్స్‌ను ఆశ్చర్యంగా ప్రశ్నిస్తే, నార్మా తరచు విచారంలో మునిగిపోయి, ఆ బాధలో ఆత్మహత్యా ప్రయత్నాలు చేస్తే, జాగ్రత్త కోసం డాక్టర్లు గదులకు గడియలు, తాళం తీసివేయ్యమని సలహా చెప్పారని మాక్స్ వివరిస్తాడు. నార్మా తనకు అభిమానులు రాస్తున్నారని భావించే ఉత్తరాలు, బట్లర్ మాక్స్ తన స్వహస్తాలతో రహస్యంగా ఆమె పేర రాయటం ఒక సందర్భంలో కళ్లారా చూస్తాడు జో గిల్లీస్. తనను ప్రేమికులు పూర్తిగా మర్చిపోయారనే వాస్తవాన్ని ఆమె తట్టుకోలేదు కాబట్టి, అలా చెయ్యటం తప్పనిసరైందని జోతో మాక్స్ వేదనగా చెబుతాడు.


నార్మా, జో గిల్లీస్

నార్మా కొత్త సంవత్సరం పార్టీ అట్టహాసంగా ఏర్పాటుచేస్తుంది. పార్టీ కేవలం తామిద్దరి కోసమే ఏర్పాటు చేసిందని తెలిసి, జో గిల్లీస్ అవాక్కైపోతాడు. ఉన్మత్తమైన ఆమె ప్రేమ అతడికి ఊపిరాడనివ్వదు. వ్యతిరేకించి ఆమెతో చెంపదెబ్బ తింటాడు జో గిల్లీస్. నార్మా ఇంటిని విడిచి, తన స్నేహితుడైన ఆర్టీ గ్రీన్ అనే సహాయ దర్శకుడి ఇంట పార్టీకి వెళతాడు జో. అక్కడ తన వయసు స్నేహితుల మధ్య అతడికి శాంతి చేకూరుతుంది. అక్కడే నిర్మాత

ఆఫీసులో తన చిత్రకథను విమర్శించిన బెట్టీ షెఫర్ కనబడుతుంది. ఆమె జో స్నేహితుడు ఆర్టీ గ్రీన్ కాబోయే భార్య. ఆమె తాను చదివిన జో గిల్లిస్ కథ ఒక దానిపట్ల ఎంతో ఆసక్తి చూపిస్తుంది.

కొంతకాలం అక్కడే ఆర్టీ గ్రీన్ ఇంట్లో ఉండే ఏర్పాటు చేసుకుని, జో గిల్లిస్ తన సామాన్లని స్నేహితుడి ఇంటికి పంపించమని అడగటానికి నార్మా ఇంటికి ఫోన్ చేస్తాడు. బట్లర్ మాక్స్ ఫోన్‌లో నార్మా మానసిక పరిస్థితి నాజూకుగా ఉన్నదని, జో గిల్లిస్ రేజర్‌తో ఆమె తన చేతి మణికట్టు నరాలు కోసుకున్నదని చెబుతాడు. జో నార్మా భవంతికి తిరిగి చేరుకుంటాడు. జో గిల్లిస్‌ను వెర్రిగా ప్రేమించే తన మూర్ఖత్వాన్ని నిందించుకుంటూ నార్మా కనబడుతుంది. అతడిని చూసి, రోదిస్తూ తన అక్కున చేర్చుకుంటుంది.

కోలుకున్న తర్వాత నార్మా తన ఇంటి స్విమ్మింగ్ పూల్ శుభ్రం చేయించి, నీరు నింపిస్తుంది. జోగిల్లిస్ తనకు ఎంతో ఇష్టమైన ఆ పూల్‌లో ఈదులాడుతాడు. తాను రచించి, నటించబోయే 'సలోమ్' చిత్రం స్క్రిప్ట్ పారమౌంట్ సంస్థ అధినేత, దర్శకుడు సిసిల్ డిమిల్‌కి పంపించానని, అతడి దర్శకత్వంలో ఇదివరకు 12 (మూకీ) చిత్రాలలో నటించి ఉన్నానని గర్వంగా జోతో నార్మా చెబుతుంది.


భ్రాంతిలో లీనమై మెట్లు దిగివస్తున్న నార్మా

ఒకరోజు మందుల దుకాణంలో ఆర్టీ గ్రీన్ అతడి ప్రేయసి బెట్టీ కనబడతారు. బెట్టీ ఉత్సాహంగా జో గిల్లిస్ కథ వినిపించి, నిర్మాతను ఒప్పించానని చెబుతుంది. జో గిల్లిస్ నిరాసక్తంగా తాను రాయటం అనేదే మానుకున్నానని చెప్పి వెళ్ళిపోతాడు.

తరువాతి రోజుల్లో పారమౌంట్ సినీ సంస్థ నుంచి నార్మాకు ఎన్నో సార్లు ఫోన్ వస్తుంది. ఫోన్ చేసిన వ్యక్తి అధినేత, దర్శకుడు సిసిల్ డిమిల్ కాకపోవటం చేత, నార్మా ఫోన్ మాట్లాడటానికి నిరాకరిస్తుంది. ఒకరోజు ఆమె జోని వెంటబెట్టుకుని తన ఖరీదైన ఇటాలియన్ కారు బట్లర్ మాక్స్ నడుపుతుండగా ఎకాయెకి పారమౌంట్ స్టూడియోకి వెళ్తుంది. అక్కడ సిసిల్ డిమిల్ సెట్ వద్ద ఆమెకు స్వాగతం, ఒకప్పటి మూకీ తారగా మంచి గుర్తింపు లభిస్తాయి. సిసిల్ డిమిల్ ఒకప్పుడు తన దర్శకత్వంలో ఎన్నెన్నో విజయవంతమైన చిత్రాలలో నటించిన తారగా ఆమెను ఆప్యాయంగా ఆదరిస్తాడు. బయట కారు దగ్గర ఉన్న బట్లర్ మాక్స్‌తో స్టూడియో మనిషి ఒకరు తాను ఎన్నోసార్లు నార్మా డెస్మాండ్‌కి ఫోన్ చేశానని, తమకు ఆ కారు ఒక షూటింగ్ కోసం అద్దెకు కావాలని చెబుతాడు. స్టూడియో ఉద్యోగి బెట్టీ షెఫర్ అక్కడే అటూ ఇటూ తిరుగుతున్న జో గిల్లిస్‌ను గుర్తిస్తుంది. ఆమె అతడి సినీ కథకు మార్పులు చేర్పులు చేస్తుంది. వీలున్నప్పుడల్లా ఆమెతో కూర్చుని, కథకు కావలసిన దిద్దుబాట్లు చేయగలనని జో చెబుతాడు.

స్టూడియో నుంచి ఇంటికి తిరిగి వచ్చిన నార్మా మనసు ఉత్సాహంతో పోటెత్తుతుంది. దర్శకుడు సిసిల్ డిమిల్ జాలితో కూడిన కారుణ్యం అపార్థం చేసుకుని, తన స్క్రిప్ట్ నచ్చి, తన నటనకు ప్రోత్సాహంగా నార్మా అర్థం చేసుకుంటుంది. పర్యవసానంగా తన రాబోయే చిత్రం కోసం ఆమె తన అందానికి మెరుగులు దిద్దుకుని, తెరపై యవ్వనంగా కనిపించేందుకు ప్రయత్నాలు ముమ్మరంగా మొదలుపెడుతుంది.

జో గిల్లిస్ బెట్టీ షెఫర్‌ని రోజూ తన చిత్ర కథ విషయమై కలుస్తూ ఉంటాడు. వారిద్దరి సాన్నిహిత్యం ప్రణయానికి దారితీస్తుంది. ఆమెకు దగ్గరౌతున్నా తన జీవితపు చీకటికోణమైన నార్మాతో సంబంధం, తాను నార్మా ఇంట ఉండటం గురించి బెట్టీతో ఏమీ చెప్పడు. ఇదిలా ఉండగా, ఒక రాత్రి మాటల సందర్భంలో బట్లర్ మాక్స్ జో గిల్లిస్‌తో తన జీవితగాథ చెబుతాడు. నిజానికి అతడు నార్మాడెస్మండ్ మొదటి భర్త. ఆమెకు పదహారేళ్ళ వయసున్నప్పుడు, అతడు ఆమెలోని కళాకౌశలాన్ని గుర్తించి, అవకాశాలిచ్చి ఆమెను గొప్ప తారను చేస్తాడు. అయితే, ఆమె తారగా నిలదొక్కుకున్న తరువాత అతడి అవసరం తీరిపోయాక అతడిని వదిలివేస్తుంది. అప్పటికే అతడొక గొప్ప మూకీ చిత్ర దర్శకుడు. ఆమెపై ప్రేమను చంపుకోలేక తన వృత్తిని వదులుకుని, ఆమె ఇంట బట్లర్‌గా చేరి, ఆమె బాగోగులు చూసుకోవటం జీవనధ్యేయంగా పెట్టుకుంటాడు. అతడి పేరు మాక్స్ వాన్ మేయర్లింగ్.

నార్మా జో గిల్లిస్‌కి వయసులో ఉన్న వేరే స్త్రీతో అనుబంధం ఉన్నదని శంకిస్తుంది. అతడి గదిలో స్క్రిప్ట్ కాగితాల మీద బెట్టీ పేరు చూసి తీవ్ర మనస్తాపానికి గురౌతుంది. ఇంతలో బెట్టీకి అరిజోనా నుంచి ఆమెకు ఇదివరకే నిర్ణయమైన వరుడు (జో గిల్లిస్ స్నేహితుడు) ఆర్టీ గ్రీన్ టెలిగ్రామ్ వస్తుంది. వెంటనే పెళ్ళికి సిద్ధం కమ్మని. జో గిల్లిస్‌కి ఈ విషయం చెప్పి, ఈనాడు తాను జోని ప్రేమిస్తున్నానని బెట్టీ చెబుతుంది. జో కూడా ఆమెపట్ల ప్రేమను వ్యక్తం చేస్తాడు.

ఆ రాత్రి నార్మా ఇంటికి చేరుకున్న జో గిల్లిస్ నార్మా బెట్టీ ఫోన్ నంబర్ కనుక్కుని, ఫోన్ చేసి, ఆమెకు తామిద్దరి మధ్య ఉన్న సంబంధాన్ని తెలియజేస్తూ, జో తనతో సహజీవనం చేస్తున్నాడని, కావాలంటే వచ్చి చూడమని తన చిరునామా ఇవ్వటం వింటాడు. బెట్టీ రానే వస్తుంది. జో గిల్లిస్ తాను పరిస్థితుల ప్రాబల్యం వల్ల నార్మాతో సహజీవనం చేస్తున్న మాట యదార్థమేనని చెబితే, బెట్టీ-

"జరిగినది మర్చిపోయి అన్నీ వదిలి తనతో వచ్చెయ్యమని" అర్థిస్తుంది. జో నిరాకరిస్తూ, తానొక విముక్తిలేని ఒప్పందంలో ఇరుక్కున్నానని, తన జీవితం ఇక అంతేనని, తనను వదిలి వెళ్లిపొమ్మని బెట్టీకి చెబుతాడు. ఇక తన జీవితానికి అర్థం లేదనిపించి, తన మీద తనకే అసహ్యం కలుగగా, ఒహాయో తిరిగి వెళ్ళటానికి సామాన్లు సర్దుకుంటాడు. నార్మా ఇచ్చిన ఖరీదైన దుస్తులు, బంగారు వస్తువులు, ప్రేమ కానుకలు ఆమెకు తిరిగి ఇచ్చివేస్తాడు.

నార్మా కళ్ళకు కప్పుకున్న అబద్ధపు తెరను పటాపంచలు చేస్తూ, ఆమెకు ఏ అభిమానులూ లేరని, ఆమె కీర్తిప్రతిష్టలు ఏనాడో మరుగున పడ్డాయని కఠినంగా చెబుతాడు. వయసు పెరగటం సహజమైన ప్రక్రియ అని, అందరికీ జరిగేదే నీకూ జరిగిందని, మేలుకొమ్మని చెబుతాడు. అంతేకాక, "నీ స్క్రిప్ట్ చూసి కాదు, నీ కారు షూటింగ్ కోసం కావలసి మాత్రమే నీకు పారమౌంట్ స్టూడియో ఫోన్ చేసింది" అనే నిజాన్ని కర్కశంగా తెలియజెపుతాడు. అతడు వెళ్ళిపోయే ప్రయత్నంలో ఉంటే, "తారలను ఎవరూ వదిలి వెళ్ళలేరు" అని అరుస్తూ, నార్మా అతడి వెనకే ఇంటి బయటికి వచ్చి, అతడిని ఆపజాలక, తన రివాల్వర్‌తో అతడిని వెన్నులోనూ, కడుపులోనూ కాలుస్తుంది. జో గిల్లిస్ తనకు ఇష్టమైన స్విమ్మింగ్ పూల్‌లో నిలువునా పడిపోయి మరణిస్తాడు.

లెక్కలేనంతమంది పోలీసులు, పత్రికా విలేకరులు, కెమెరాలతో ప్రఖ్యాత మూకీ చిత్రాల తార నార్మా డెస్మండ్ ఇల్లు కిటకిటలాడుతుంది. నార్మా మనస్థితి పూర్తిగా దెబ్బతిని వుంది. తన బెడ్‌రూమ్ నుంచి ఆమెను ఎవరూ కదిలించలేక పోతున్నారు. వాతావరణం ఉద్విగ్నంగా ఉన్న ఆ తెల్లవారుజామున ఆఖరు

ప్రయత్నంగా బట్లర్‌గా వ్యవహరిస్తున్నా ఆమె మాజీ భర్త, దర్శకుడు మాక్స్ వాన్ మేయర్లింగ్ పరిస్థితిని తన అదుపులోకి తెచ్చుకుని "కెమెరాలు వచ్చాయి..కిందికి రమ్మ"ని నార్మాతో చెబుతాడు.

షూటింగ్ మొదలు కానున్నదనే భ్రమలో నార్మా తన అలంకరణకు తుదిమెరుగులు దిద్దుకుని 'సలోమ్' పాత్రలో లీనమై నాటకీయంగా మెట్లు దిగి వస్తుంది. మెట్లమీద అడుగడుగునా పోలీసులు, విలేకరులు కిక్కిరిసి ఉంటారు. ప్రెస్ కెమెరా వద్ద నిలబడి "కెమెరా, యాక్షన్" అంటూ చెబుతాడు మాక్స్. అందరూ ఆ దయనీయ సన్నివేశంలో లీనమై, విభ్రాంతులై నిలబడి ఉంటారు. ఆమె కిందకు దిగి వచ్చి, తాను ఎంతో సంతోషంగా ఉండటం చేత, తనకు మాటలు రావటం లేదని, ఇక ఎన్నో చిత్రాలలో నటిస్తానని, ఎప్పటికీ అభిమానులను నిరాశ పరచనంటూ దర్శకుడు సిసిల్ డిమిల్‌ను ఉద్దేశించి తాను (దగ్గర నుంచి తీసే) క్లోజ్-అప్ షాట్‌కి సిద్ధంగా ఉన్నానని చెబుతుంది. ఇదీ నార్మా డెస్మండ్ కథకి ముగింపు.


జో - మాక్స్

## విశేషాలు

★ నార్మా డెస్మండ్ కళ్ళకు కనబడని భ్రమలను ఈ చిత్రం ప్రేక్షకులకు కళ్లారా చూపిస్తుంది.

★ తనకంటే ఎంతో వయసు తక్కువవాడైన యువకుడి సాహచర్యంలో ఆమె తానింకా ఆకర్షణీయమైన అందగత్తెననే ఆశ్వాసనను పొందే ప్రయత్నం చేస్తుంది. తన పరిధిలో జో గిల్లిస్‌తో తాను ఏర్పరచుకున్న సంబంధాన్ని ఆసక్తికరంగా ఉంచే ప్రయత్నం చేస్తుంది. అతడి వినోదం కోసం రకరకాల వినోద పాత్రలను పోషించి ఉల్లాసం కలిగిస్తుంది. (ఉదాహరణ: ఛార్లీ చాప్లిన్). నిజానికి తనను తాను అసహ్యించుకుంటూనే జో గిల్లిస్ నార్మాతో జీవితాన్ని ఇష్టపడే ప్రయత్నం చేస్తాడు. ఆమె, అతడి జీవితంలో ఏర్పడిన ఆర్థికపరమైన కొరతను తీర్చేందుకు, తన వంతుగా ఖరీదైన దుస్తులు, వస్తువులు, ఇతర సుఖాలను అమరుస్తుంది.

★ జో గిల్లిస్ వ్యక్తిత్వం బట్లర్ మాక్స్ వంటిది కాదు. మాక్స్ తన పేరు ప్రతిష్టలను వదులుకుని, కేవలం ప్రేమ కోసం మాజీ భార్య ఇంట్లో బట్లర్ ఉద్యోగానికి కూడా సిద్ధపడిన మనిషి. ఆమె వదిలేసినప్పుడు అతడికి జీవితంలో అర్థంలేదనిపించింది. ఆమె మరి రెండు పెళ్లిళ్లు చేసుకుని, వారితో విడిపోయినా మాక్స్ మాత్రం ఆమె మనసు చెదరకుండా అబద్ధాలను వాస్తవాలుగా భ్రమింపజేస్తూ, ఆమె బాగోగులు చూస్తూ, గొప్ప విశ్వాసంతో ఉంటాడు. జో గిల్లిస్ అలా కాదు. అతడు ఉన్నది ఉన్నట్టు కరకు మాటలలో చెప్పే మనిషి. నార్మా ఆత్మహత్య చేసుకుంటానని బెదిరిస్తే, "మేలుకో, నీ ప్రేక్షకులు 20 ఏళ్ల క్రితమే నిన్ను వదిలి వెళ్లిపోయారు. నీ హావభావాలు ఖాళీ ఇంట్లో ప్రదర్శించాల్సిందే" అంటూ ఎగతాళి చేస్తాడు. అతడిలో మానవత్వం, జాలి లేకపోలేదు. ఆమె భ్రాంతిలో బతకటం అతడిని కలవరపెడుతుంది. "50 ఏళ్ళు వస్తే బాధపడేదేముంది? పాతికేళ్ళ మనిషిలా నటిస్తూంటే తప్పు", "డబ్బు ఉండే వయసు మీరిన స్త్రీ, డబ్బు లేని సాధారణ యువకుడు..ఇదీ కథ" అంటాడు వ్యంగ్యంగా జో గిల్లిస్.

★ *(దర్శకుడు సిసిల్ డిమిల్‌ను ఉద్దేశించి) "ఇంకెవ్వరూ లేరు..మనము, కెమెరాలు..చీకటిలో కూర్చున్న అద్భుతమైన జనం (ప్రేక్షకులు). నా క్లోజ్-అప్ తియ్యండి, ఇదుగో, సిద్ధంగా ఉన్నాను"*

**- దర్శకుడు బిల్లీ వైల్డర్ నార్మా పాత్రధారిణి గ్లోరియా స్వాన్సన్‌తో-**

బిల్లీ వైల్డర్ ప్రతిభావంతుడైన దర్శకుడు. అతడు తీసిన చిత్రాలు గొప్పవిగా ప్రసిద్ధిపొందాయి.

★ ఎంజీఎం సంస్థ అధినేత లూయిస్ మేయర్ ఈ చిత్రం ప్రివ్యూ చూసి, బిల్లీని చెడ్డగా దూషించి, థియేటర్ వదలి వెళ్ళాడట. "నీకు అన్నం పెట్టి, ఉనికినిచ్చిన చలనచిత్ర రంగం గురించి ఇలాంటి వాస్తవిక చిత్రం నిర్మిస్తావా? నిన్ను చిత్రవధ చేసి హాలీవుడ్ నుంచి తరిమికొట్టాలి" అని కోపగించుకున్నాడట.

ఔను మరి. అందం, ఐశ్వర్యం, అభిమానం రంగులు పులిమి ఇంద్రధనస్సులా మెరిసే చిత్రసీమ- జాగ్రత్తగా దాచిన కన్నీళ్లు, రచయితలు, సాంకేతిక నిపుణులు పడే కష్టనష్టాలు, తెరవెనుక శ్రమించేవారి అనామకత్వం..అన్నీ బట్టబయలు చేసిన చిత్రం 'సన్‌సెట్ బౌల్‌వార్డ్'.

కీర్తి పరాకాష్ఠ - అనామకత్వం అధోగతి - ఈ రెంటి మధ్య గడిచే కళాకారుల జీవితం గురించి, తమ యవ్వనం గడిచాక సినీ వ్యాపారానికి ఉపయోగపడక ఉద్వేగపరంగా, మానసికంగా వారు అనుభవించే క్లేశం గురించి, గొప్ప భవంతులలో ఒంటరితనంతో, అనామకత్వంతో నిండిన వారి దైనందిన జీవితం..వీటిని బిల్లీ వైల్డర్ వాస్తవికంగానే కాక కళాత్మకంగా చూపించాడు.

★ ఈ చిత్రంలో చివరికి ఏం జరగబోతుందో మొదటి దృశ్యంలోనే చూపిస్తారు (జో గిల్లిస్ మరణంతో) అతడిని ఎవరు చంపారో కూడా తెలుసు. ఇది ఎలా జరిగిందో కథ ముందుకు నడిచే కొద్దీ తెలుస్తుంది. చిత్రకథ మొదలు కాకుండానే హీరో మరణించటం, ఆ శవం ప్రయోక్తగా చిత్రాన్ని తుదివరకు నడిపించటం ఈ చిత్రం ప్రత్యేకత. ఇది 67 సంవత్సరాల క్రితం నిర్మించిన చిత్రం. అందుకే దీన్ని క్లాసిక్ అంటారు. ఇప్పటికీ వినూత్నమైనదే.

★ 'మాకు మాటల అవసరం లేదు. మాకు ముఖాలు ఉన్నాయి' అంటుంది నార్మా! అంటే అన్ని భావాలు పలికే ముఖకవళికలు ఉండగా, మాకు మాటలతో పనేమిటి అని ఆ మూకీతార అభిప్రాయం.

★ ఈ చిత్రానికి ఎందరో తారల విషాద జీవితాలు ప్రేరణగా చెబుతారు. కొందరి మరణాలు కూడా! ఆఖరికి పేర్లు కూడా కొందరు దురదృష్టవంతులకు సంబంధించినవిగా పేరు పొందాయి.

గ్లోరియా స్వాన్సన్ మూకీ చిత్రాల ప్రసిద్ధ నటి. ఈమె వయస్సు 53 సంవత్సరాలు. ఈ చిత్రంలో 50 ఏళ్ల నాయిక పాత్ర ధరించింది.

గ్లోరియా అందం, ఆరోగ్యం, ఆకారం పట్ల జీవితాంతం ప్రత్యేక శ్రద్ధ తీసుకున్న మహిళ. ఆమె వర్చస్సు, అందచందాలు చెప్పుకోదగ్గవిగా పేరు పొందాయి. ఆమెను అత్యుత్తమ నటిగా ఎన్నో చలనచిత్ర సంస్థలు ప్రస్తుతించాయి. ఆమెకు ఆస్కార్ నామినేషన్ వచ్చినా పురస్కారం తప్పిపోయింది.

# పోలీసులతో పాటు నార్మా గదిలో హెడ్డా హూపర్

ఈ చిత్రానికి ఒళ్ళు గగుర్పొడిచే నేపథ్య సంగీతాన్ని సమకూర్చిన వాక్సమాన్ ఆస్కార్ పురస్కారం కైవసం చేసుకున్నాడు. ఒక్కొక్క పాత్రకు ఒక్కొక్క శైలి సంగీతాన్ని అతడు సమకూర్చాడు. పరిస్థితుల తోపాటు సంగీతం మారుతూంటుంది. హిచ్‌కాక్ తన చిత్రాలు కొన్నింటిలో సంగీత దర్శకత్వం వాక్స మాన్‌కే అప్పజెప్పాడు.

కళాదర్శకత్వానికి (సెట్ డైరెక్షన్) కూడా ఆస్కార్ లభించింది. నార్మా భవంతిలోని భయంకరమైన ఒంటరితనం, ఆమెలోని భ్రాంతి అద్భుతంగా నలుపు తెలుపులలో ఆవిష్కరించాడు కళాదర్శకుడు.

బిల్లీ వైల్డర్ దర్శకుడిగా కాక స్క్రీన్ ప్లే అంశంలో ఆస్కార్ కైవసం చేసుకున్నాడు. రచయితగా అతడు ఎంతో ప్రతిభావంతుడు. తన రచనకు తాను ఊహించే దృశ్యం పూర్తి న్యాయం చెయ్యాలని కోరుకునే కళాకారుడు. చిత్రం శీర్షిక సన్‌సెట్ బోల్‌వార్డ్ అనే పేరు చిత్రం ప్రారంభంలో ఒక కాలిబాట (ఫుట్ పాత్) మీద రాసి ఉండటాన్ని చూపిస్తారు. ఆ పేరు దరిదాపుల్లో చెత్తా చెదారం పోగై ఉంటుంది. సినీతారలు ప్రాముఖ్యం కోల్పోయిన తరువాత వారి జీవితాలను ఇలా ప్రతీకాత్మకంగా చూపటమా అని విమర్శకులు విస్తుపోయారు. ఎంతో గొప్పగా అందరూ చెప్పుకున్న దృశ్యం మొట్టమొదటిది. జో గిల్లిస్ శవం స్విమ్మింగ్ పూల్ లో తేలటం. ఆ చిత్రీకరణ విశిష్టంగా జరిగింది. పూల్ అడుగున అద్దం అమర్చి, ఆ ప్రతిబింబాన్ని చిత్రీకరించాడు బిల్లీ వైల్డర్.

ఫోటోగ్రఫీ ఎంతో గొప్పగా నోవార్ - ఫిలింశైలిలో చిరస్మరణీయంగా ప్రేక్షకుల జ్ఞాపకాలలో నిలిచిపోతుంది. క్రీనీడలు, అద్దాలు చిత్రంలోని ఉద్విగ్నతకు దోహదం చేస్తాయి.


నార్మా పడకగదిలో హెడ్డా హూపర్

వెదురు తెరల నుంచి నల్లకళ్లజోడు పెట్టుకుని నార్మా బయటికి చూడటం, అలాంటి ఒక దృశ్యం.

సన్‌సెట్ బోల్‌వార్డ్ చిత్రం ఒక కాలాతీతమైన కళాఖండం. ఆ చిత్రం ముఖ్యాంశం నేటికీ వర్తిస్తుంది. విమర్శకులు నార్మా పెంపుడు చింపాంజీని పాప్ తార మైఖేల్ జాక్సన్ పెంపుడు చింపాంజీ 'బుబ్బుల్స్'తో, అతడి నివాసం 'నెవర్ లాండ్ రాంచ్'ను నార్మా భవనంతో పోలుస్తారు. ఈనాటికీ కొందరు మాజీ తారలు తమ గత వైభవాన్ని శాశ్వతమని భ్రమిస్తారని అంటారు విమర్శకులు. అస్థిరమైన ప్రపంచంలో, మానసిక స్థిరత్వం ఆవశ్యకత గురించిన విజ్ఞప్తి ఈ చిత్రం. ★

## బట్లర్ మాక్స్, జో గిల్లిస్

★ జో గిల్లిస్ పాత్రధారి విలియం హోల్డెన్ అనే గొప్ప నటుడు. ఈ చిత్రంతో తారాపథానికి ఎగిసిపోయాడు. ఆస్కార్ నామినేషన్ దక్కించుకున్నాడు.

★ బట్లర్ మాక్స్ పాత్రధారి ఎరిక్ వాన్ స్టార్ హీమ్ నిజజీవితంలో కూడా మూకీ చిత్రాల దర్శకుడు, నటుడు. నిజజీవితంలో ఎన్నో మూకీచిత్రాలలో గ్లోరియా ఇతడి దర్శకత్వంలో నటించింది. అతడు ఎన్నో గొప్ప చిత్రాలను నిర్మించినా, స్టూడియోలతో విభేదాల వల్ల అవన్నీ వెలుగు చూడలేదు. ఎంతో లోచూపు కలిగిన ఎరిక్ తాను ఈ చిత్రంలో పనిచెయ్యటం ఒకరకంగా తన చలనచిత్ర జీవితాన్ని పునర్జీవించటమని అర్థంచేసుకున్నాడు. పతాక సన్నివేశంలో దర్శకుడు బిల్లీ వైల్డర్ ఎరిక్ వన్ స్టార్ హీమ్‌కు దర్శకుడి హోదాలో కెమెరా, యాక్షన్ అని చెప్పే సందర్భాన్ని కల్పించటం క్షణికంగా అతడి కల సాకారం కావటమే.

★ సిసిల్ డిమిల్ తన చిత్రం 'సాంసన్ అండ్ డిలైలా' చిత్రీకరిస్తున్నప్పుడు నార్మా పారమౌంట్ స్టూడియోకి వస్తుంది. నిజానికి డిమిల్ గ్లోరియా స్వాన్ సన్ చిత్రాలకు దర్శకత్వం వహించాడు. అలా ఈ చిత్రంలో ఎన్నో జీవితాలు, పాత్రలు - వాస్తవాలతో పెనవేసుకున్నాయి. అలాగే జో గిల్లిస్ 'మైనపు శిల్పాలు'గా చెప్పిన మూకీ తారలు ఈ చిత్రంలోనూ మూకీతారలే. గత వైభవంలో ఘనీభవించిన మైనపు ముద్దలు. హాలీవుడ్ ఉబుసుపోక కబుర్ల మహారాణి, మీడియా గాలివార్తల వ్యాసకర్త హెడ్డా హూపర్ తన నిజజీవిత పాత్రలోనే నార్మా పడకగదిలోకి చొరబడి, ఆమె విషాదజీవితాన్ని వినోదవార్తగా పుటలకెక్కించటానికి సన్నద్ధురాలౌతుంది.




-డా.టి.కళ్యాణీ సచ్చిదానందం

22

దూరం నుంచి సాగర ఘోష వినరావడంతో అటు వైపు దృష్టి సారించి, ఉత్సాహంతో ఉరకలు వేస్తూ సాగర తీరాన్ని చేరి అందులో కలిసిపోయి సేదతీరింది గంగాదేవి. ఆమె సముద్రంలో కలిసిపోయి సంగమించిన ఆ స్థానం 'గంగాసాగర'మనే పేరుతో ప్రసిద్ధిచెందింది. ఆ స్థానంలో స్నానం ఆచరించి, పుణ్యకార్యాలు చేయడం వల్ల, అనంతమైన పుణ్యం సంప్రాప్తిస్తుంది.

గంగాదేవి సాగరంలో సంగమించిన ఆ పవిత్ర సమయంలో సూర్యుడు మకరరాశిలోకి సంక్రమించడంవల్ల, ఆ సమయానికి మరింత పవిత్రత లభించింది. ఉత్తరాయణ పుణ్యకాలం ప్రారంభమౌతుంది. దేవతలకు పగటిపూటగా చెప్పబడే ఈ సమయంలో గంగాసాగర స్థానంలో స్నానం ఆచరించి పుణ్యకార్యాలు, దానధర్మాలు కావించి, ధన్యులు కాసాగారు భూలోకవాసులు.

### గంగాస్తుతి

మాతార్జాహ్నవి! శంభు సంగమిళితే మౌళౌ నిధాయాంజలీం।
తత్తీరే వపుషోవసాన సమయే నారాయణాంఘ్రి ద్వయం॥
సానందం స్మరతో భవిష్యతి మమ ప్రాణ ప్రయాణోత్సవే।
భూయాద్భక్తి రవిచ్యుతా హరిహరా ద్వైతాత్మికా శాశ్వతీ॥

(తల్లీ జాహ్నవి (గంగాదేవి) శివుని జటలలో ఒదిగివుండే నీకు నమస్కరిస్తున్నాను. నీ నదీతీరంలో అవసాన సమయంలో మహావిష్ణువు పాదపద్మాలయందు మనస్సును లగ్నం చేయడం వల్ల, నామాన్ని పఠించడం వల్ల విష్ణులోకప్రాప్తి కలుగుతుంది)

ఏదీ! అందరూ పాపాల్ని పరిహరించి, మోక్షాన్ని ప్రసాదించే గంగామాతను ధ్యానించి నమస్కరించండి" అంటూ గంగాదేవిని స్తుతించి, చెప్పటం ఆపారు సూతమహర్షి.

(గంగాసాగర స్థలాన్ని కొలకత్తా డైమండ్ హార్బర్ నుండి మోటర్ బోట్లలో వెళ్లి దర్శించవచ్చును. కపిలమహర్షి, గంగాదేవిల మందిరాలను దర్శించి, ఆ పవిత్రస్థానంలో స్నానాలు చేసి, పిండప్రదానాలు, దానధర్మాలు ఆచరించడం వల్ల, అనంతమైన పుణ్యం లభిస్తుంది! మకర సంక్రాంతినాడు ఇక్కడ పెద్ద ఉత్సవం నిర్వహింపబడుతోంది. భక్తులు పెద్దసంఖ్యలో వచ్చి, స్నానాలు ఆచరించి, పునీతులౌతుంటారు)

"దేవర్షీ! మధ్యలో అడిగే సాహసం చేస్తున్నందుకు మన్నించాలి. జగన్మాత మణిద్వీపవాసిని మహాకాళి, దుర్గ, మహిషాసురమర్దిని మొదలైన రూపాలలో, దేవీ నవరాత్రులలో అవతరించి, అసుర సంహారం కావించినట్టు చెప్పారు గదా! మరి సరస్వతీమాత రూపంలో ఏ అసుర సంహారం కావించిందో తెలియజెప్పవలసిందిగా ప్రార్థిస్తున్నాను" అంటూ ఏకాగ్రతతో వింటున్నవారిలో, ముందు వరసలో కూర్చునివున్న మునిబాలుడు లేచి, వినయంగా నమస్కరించి అడగటంతో, అతనివైపు వాత్సల్యంగా చూసారు సూతమహర్షి.

"మంచి విషయం గూర్చి అడిగావుకుమారా! దేవీ నవరాత్రులలో తప్పక మననం చేసుకోవలసిన వృత్తాంతం శుంభ-నిశుంభుల చరితం.

శ్రీ దేవీమాత ఈ పర్వదినాలలో అష్టమినాడు మహాలక్ష్మిగా అవతరించి, మహిషాసురుని సంహరించింది.

"పాతయా మాస మహిషం దేవీ దేవ గణాంతకం।
ఏవం లక్ష్మీ సముత్పన్నా మహిషాసుర మర్దినీ॥" అని వర్ణించబడింది శ్రీదేవీ భాగవతంలో.

అదేవిధంగా-

"దేవ దేవీ జగద్ధాత్రి భక్తాభీష్ట ఫలప్రదే!
జగన్మాయే మహామాయే సముద్ర శయనే శివే॥
కాళరాత్రి ర్మహారాత్రి ర్మోహరాత్రి ర్మదోత్కటా।
వ్యాపినీ వశ గామ్యాన్యా మహానందైక శేవధిః॥"

జగన్మాత మహాకాళిగా జీవులకు నిద్రావస్థను కల్పిస్తుంది. యోగనిద్రగా ఆరాధింపబడే మహాకాళి, ప్రళయకాలంలో యోగనిద్రవశుడైన మహావిష్ణువును విడిచి, ఆకాశమార్గాన నిలిచి, మధుకైటభులను తన మాయావశులను చేసి, విష్ణువుచేతిలో మరణించేలా చేసింది.

ఇక శుంభ-నిశుంభులనే దానవసోదరులను మహాసరస్వతిగా ఆవిర్భవించి, శరన్నవరాత్రుల సమయంలోనే అంతం కావించింది. మహాసరస్వతి ఆవిర్భావం, ఆ దేవి శుంభ-నిశుంభులు, ఇతర ఉగ్రదానవులతో కావించిన యుద్ధం గూర్చి, దేవీ భాగవతం లోనూ, దుర్గాసప్తశతిలోనూ, మార్కండేయ పురాణంలోనూ తెలుపబడింది. ఈ సమయంలో దేవీ నవరాత్రోత్సవాల వివరాలు చెప్పే అవకాశం లభించినందుకు, సరస్వతీమాతకు నమస్కరించుతున్నాను. అందరూ భక్తిశ్రద్ధలతో వినండి" అంటూ ముందుగా అంజలి ఘటించి-

"యాదేవీ సర్వభూతేషూ విద్యా రూపేణ సంస్థితా।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః॥
యాదేవీ సర్వ భూతేషూ బుద్ధిరూపేణ సంస్థితా।

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః" అంటూ సరస్వతీ మాతను ధ్యానించి, చెప్పటం కొనసాగించారు సూతమహర్షి.



జగన్మాత మహాకాళిగా జీవులకు నిద్రావస్థను కల్పిస్తుంది. మహాకాళి, ప్రళయకాలంలో యోగనిద్రవశుడైన మహావిష్ణువును విడిచి, మధుకైటభులను తన మాయావశులను చేసి, విష్ణువు చేతిలో మరణించేలా చేసింది

★ ★ ★

## శుంభ-నిశుంభుల వృత్తాంతం

"దానవ ప్రభువులు శుంభ-నిశుంభులకు జయము! జయము!" అని దానవసేనలు జయ జయ ధ్వానాలు చేస్తుండగా, పాతాళలోకంలో సింహాసనాన్ని అలంకరించారు శుంభ-నిశుంభులు.

"స్వాగతం భావి త్రిలోకాధిపతులకు" అంటూ మంత్రి, సేనాపతులు వెంటరాగా, దైత్యదానవుల గురువు, శుక్రాచార్యుడు ప్రసన్నంగా చూసాడు వాళ్లవైపు.

"గురువర్యా! మీరు ఆనతిచ్చిన ప్రకారం, బ్రహ్మను తపస్సుతో మెప్పించి, ఇంద్రాదిదేవతలు, త్రిమూర్తులు మొదలైనవారెవరి చేతిలో మరణం లేకుండా వరం పొంది వచ్చాము. ఇక స్వర్గంపై దాడికి వెడలడమే ఆలస్యం" అంటూ వికటాట్టహాసం చేసారు ఆ దానవసోదరులు.

"అవును. మిమ్మల్ని ఆ దేవతలు ఎదిరించి జయించలేరు. వెంటనే వెళ్లి, స్వర్గాన్ని స్వాధీనం చేసుకోండి. అట్లాగే వాళ్లను ఆరాధించే భూలోకవాసుల మీద ఆధిపత్యం చేజిక్కించుకోండి. త్రిలోకాధిపతులుగా మీ శక్తిసామర్థ్యాలు అందరికీ తెలిసివచ్చేలా దానవ సామ్రాజ్యాన్ని పాలిస్తూ, మూడు లోకాలలో దానవపతాకం ఎగరవేయండి" అంటూ శుక్రాచార్యుడు ఆవేశంగా, కర్తవ్యోపదేశం చేసాడు.

శుంభ-నిశుంభులు రెట్టించిన ఉత్సాహంతో జయభేరి మ్రోగించి, స్వర్గంవైపు కదిలి వెళ్లారు దానవ సైన్యం వెంటరాగా!

★ ★ ★

"గురుదేవా! విన్నారా ఆ దానవుల భేరీనాదాలు. మహిషాసురుని బెడద తొలిగినందుకు సంతోషిస్తుంటే, ఇప్పుడీ దానవ సోదరులు స్వర్గాన్ని ఆక్రమించాలన్న కోరికతో యుద్ధానికి వస్తున్నారు. ఇప్పుడు మన కర్తవ్యమేమిటి?" అంటూ, బృహస్పతిని సలహా అడిగాడు ఇంద్రుడు.

"ఇంద్రా! ఇప్పుడు వాళ్ల నెదుర్కోవడం అవివేకమౌతుంది. వరప్రభావం వల్ల, వారు మీ చేతిలో అపజయం పొందరు. అందుచేత మీరు వెంటనే స్వర్గాన్ని విడిచి, భూలోకాన్ని చేరి, హిమాలయ పర్వత ప్రాంతాల గుహలలో తలదాచుకుని, పరాంబిక, జగన్మాతను ఆరాధిస్తూ ఉండండి. ప్రకృతిరూపిణి, స్త్రీతత్త్వంతో ఆవిర్భవించి, ఆ దానవులను సంహరిస్తుంది. అంతవరకు వేచి వుండవలసింది" అని బృహస్పతి సలహా ఇవ్వడంతో, దానవసైన్యంతో శుంభ-నిశుంభులు స్వర్గానికి రావడానికి ముందుగానే, దేవతలు తమ లోకాన్ని విడిచి, భూలోకంలో హిమవత్పర్వత ప్రాంతాన్ని చేరి, దేవి ఆరాధనలో నిమగ్నులైనారు.

శుంభ-నిశుంభులు దేవతలు పారిపోవడం తెలిసి, ఆనందోత్సాహాలతో స్వర్గాన్ని, సర్వసం

పదలను చేజిక్కించుకొని, భూలోకంలో గూడా రాక్షసపాలన నెలకొల్పి, నిరంకుశంగా ప్రవర్తిస్తూ, లోకాలలో అరాచకం సృష్టించి, భోగ విలాసాలలో మునిగి, కాలం గడపసాగారు.



## దేవతలు, దేవీమాతను ఆరాధించడం

బృహస్పతి ఉపదేశంతో, హిమవత్పర్వత గుహలలో చేరిన ఇంద్రాది దేవతలు, మృణ్మయం (మట్టి)తో చేసిన దేవీవిగ్రహాన్ని పూజిస్తూ, తమకు రక్షణ ప్రసాదించమని ప్రార్థిస్తూ, 'హ్రీం' బీజోపాసన చేయసాగారు.

"హ్రీంకారాసన గర్భితా నల శిఖాం- సౌః క్లీం కళాబిభ్రతీమ్।
సౌవర్ణాంబరధారిణీం వరసుధా - ధౌతాం త్రినేత్రోజ్జ్వలామ్॥
వందే పుస్తకపాణి మంకుశధరాం-స్రగ్భూషితా ముజ్జ్వలాం।
త్వాం గౌరీం త్రిపురాం పరాత్పర కళాం - శ్రీచక్ర సంచారిణీమ్॥"

అంటూ నిర్మల హృదయంతో వాళ్లు కావించిన 'హ్రీం' బీజోపాసనకు ప్రసన్నురాలై, వాళ్ల ముందర సాక్షాత్కరించింది మణిద్వీపవాసిని దేవీమాత.

"హే! జగజ్జనని! హ్రీంకారాన్ని నాద తనువుగా గలదానివి. ప్రభా స్వరూపిణివి. మూల ప్రకృతివి. నీ సంకల్పమాత్రాన లోకాలు నశించి, తిరిగి ప్రాదుర్భవం చెందుతాయి. నీ ఆజ్ఞ లేనిదే ఎవరూ ఏమీ చేయలేరు. ప్రాణులకు ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులను ప్రదానం చేసే శక్తిరూపిణివి. మా పై కరుణార్ద్రదృష్టిని ప్రసరింపజేసి, ముల్లోకాలలో అశాంతిని సృష్టిస్తున్న దానవ సోదరులను వధించు తల్లీ! నీకు కోటి కోటి ప్రణామాలు" అంటూ విన్నవించుకున్నారు ఇంద్రాది దేవతలు.

వాళ్లవైపుప్రసన్నంగా చూసింది దేవీమాత.

"దేవతలారా! శుంభ-నిశుంభులు వరగర్వంతో లోకకంటకులై ప్రవర్తిస్తున్న విషయం నేనెరుగుదును. వాళ్లను వధించవలసిన సమయం ఆసన్నమైంది" అన్నది.

అందరూ అంజలి ఘటించి చూస్తూండగానే, దేవి శరీరం నుండి అత్యంత సౌందర్యవతి, వీణాపుస్తకధారిణి, దివ్యతేజంతో విరాజిల్లుతూ ఆవిర్భవించింది.

"దేవతలారా! ఇప్పుడు మీ ముందు ఆవిర్భవించిన శక్తిరూపిణిని మహాసరస్వతి అంశ అయిన కౌశికీదేవిగా గుర్తెరగండి.

పార్వతీదేవి మహాకాళి రూపంలో కౌశికీదేవి వెంట వెళ్లి, శుంభ-నిశుంభ వధనం కావించడంలో సహాయపడుతుంది. ఆ ఇద్దరినీ ఆరాధించి, మీ కష్టాలనుండి విముక్తిపొందండి" అని అంతర్ధానం చెందింది దేవీమాత.

"కౌశికీ సా జగత్పూజ్యా దేవాన్ప్రీత్యై ద మబ్రవీత్।
దేవ శత్రుం పాతయిష్యే నిశుంభ శుంభమేవచ॥
స్వస్థాస్తిష్ఠత భద్రంవః కంటకం నాశయామివః॥
విభుదై స్సంస్తుతా తద్వత్సాక్షా ద్వాగీశ్వరీ పరా॥"



"శౌనకాదిమునులారా! మహాసరస్వతీదేవి కౌశికీదేవిగా అవతరించింది. సౌమ్యరూపంతో చేతులలో వివిధాయుధాలు ధరించి, తమ వైపు ప్రసన్నంగా చూస్తున్న ఆ దేవికి నమస్కరించి, నుతించారు దేవతలు, ఋషిగణాలు.

మహాసరస్వతీ ధ్యానం :

"ఓం ఘంటా శూల హలాని శంఖం ముసలే చక్రం ధనుః సాయకం।
హస్తా బ్జైర్దధతీం ఘనాన్త విలసః శీతాంశు తుల్యప్రభాం॥
గౌరీ దేహ సముద్భవాం త్రి జగతా మాధార భూతాం మహా।
పూర్వామత్ర సరస్వతీ మనుభజే శుమ్భాది దైత్యార్దినీం॥"

(ఘంటా, శూలం, హలం, శంఖం, ముసలం, చక్రం, ధనుస్సు మొదలైన ఆయుధాలు వివిధ హస్తాలలో ధరించి, చంద్రునిలా వెన్నెలలు కురిపిస్తూ, పార్వతీదేవి శరీరం నుండి ఆవిర్భవించిన జగత్తుకంతటికీ ఆధార భూతురాలైన మహాసరస్వతీదేవి, శుంభాదిదైత్యులను సంహరించడానికి అవతరించింది. ఆ దేవిని భజిస్తున్నాము)



అంతలో నల్లని కాటుక వంటి దేహంతో మహాకాళీదేవి, కౌశికీదేవిని సమీపించింది. ఆ దేవికి భక్తిపూర్వకంగా నమస్కరించి, స్తుతిం చారు దేవతలు.

## మహాకాళీ ధ్యానం

"ఓం ఖడ్గం చక్ర గదేషు చాప పరి
ఘాన్ శూలం భుశుండీం శిరః
శంఖం సన్ద ధతీం కరైః త్రినయనాం
సర్వాంగ భూషావృతాం॥
నీలాశ్మీద్యుతి మాస్యపాద దశకాం
సేవే మహాకాళికాం।
యామస్తౌత్ స్వపితే హరౌ కమలజో
హంతుమ్ మధుం కైటభం॥"

(ఖడ్గం, చక్రం, శూలం మొదలైన ఆయు ధాలు హస్తాలలో ధరించి, మూడు నేత్రాలతో, వివిధాభరణాలు ధరించి, ఆవిర్భవించిన మహా కాళి మధుకైటభులనే దైత్యులను మహావిష్ణువు చేత వధింపచేసింది)

ఆ విధంగానే ఈ మహాకాళి కౌశికీదేవితో కలిసి శుంభ-నిశుంభ వధ కావించటానికి సంసిద్ధమై ప్రకటితమైంది.

దేవతలు, ఋషిగణాలు, భక్తిభరిత హృద యాలతో ప్రస్తుతిస్తుండగా, వెలుగు-నీడలలా కానవస్తున్న కౌశికీదేవి, కాళికాదేవి సింహాన్ని అధిరోహించి, శుంభ-నిశుంభుల పుర బాహ్య ప్రాంతంలో దిగి , చుట్టూ చూసారు.

వారికోసం సుగంధ పుష్పభరితమైన ఒక ఉద్యానవనం, దాని మధ్యలో ఒక భవనం వెలి సాయి" అంటూ సూతమహర్షి చెబుతుంటే, ఆసక్తిగా వినసాగారు నైమిశారణ్యవాసులు.



"సోదరా చండాసురా! అటు చూడు. ఒక పుష్పోద్యానం, దానిమధ్య సుందరమైన భవనం కనిపిస్తున్నాయి. ఇంతకుముందు ఇక్కడ వాటిని చూసి వుండలేదు. ఎవరు కల్పించారో వాటిని తెలుసుకుందాం పద" అంటూ, తమ్ముడు ముండాసురుడు చూపిన దిక్కున చూసి,

"అవును. ఆశ్చర్యకరమైన విషయమే! తెలు సుకుని ప్రభువులకు నివేదించాల్సిన బాధ్యత మనది గదా! పద చూద్దాం" అన్నాడు చండాసు రుడు ఖడ్గాన్ని సవరించుకుంటూ.

చండ-ముండులనే ఆ ఇద్దరు రాక్షసులు, శుంభ-నిశుంభుల సేనానులు. పుర రక్షణ బాధ్యత వాళ్లది. అందుకే కొత్తగా వెలిసిన ఆ వనంవైపు అనుమానంగా చూస్తూ దగ్గరకు వెళ్లారు.

చండ-ముండులనే ఆ ఇద్దరు రాక్షసులు, శుంభ-నిశుంభుల సేనా నులు. పుర రక్షణ బాధ్యత వాళ్లది. కొత్తగా వెలిసిన ఆ వనంవైపు అనుమానంగా చూస్తూ దగ్గరకు వెళ్లారు.

"సోదరా! ఎవరో ఇద్దరు స్త్రీలు, భవనం ముందర కూర్చుని వున్నారు. దగ్గరకు వెళ్లి వాళ్ల సంగతి తెలుసుకుందాం పద" అంటూ ముందుకు వెళ్లబోతున్న ముండుని చేయి పట్టు కుని ఆపాడు చండుడు.

"వారిలో కూర్చుని గానం చేస్తున్న ఆ సుంద రిని చూడు. ఎంతటి అసమాన సౌందర్యం! ఆమెను చూస్తుంటే, మన ప్రభువులకు తగిన దిగా అనిపిస్తున్నది నాకు. వెంటనే వెళ్లి, ఈ విషయం ప్రభువులకు చెబుదాం పద" అంటూ త్వరత్వరగా వెనుతిరిగి, ముండునితో సరాసరి రాజ భవనాన్ని చేరుకున్నాడు.

అప్పుడు శుంభ-నిశుంభులు తమ బలపరా క్రమాలను సేనావారం పొగడుతుంటే విని, ఆనందిస్తున్నారు. వాళ్లందరికంటే ముందుకు వచ్చి, చండ-ముండులు తమ ప్రభువులను ప్రశంసలతో ముంచెత్తారు.

"ప్రభువులారా! మీరు అవక్రమ పరాక్రమ వంతులు. త్రిలోకాధిపతులు. మీ ముందర నిల వలేక దేవతలందరూ పలాయనం కావించారు. స్వర్గసంపదలు ఐరావతం, కల్పవృక్షం, ఉచ్చై శ్రవం మీ వశమైనాయి. బ్రహ్మదేవుడు మీకు విమానాన్ని, ధనపతి కుబేరుడు మహాపద్మనిధిని ప్రసాదించారు. సాగరుడు 'కింజల్కిని' అనే వాడిపోని పుష్పహారాన్ని, వరుణుడు సువర్ణాన్ని వర్షించే హేమఛత్రాన్ని, యముడు తన 'ఉత్క్రాంతా' శక్తిని మీ అధీనం కావించారు. అనర్ఘమైన మణులు, నవరత్నాలు మీ గృహంలో రాశులు పోసి వున్నాయి. మీకు సాటి మీరేనని లోకాలన్నీ కొనియాడుతున్నాయి. కానీ.." అంటూ ఊపిరి తీసుకోవడానికన్న ట్లుగా ఆగిన చండ-ముండుల వైపు, ప్రశ్నార్థ కంగా చూసారు శుంభ-నిశుంభులు. అంతవ రకు సంతోషంతో వికసించివున్న వాళ్ల ముఖా లలో, చిరాకు చోటుచేసుకుంది. అందుకే-

"కానీ..అంటూ ఆగారేం? ఏమిటో చెప్పండి" అన్నారు అసహనంగా చూస్తూ.

**- ఇంకా వుంది**




# మామూలు కథే, కానీ...



**సంజీవి కోపం నషాళానికి అంటింది. బిగపట్టుకున్న ఆవేశం ఒక్కసారిగా పెల్లుబికింది. ఒక్క ఉదటున లేచి, కుర్చీని వెనక్కి తన్నాడు. అతడి భారీ విగ్రహం చూసి సోదరులు కొంచెం తగ్గారు.**

**డా.డి.విద్యేశ్వరి**

**ఆ** పెద్ద బంగళాలో తెల్లవారురఝామున నాలుగు గంటలకు లైట్లన్నీ వెలుగుతున్నాయి. బంగళా, దాని చుట్టూ ఉన్న తోట, బయట పార్క్ చేసి ఉన్న మూడు కార్లు ఆ ఇల్లు చాలా సంపన్నులదని చాటి చెప్తున్నాయి. మూడింట్లో ఒక కారు బయలుదేరటానికి సిద్ధమన్నట్టు పోర్టికోలో ఎదురు చూస్తోంది. కారు దగ్గర నిలబడి ఉన్నాడు డ్రైవర్. చల్లగాలికి తలకి కట్టుకున్న మఫ్లర్‌ను మరొకసారి దగ్గరగా లాక్కుని, వాచీ చూసుకున్నాడు.

అంత బంగళాలో ఈ తెల్లవారు రఝామున ప్రళయం వచ్చింది. హాల్లో సరిగ్గా పన్నెండుమంది ఉన్నారు. వాళ్ళలో పదిమంది ఆ ప్రళయంలో చిక్కుకున్న వాళ్ళని, వాళ్ళ ముఖాలు చూస్తే ఇట్టే అర్థమైపోతుంది ఎవరికైనా. అపురూప సౌందర్యవతియైన ఒక స్త్రీ సోఫాలో కాలిమీద కాలు వేసుకుని కూర్చుని ఉంది. ఆమె వెనుక ఒక వ్యక్తి ఏ భావమూ లేని చెక్క మొహంతో నిలబడి ఉన్నాడు.

"నేను చెప్పింది అందరికీ అర్థమైందిగా! వారం రోజుల్లో ఇల్లు ఖాళీ చేసి బిల్డర్‌కి ఇచ్చెయ్యాలి. అతను వచ్చి పని మొదలు పెడతాడు"

అక్కడ పేరుకున్న స్మశాన నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ సోఫాలో యువతి మాట్లాడింది.

"భువనా..." ముందుగా తేరుకుని మాట్లాడబోయిన వ్యక్తికి అరవైయ్యేళ్ళుంటాయి.

"నాకు ఫ్లైట్ టైమయింది. నేను చెప్పవలసినది ఇంతే. సంజీవీ సామాను కార్లో పెట్టించావా?" వెనకున్న వ్యక్తిని అడిగింది.

"యస్ మేడమ్!" బదులు చెప్పి సంజీవి సోఫాలో పక్కనున్న బ్యాగ్ చేతిలోకి తీసుకుని బయటకు నడిచాడు.

ఆమె అతడి వెనకే వెళ్ళిపోయింది. పోర్టికోలో కారు స్టార్ట్ అయిన శబ్దానికి హాల్లో ఉన్న పదిమందిలోను చైతన్యం వచ్చినట్టయింది.

"అక్క అమెరికా వెడుతోంది. ఏదో చెప్తానంది. సెండాఫ్ ఇవ్వాలని నన్ను మూడు గంటలకే లేపి కూర్చోబెట్టావు. మీ అక్క మీ అందరి రోగం బాగా కుదిర్చింది" ఒక వ్యక్తి భార్యమీద విరుచుకు పడ్డాడు.

"మీ మరదలు ఎయిర్‌పోర్టుకి వెడదామంది బ్రదర్. నేనే వద్దన్నాను" అతని పక్కనున్న వ్యక్తి వంత పాడాడు.

"భువన ఇలా చేసిందేమిటి? ఇప్పటికిప్పుడు మనందర్నీ టూ బెడ్ రూమ్ ఫ్లాట్స్‌లోకి మారిపొమ్మంటే ఎలా? అంత చిన్న ఇళ్లల్లో ఎలా ఉంటాం?"

"ఇది అక్కకి పుట్టిన బుద్ధి కాదన్నయ్యా. ఎవరో నేర్పి పెట్టారు. ఇన్నేళ్ళుగా కలిసి ఉంటున్నాం. మనందరం తనకెంత సపోర్ట్ ఇస్తున్నామో, తనకి ఎంత

సహాయం చేస్తున్నామో తెలిసి ఇలా అందంటే.. వెనక ఎవరో ఉన్నారని నా అనుమానం" అక్కదున్న మరో ఇద్దరి అనుమానం.

"కొంపదీసి మళ్ళీ ఏ డైరెక్టరో, హీరోనో పెళ్ళి చేసుకుంటానన్నాదేమో!" చెల్లి అనుమానం.

"తల్లివి నీకైనా తెలియదా? మీ ఆడవాళ్ళు దానితో షూటింగ్‌లకి పోతారుగా! ఎవరితోనైనా బాగా చనువుగా ఉంటోందా?" పెద్దాయన ఆడ వాళ్ళవైపు చూసి గర్జించాడు.

వాళ్ళంతా అదేం లేదన్నట్టు అడ్డంగా తలలు తిప్పారు.

"తాను నెంబర్ వన్ హీరోయిన్‌ననే మిడిసి పాటు ఈమధ్య ఎక్కువైంది. బ్యాంక్ అకౌంట్స్ నన్ను చూడనియ్యటం లేదు. ఎన్నాళ్ళని నువ్వు కష్టపడతావు? నేను నేర్చుకోవద్దా అంది. దానికి బాగా స్వార్థం పెరిగిపోయింది" అన్నగారి కళ్ళు ఎర్రబడ్డాయి.

"మీరు నీసా కిందకి దింపితే కదా! పదివేల రూపాయల బిల్లుకి మరొక సున్నావేసి లక్ష రూపాయలకి చెక్కిచ్చారు. అది ఆవిడకి తెలిసింది. ఇంక మిమ్మల్నెలా నమ్ముతుంది?" భార్య వెటకారానికి మండిపడి...

"నువ్వు నోర్మూయ్, దవడ పగలగొట్టానంటే..." అరిచాడు.

"మనలో మనం అరుచుకుంటే లాభం లేదు. అసలు కారణమేమిటో తెలుసుకోవాలి" ఇంకాసేపటికి తల్లి నోరు విప్పింది.

"అసలు విషయం ఏమిటో... సెక్రటరీగదా, వాడికన్నీ తెలుస్తాయేమో! ఆ సంజీవిగాణ్ణి నొక్కాలి. నయానో, భయానో వాణ్ణి లొంగదీస్తే విషయం బయటకు వస్తుంది. ఈమధ్య మనందరికన్నా వాడెక్కువైపోయాడు తనకి"

తమ్ముడు ఇచ్చిన సలహా అందరికీ నచ్చింది! అలాగే చెయ్యాలనుకున్నారు.

పొద్దున్నే అతికష్టంమీద నిద్ర మంచాల మీద నుంచి లేచి తయారై తొమ్మిది గంటలకల్లా అందరూ రెండు కార్లలో సంజీవిని కలిసేందుకు బయలుదేరారు.

వీళ్ళని చూడగానే సంజీవి... "రండి, అంతా కలిసే వచ్చారు. నేనే మీ దగ్గరకు రావాలనుకుంటున్నాను. మేడమ్ మీకు ఎవరికి ఏ ఫ్లాట్లు చెందుతాయో, మీకి వ్వదలచుకున్న క్యాష్ వివరాల పేపర్లు నా దగ్గర ఇచ్చారు. కూర్చోండి.. ఇప్పుడే తెస్తాను.." సంజీవి అందర్నీ ఆహ్వానించాడు.

"అది సరేలే! ఎందుకు భువన ఇలా మారిపోయింది? అందరం హాయిగా ఉన్నాం. ఇప్పుడేమైందని మమ్మల్ని విడిగా వెళ్ళమంటోంది? దీని వెనుక ఎవరైనా సలహాలిస్తున్న



వాళ్ళున్నారా? తల్లిదండ్రులకన్నా, తన కోసమే కష్టపడుతున్న మాకన్నా, ఆత్మీయులెవరున్నారు? తల్లే తోడు అన్న మమ్మల్ని వదులుకుని ఎలా ఉండగలదు?" అన్నగారు కోపాన్నంతా వెళ్ళగ క్కాడు.

"పేపర్ల సంగతి అలా ఉంచు. మాకు అసలు విషయం తెలియాలి చెప్పు?"

అంతా గోలగోలగా మాట్లాడటం మొదలుపె ట్టారు.

"మీకందరికీ ఎవరి ఇళ్ళు వాళ్ళకి ఏర్పాటు చెయ్యాలనుకున్నారు. మీ పిల్లలు కూడా పెద్దవా ళ్ళవుతున్నారు. మీరు స్వతంత్రంగా ఉండి, మీ శక్తిసామర్థ్యాలతో పైకి రావాలనుకుని మేడమ్ ఈ నిర్ణయం తీసుకున్నారు" సంజీవి అందరికీ ఓపిగ్గా సమాధానం ఇచ్చాడు.

"ఏం! దాని సంపద తరిగిపోతుందని భయప డుతోందా? ఇంకా పది, పదిహేనేళ్లు వేషాలు వెయ్యచ్చు. ఆ భయం మాకెవరికీ లేదు" అన్న విరుచుకు పడ్డాడు.

"అన్నేళ్ళు ఫీల్డ్‌లో హీరోయిన్‌గా నిలబడటం కష్టం!" వీలైనంత సౌమ్యంగా బదులిచ్చాడు సంజీవి.

"హీరోయినే కావాలా? మార్కెట్ ఉన్నంత సేపు ఏ వేషమైనా వెయ్యచ్చు.. క్యారెక్టర్ ఆర్టిస్ట్‌గా సంపాదించుకోవచ్చు" తమ్ముడి నిర్ణయం.

"మేడమ్ హీరోయిన్‌గానే రిటైరవాలనుకుం టున్నారు"

"భువనకి పెళ్ళిమీదకు దృష్టిపోయిందా? ముప్ఫై అయిదేళ్ళున్నాయి. ఈ వయసులో దీనికి వరుడెవరు దొరుకుతారు?" తండ్రి అనుమానం.

"మీరంతా మేడమ్‌కి ఇరవై ఎనిమిదేళ్ళనే అంటారు?" సంజీవిలో ఓర్పు నశిస్తోంది... వాళ్ళని చూస్తూ, వాళ్ళ మాటలు వింటుంటే.

"అంటాం. మార్కెట్‌లో నిలబడటం కోసం. పబ్లిక్‌కోసం ఎన్నో చెప్తాం. అన్నంత మాత్రాన వయసు తగ్గిపోతుందా? ఇంతకీ వాడెవడో చెప్పు" అన్న బెదిరింపు.

"అలాంటి విషయమేదీ ఉందని నాకు తెలి యదు"

"అసలిప్పుడే అమెరికా ప్రయాణం ఎందుకు? నెల రోజులు అక్కడేం చేస్తుంది? మమ్మల్నెవర్నీ వెంట రావద్దంది. అందుకే మాకీ అనుమానా లన్నీ"

అసలు సంగతి బయట పెట్టాడు తమ్ముడు.

"అక్కడ కొన్ని ప్రోగ్రాముల్లో పాల్గొనమని ఆహ్వానించారు. ఈ మధ్య వర్క్ ఎక్కువగా ఉంటోంది. హాలీడే కూడా కలిసి వస్తుందని వెడు తున్నానని అన్నారు"

"అది పేపర్లో వచ్చింది. మాకూ తెలుసు. నువ్వేదో దాస్తున్నావు. నీకు తెలియకుండా ఏదీ దాచదు భువన. నీకు నాలుగు తగిలిస్తే అన్ని విష యాలూ బయటికి వస్తాయి" అన్న, తమ్ముడు ఒక్కసారే లేచారు.

సంజీవి కోపం నషాళానికి అంటింది. అంత వరకు బిగపట్టుకున్న ఆవేశం ఒక్కసారిగా పెల్లు బికింది. ఒక్క ఉదుటున లేచి, కుర్చీని వెనక్కి తన్నాడు. అతడి భారీ విగ్రహం చూసి సోదరులు కొంచెం తగ్గారు.

"ఏమిటండీ? ఏమిటి మీరు చేసేది? నా ఒంటిమీద చెయ్యిపడితే మీరంతా కటకటాల వెనక్కి పోతారు ఖబడ్దార్. అవును నాకు తెలుసు! తెలిసినా మీరు చెప్పను. నేను మేడమ్ సెక్రటరీని, మీ నౌకర్ని కాదు. మీకు భయపడవలసిన అవ సరం నాకు లేదు!" నిప్పులు కక్కుతున్న అతన్ని చూసి అంతా భయపడ్డారు.

"ఇలా ఎందుకు చేస్తోందని మాకంతా అయో మయంగా ఉంది!" తల్లి నెమ్మదిగా గొణిగింది.

"అయితే వినండి. మేడమ్‌కి మీరంటే అసహ్యం వేసింది. మిమ్మల్ని చూస్తుంటే ఆవిడకి విసుగొస్తోందని అన్నారు. అయ్యా.. మీరు అన్న! కానీ ఏం చేశారు? అకౌంట్లు చూస్తున్నానంటూ ప్రతి కాంట్రాక్టులోను లక్షలు మీ పద్దులో వేసు కుంటున్నారు. ఇక ఈ తమ్ముడుగారు.. అక్క గార్ని ఒప్పిస్తానని, డేట్లు అరెంజ్ చేస్తానని కొత్త ప్రొడ్యూసర్ల దగ్గర భారీగా కమీషన్లు పుచ్చుకుం టున్నారు. ఇంక మీ సోదరీమణులు, వారి భర్తలు ఆవిడ తమకోసమే సంపాదిస్తున్నట్టుగా బ్యూటీ పార్లర్లు, గుర్రప్పందాలు, ఫ్యాషన్ షోల చుట్టూ తిరగటమే కార్యక్రమంగా పెట్టుకున్నారు. ఎంత కాలం మేడమ్ ఇవన్నీ భరిస్తూ, మిమ్మల్ని పోషించ గలరు? మీ లీలలన్నీ రూఢీగా తెలుసుకునే మేడమ్ ఇలాంటి నిర్ణయం తీసుకున్నారు. ఇక ముందు మీ ఆటలు సాగవని మీ బాధ" సంజీవి కోపంతో ఊగిపోయాడు.

"అయితే మమ్మల్నందర్నీ వెళ్ళగొట్టి ఏం చేస్తుందిట? ఒంటరిగా ఉంటుందా? ఇప్పుడు పెళ్ళి చేసుకోవాలన్నా ఏ తలకు మాసినవాడో దొరుకుతాడు గాని తనని కోరి ఎవడు చేసుకుం టాడు. హీరో రంజిత్‌తో నడిచిన వ్యవహారం అందరికీ తెలుసుగదా?"

"తండ్రి అయివుండీ మీరిలా మాట్లాడటం నాకు ఆశ్చర్యంగా ఉంది. హీరో రంజిత్‌గారికి

## ఇది విన్నారా?



★ వయోజన మానవుని వెన్నులో 26 ఎముకలుంటాయి.

★ మానవుని ముఖభాగంలో 14 ఎముకలుంటాయి.

★ ప్రపంచంలోనే ఎత్తైన కృష్ణుడి



గుడిగా 'బృందావన చంద్రోదయ మందిర్' రికార్డులకెక్కింది.

★ ఈ కృష్ణుని గుడి యు.పి.లోని బృందావన్‌లో ఉంది.

## ఇది విన్నారా?



★ జ్ఞాపకశక్తిని నియంత్రించే మెదడులోని భాగం 'మస్తిష్కం'.

★ ఇన్సులిన్ హార్మోన్‌ను స్రవించే గ్రంథి 'క్లోమం'.

★ థైరాయిడ్ (అవటు గ్రంథి)ని



ఆడమ్స్ ఆపిల్ గ్రంథి అని పిలుస్తారు.

★ రక్తంలో ఉండే పాస్ఫేట్ల స్థాయిని నియంత్రించే గ్రంథి థైరాయిడ్.

మేడమ్ అంటే ఎంత గౌరవమో, ఇష్టమో ఫీల్డ్‌లో అందరికీ తెలుసు. అలాంటి వారి మధ్య అబద్ధాలు కల్పించి ఒకరి మీద ఒకరికి ద్వేషం కల్పించింది మీరు కాదా? మేడమ్ పెళ్ళి చేసుకుంటే మీకు నష్టం. అందుకే పెళ్ళిదాకా వచ్చిన స్నేహాన్ని మీరంతా కలిసి చెడగొట్టారు. వాళ్ళిద్దరూ నిజం తెలుసుకునేసరికి రంజిత్‌గారి పెళ్ళయిపోయింది. మేడమ్ మీ ఉచ్చులో మిగిలిపోయారు" బాధగా అన్నాడు.

"మా సంగతి తెలిశాక పోనీ వాడిదగ్గరకే పోవచ్చుగా!" అన్న విషం కక్కాడు.

"అంతా మీలాంటి వారే ఉంటారా? గాంధీ నగరం నాలుగో వీధి సంగతి కూడా మేడమ్‌కి తెలుసు!" వ్యంగ్యంగా జవాబిచ్చాడు.

"ఏముంది అక్కడ?" అతడి భార్య ప్రశ్నించింది.

"ఏం లేదు. నువ్వు నోర్మూసుకో!" అతడి దాష్టీకానికి సంజీవికి ఒళ్ళు మండింది.

"వెళ్ళి చూడండి. కొడుకులు లేరని మీరు బాధ పడుతుంటారు కదా! అక్కడ ఇద్దరు కొడుకులున్నారు. వాళ్ళ అమ్మ కూడా ఉంటుంది!"

"నువ్వు విషయాన్ని పక్కదారి పట్టించకు. భువన సంగతి మాకు తెలియాలి. ఉన్నదున్నట్టు చెప్పు" తండ్రి గద్దించాడు.

"మీకందరికీ ఏ లోటూ లేకుండా మేడమ్ ఏర్పాటు చేశారు. బాగుపడతారో పాడు చేసుకుంటారో మీ ఇష్టం. ఆమె విషయం మీకెందుకు? అయినా అడుతున్నారు గనుక చెప్తున్నాను.

మేడమ్ హీరోయిన్‌గానే రిటైరవాలనుకుంటున్నారు. మహా అయితే ఇంకొక రెండు మూడేళ్ళు ఫీల్డ్‌లో ఉండగలరని ఆమెకి తెలుసు. ఆ తరువాత బిజినెస్ చెయ్యాలని, ప్రశాంతంగానే జీవితం గడపాలని అనుకుంటున్నారు. ఇల్లు ఫ్లాట్స్‌కి ఇచ్చేశారు. ఈనెల ట్రిప్పులో ఎలాంటి బిజినెస్ చెయ్యగలరో వాటి మంచి చెడ్డల గురించి ఆలోచంచుకుంటానని, ఎక్కడ ఇల్లు తీసుకుని స్థిరపడాలో నిర్ణయించుకుంటానని నాతో చెప్పారు.

మరొక విషయం.. మీకు ముట్టవలసివన్నీ ఇస్తున్నాననీ, ఇంతకు మించి మీకు ఒక్క పైసా కూడా రాదని చెప్పి మీ సంతకాలు తీసుకున్నాకే ఈ పేపర్లు మీకిమ్మన్నారు. అంతేకాదు మేడమ్ పేరు వాడుకుని మీరు ఏ వ్యవహారాలు నడిపినా, అప్పులు చేసినా వాటితో మేడమ్‌కి ఏమీ సంబంధం ఉండబోదని పేపర్లో వేయించమని కూడా చెప్పారు"

గత్యంతరం లేక సంజీవి చెప్పిన షరతులన్నిటికీ ఒప్పుకుని సంతకాలు పెట్టి పేపర్లు తీసుకున్నారు. అన్నదమ్ములు సంజీవిని తిట్టుకుంటూనే ఉన్నారు.

అయినా కక్ష పట్టలేక భావన అన్న "ఇదంతా నీ ప్లాన్‌లా ఉంది. మీరిద్దరూ కుమ్మక్కయి మమ్మల్ని వెళ్ళగొడుతున్నారనిపిస్తోంది. భావన అందానికి ఆశపడుతున్నావేమో! మేకప్ తీసేస్తే అదీ అందరి ఆడవాళ్లలాంటిదే. నీకన్నా వయస్సులో పెద్దది కూడా!"

ఇంకా ఏదో అనబోతున్న అతడి మాటలు పూర్తి కాకుండానే, "అడ్డదిడ్డంగా మాట్లాడితే మక్కెలు విరగ్గొడతాను. షటప్... అండ్ గెటవుట్"

సంజీవి కోపానికి భయపడి అందరూ బయటకు పరుగెత్తారు.

'రాస్కెల్స్, ఆమెను పీల్చి పిప్పి చేస్తూ ఇంకా ఆమనే స్వార్థపరురాలంటున్నారు. ఇలాంటివన్నీ ఈ ఫీల్డ్‌లో మామూలుగా జరిగే కథలే. నావాళ్ళని, తల్లీ తోడూ అని చేరదీసిన వాళ్ళే స్వార్థపరులై కూర్చున్న కొమ్మనే నరకాలని ప్రయత్నిస్తారు.

కానీ భువన మేడమ్.. రంజిత్‌తో పెళ్ళి చెడిపోగానే మేలుకుంది. బయటివాళ్ళే కారణమని చెప్పినా, పేపర్లలో వచ్చినా ఆమె తన వాళ్ళని కూడా అనుమానించి వాళ్ళని గురించి ఆలోచించింది. నిజాలు తెలుసుకుంది. వాళ్ళ నిజస్వరూపాలు తెలిశాక ఎలాంటి సెంటిమెంట్లకి, భయాలకి లోనుకాకుండా మూడో కంటికి తెలియకుండా నిర్ణయాలు తీసుకుంది'

భువన ఒక వ్యాపారవేత్తని పెళ్ళి చేసుకోబోతోందనీ, అతడి సహాయంతో హోటల్ బిజినెస్ ప్రారంభించాలనుకుంటోందనీ, త్వరలోనే రిటైర్‌మెంట్‌ను ప్రకటించబోతోందనీ, రెండు వారాల అమెరికా పర్యటననుంచి వచ్చాక ముంబైలో పెళ్ళి చేసుకున్న తర్వాతే తిరిగి వచ్చి పెళ్ళిని గురించి ప్రకటిస్తుందనీ తనకు తెలిసిన వివరాలేవీ సంజీవి బయట పెట్టలేదు.

ఈ విషయాలు తెలిస్తే ఈ స్వార్థపరులు ఎలాగైనా పెళ్ళి చెడగొట్టే ప్రయత్నాలు చేస్తారు. లేదా భువన మేడమ్ తిరిగి వచ్చేవేళకి ఆమె మీద దుష్ప్రచారాలు చేసి పరువు తీస్తారు. ఇలాంటివారికి బెదిరింపే తగిన మందు.

'దండం దశ గుణం భవేత్' అనుకున్నాడు.



ఆటలు-పోటీలు

# 'ఆసియా' మహిళలదే..

| హాకీ ఆసియా ఛాంపియన్ భారత్ | మహిళల ప్రపంచకప్ టోర్నీకి అర్హత

-శ్రీకాంత్. టి

హాకీ కొత్త కోచ్ హరేంద్రసింగ్ పర్యవేక్షణలో భారత మహిళల జట్టు అద్భుత ఫలితం సాధించింది. 13 ఏళ్ల నిరీక్షణకు తెరదించుతూ రెండోసారి ఆసియా ఛాంపియన్‌గా నిలిచింది. ఇటీవలే పురుషుల జట్టు కూడా ఆసియా ఛాంపియన్‌గా అవతరించింది. జపాన్‌లోని కకమిగహరలో జరిగిన మహిళల టైటిల్ పోరులో రాణి రాంపాల్ నాయకత్వంలోని టీమ్ ఇండియా 'పెనాల్టీ షూటౌట్'లో 5-4తో చైనాపై విజయం సాధించింది. నిర్ణీత సమయం ముగిసే వరకూ రెండు జట్లు 1-1తో సమంగా నిలిచాయి. భారత్ తరఫున 25వ నిమిషంలో నవజ్యోత్ కౌర్ గోల్ చేయగా... చైనా జట్టుకు తియాన్ లియో గోల్ సాధించింది. స్కోరు సమం కావడంతో విజేతను నిర్ణయించేందుకు పెనాల్టీ షూటౌట్ అనివార్యమైంది. షూటౌట్‌లో చైనా క్రీడాకారిణులు కొట్టిన రెండు షాట్‌లను భారత గోల్‌కీపర్ సవిత అడ్డుకుని జట్టుకు విజయం ఖాయం చేసింది. అయితే ఈ టోర్నమెంట్‌లో భారత జట్టు ఒక్క మ్యాచ్‌లోనూ ఛాంపియన్ కావడం విశేషం. ఈ విజయంతో ఆసియా ఛాంపియన్ హోదాలో వచ్చే ఏడాది లండన్‌లో జరిగే ప్రపంచకప్‌కు నేరుగా అర్హత సాధించింది. అయితే ఫైనల్ చేరే క్రమంలో అజేయంగా నిలిచిన భారత్‌కు తుది పోరులో చైనా నుంచి గట్టి పోటీ ఎదురైంది. రెండో నిమిషంలోనే చైనాకు పెనాల్టీ కార్నర్ వచ్చింది. అయితే గోల్‌కీపర్ సవిత దానిని అడ్డుకోగా... తిరిగి వచ్చిన బంతిని దీప్ గ్రేస్ ఎక్కా బయటకు పంపించింది. ఆ తర్వాత నవనీత్ కౌర్, వందన కటారియా చక్కని సమన్వయంతో ప్రత్యర్థి గోల్‌పోస్ట్‌లోనికి చొచ్చుకు వెళ్లారు. కానీ చైనా క్రీడాకారిణులను బోల్తా కొట్టించలేకపోయారు. తొలి క్వార్టర్ చివరి క్షణాల్లో చైనాకు రెండో పెనాల్టీ కార్నర్ వచ్చింది. దీనిని సవిత నిర్వీర్యం చేసింది. దీంతో తొలిక్వార్టర్‌లో రెండు జట్లు గోల్ చేయలేకపోయాయి. ఇక రెండో క్వార్టర్‌లో భారత్ ఊపందుకుంది. 17వ నిమిషంలో నవజ్యోత్ డైవ్ చేస్తూ కొట్టిన షాట్... కెప్టెన్ రాణి రాంపాల్ షాట్‌లు లక్ష్యానికి దూరంగా వెళ్లాయి. ఎనిమిది నిమిషాల తర్వాత రాణి అందించిన పాస్‌ను నవజ్యోత్ గోల్‌గా మలచడంతో భారత్ 1-0తో ఆధిక్యంలోకి వెళ్లింది. మూడో క్వార్టర్‌లోనూ భారత్ ఆధిక్యంలో ఉండగా.. చివరి క్వార్టర్ 47వ నిమిషంలో చైనా గోల్ సాధించి స్కోరును సమం చేసింది. ఆ తర్వాతి 13 నిమిషాల్లో రెండు జట్లు మరో గోల్ చేసేందుకు విశ్వప్రయత్నం చేసినా సఫలం కాలేకపోయాయి. దీంతో పెనాల్టీ షూటౌట్ అనివార్యం అయింది. దీంట్లో భారత్ 5-4తో చైనాను ఓడించి ఆసియా ఛాంపియన్‌గా నిలిచింది. కాగా.. కాంస్యపతకం కోసం జరిగిన మ్యాచ్‌లో దక్షిణ కొరియా 1-0తో జపాన్‌పై విజయం సాధించింది.

# ఎఫ్1 విశ్వవిజేత హామిల్టన్




ఈ ఏడాది ఫార్ములావన్ డ్రైవర్స్ ఛాంపియన్‌షిప్‌లో మెర్సిడెస్ జట్టుకు చెందిన బ్రిటిష్ డ్రైవర్ లూయిస్ హామిల్టన్ విశ్వవిజేతగా నిలిచాడు. దీంతో ప్రపంచ ఫార్ములావన్ టైటిల్‌ను హామిల్టన్ నాల్గోసారి సాధించాడు. కాగా.. మెక్సికో ఫార్ములా వన్ రేసులో హామిల్టన్ తొమ్మిదోస్థానంతో సరిపెట్టుకున్నాడు. దీంతో ఓవరాల్‌గా హామిల్టన్ ఖాతాలో 333 పాయింట్లు చేరాయి. తద్వారా వరల్డ్ ఛాంపియన్‌గా మరోసారి అవతరించాడు. 2008లో మెక్‌లారెన్ తరపున విశ్వవిజేతగా దిగిన హామిల్టన్ డ్రైవర్స్ ఛాంపియన్‌లో విజేతగా నిలవగా, 2014-15ల్లో మెర్సిడెస్ జట్టు తరపున విశ్వవిజేతగా నిలిచాడు. గత ఏడాది నికోరోస్ బర్గ్ విజేతగా నిలవగా, హామిల్టన్ రెండోస్థానంతో సరిపెట్టుకున్నాడు. మెక్సికో రేసులో ఫెరారీ డ్రైవర్ సెబాస్టియన్ వెటెల్ నాల్గోస్థానంలో నిలవడంతో హామిల్టన్ ఛాంపియన్‌గా నిలవడానికి దోహదం చేసింది.

# శివ్‌కపూర్‌కు ఆసియా టూర్ టైటిల్




భారత స్టార్ గోల్ఫర్ శివ్‌కపూర్ స్వదేశంలో తొలి ఆసియా టైటిల్‌ను గెల్చుకున్నాడు. ఢిల్లీ గోల్ఫ్ కల్బ్‌లో ముగిసిన పానాసోనిక్ ఓపెన్ టోర్నీలో అతను విజేతగా నిలిచాడు. ఫోర్ అండ్ 48 స్కోరుతో శివ్‌కపూర్ అగ్రస్థానంలో నిలిచాడు. ఈ ఏడాది శివ్‌కపూర్‌కిది రెండో ఆసియా టూర్ టైటిల్ కాగా కెరీర్‌లో మూడోది. గత ఏప్రిల్‌లో అతను యెంగ్డెర్ హెరిటేజ్ ఓపెన్‌లో ఛాంపియన్‌గా నిలిచాడు. 2005లో శివ్‌కపూర్ తొలిసారి వోల్వో మాస్టర్స్ ఆసియా టూర్ టైటిల్ గెలిచాడు.

# కృష్ణకణం

గొర్లి శ్రీనివాసరావు | gangasreenivas.gorli@gmail.com

**జరిగిన కథ 20**

వాషింగ్టన్ నగరానికి దగ్గరలో వున్న అగ్నిపర్వతం నుంచి ఉత్పాతం కలుగబోతోందనే వార్త చాలా తక్కువ సమయంలో తెలియడంతో ప్రజలన్ని సురక్షిత ప్రదేశాలకు హుటాహుటిన తరలించే ఏర్పాటు చేస్తాడు దేశాధ్యక్షుడు. భారతదేశంలోని కేదార్‌నాథ్ పరిసరాల్లోని హిమనది ముక్కలు కావడాన్ని ఉపగ్రహాల సాయంతో చూసిన ప్రధానమంత్రి ఆందోళనకు గురవుతారు. దాడిలో గాయపడిన ముగ్గురు ఫారినర్స్ పేర్లు పోలీసు అధికారి ద్వారా విన్న అంకిత్ విస్తుబోతాడు. బ్లాక్‌లేడీలు అనిపించే రోబోలేనని ఒక అంచనాకి వస్తారు కపర్ది బృందం. అడిగినవి సమకూరిస్తే బ్యాంక్ అఫీషియల్స్, కస్టమర్‌లను విడిచిపెట్టేస్తామని అఖ్తర్‌కి మాట ఇస్తాడు ఆలీ. వై చానల్ ఆఫీసుకి చేరిన దేవయాని, అంకిత్‌లకు గ్రిప్ మళ్ళీ అమెరికాలో దాడి చేసి విధ్వంసం సృష్టించిన సంగతి తెలుస్తుంది. గ్రిప్ స్థావరంపై దాడికి ప్రతిదాడి జరగడంతో విస్తుబోయిన కపర్ది బృందం ఎలా స్పందించాలో ఆలోచిస్తారు. బిల్ ల్యాబ్‌లోని టేబుల్ మీద పడుకునివున్న అమ్మాయి క్రమంగా నేరేడు రంగులోకి మారిపోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది అంకిత్‌కి. గ్రిప్ హెడ్‌క్వార్టర్స్ భూమ్మీద లేదని, అంతరిక్షంలో ఎక్కడో వుందని అంచనాకి వస్తాడు కపర్ది. అంకిత్ అదృశ్యం వెనుక కారణం ఏమై వుంటుందా అని ఆలోచిస్తుంది దేవయాని. భూగృహానికి చేరేందుకు ప్రయత్నిస్తున్న డార్క్‌లేడీ అడ్డుకున్న వ్యక్తి ఎవరో దైవశక్తి గల వాడై వుంటాడని అంచనా వేస్తాడు కపర్ది.

నారాయణ ఆశ్రమం దగ్గర జరిగిన పొరపాటు వలన, అంకిత్ చాలా జాగ్రత్తగా ఉన్నాడు. కాళరాత్రికి కొంచెం అవకాశం కూడా ఇవ్వకుండా ఆమె ఎంత శక్తిని ఉపయోగిస్తుందో దానికి తగ్గ ప్రతిశక్తిని మాత్రమే వాడుతూ, ఆమెను నిలువరిస్తున్నాడు. సమయం తనకు అడ్వాంటేజి ఇస్తుందని అంకిత్‌కి తెలుసు. ఆమెతో తను నడుపుతున్న సమరాన్ని, ఒక చదరంగం ఆటలా తీసుకున్నాడు అతను. ఇద్దరు వరల్డ్ చెస్ ఛాంపియన్లు తలపడేటప్పుడు ఎవరు గెలుస్తారో చెప్పడం కష్టం, కానీ గెలుపు కోసం విజయం వరించే అవకాశాలు కూడా ఎక్కువే.

అందుకే! గెలుపుకోసంకాక, కాళరాత్రిని నిలువరించడమే తన ముఖ్యోద్దేశంగా పెట్టుకున్నాడు అంకిత్. కాళరాత్రి కూడా అది ఒక క్రీడలాగానే చూస్తోంది. ఆమెకు అంకిత్‌పై మొదట్లో ఉన్న తొలి స్పర్శ, తొలి దర్శనం గుర్తుకి వచ్చాయి. అందువలన అతనిపైన లేనిపోని శత్రుభావం లేకుండా, తనకు సమవుజ్జీ దొరికాడన్న ఆనందంతో ఆ సమరక్రీడను కొనసాగిస్తోంది.



దేవయాని-కిశోర్‌లను కిడ్నాప్ చేయించమని నాయక్‌కి ఆదేశాలు జారీ చేసాడు పార్కర్. అంకిత్‌కి, దేవయాని అంటే సాఫ్ట్‌కార్నర్ వుంది అని తెలిసిన తర్వాత, ఆ స్ట్రాటజీ ఎంచుకున్నాడు పార్కర్.

కపర్దిని నిర్మూలించడంకంటే, తమ స్థావరాన్ని సంరక్షించుకోవడం కంటే, అంకిత్‌ని నిర్మూలించడం పైనే ఎక్కువ దృష్టిపెట్టాడు పార్కర్.

అతని ఆదేశాలను తు.చ. తప్పకుండా పాటించాడు నాయక్. వెంటనే తనకు నమ్మకమైన అలెక్స్‌ని పంపించాడు వై ఛానెల్ ఆఫీసుకి వెళ్ళి, దేవయానిని, కిశోర్‌ని కిడ్నాప్ చేసుకుని రమ్మని. అడ్డువచ్చిన ఎవరి ప్రాణాలు తీయడానికీ వెనుకాడవద్దు అని మరీ చెప్పాడు.

అలెక్స్ అదృష్టమో, ఎమ్‌డి అదృష్టమో, దేవయాని-కిశోర్‌ల కిడ్నాప్ చాలా సింపుల్‌గా జరిగింది. ఆ సమయంలో ఎమ్‌డి ఆఫీసులో లేడు.

అలెక్స్ సూటూ బూటు వేసుకుని, దర్జాగా వై ఛానెల్ ఆఫీసుకి వెళ్ళాడు. అక్కడ దేవయాని ఎవరు? ఎక్కడవుంది అని అడిగాడు. దేవయానిని చూపించిన వారికి థాంక్స్ చెప్పి, ఆమె దగ్గరకు వెళ్ళి, "మీకు అంకిత్ తెలుసా" అని అడిగాడు. పార్కర్ చెప్పిన వివరాలను నాయక్ ద్వారా తెలుసుకున్న అలెక్స్, తన కిడ్నాప్ పథకాన్ని అలా సింపుల్‌గా రచించుకున్నాడు.

"తెలుసు" అంది దేవయాని.

"మరి కిశోర్ అంటే ఇతనేనా?" అన్నాడు అలెక్స్.

"అవును. ఎందుకు" అంది దేవయాని.

"మీరిద్దరూ మాతోవస్తే, అంకిత్‌ని సేవ్ చేయెుచ్చు. లేదంటే అతను ప్రాణాలతో ఉండడం కష్టం" అన్నాడు అలెక్స్.

"ఏమయింది అంకిత్‌కి" అంది దేవయాని ఆదుర్దాగా.

"ఏమీ కాలేదు. కానీ మీరు రాకపోతే ఏమైనా జర

గొచ్చు" అన్నాడు అలెక్స్.

"పద" అంది దేవయాని లేచి నిలబడుతూ.

"మేడమ్, వీళ్ళెవరో తెలియకుండా?" అన్నాడు కిశోర్.

"అంకిత్ క్షేమంగా ఉండడం కోసం, ఎంత రిస్క్ అయినా ఓకే నాకు" అంది దేవయాని.

"సరే పదండి" అన్నాడు కిశోర్.

వాళ్ళిద్దరినీ వెంటబెట్టుకుని, తమ వాన్‌లో తీసుకెళ్ళిపోయారు అలెక్స్ అండ్ కో. అక్కడనుంచి ఒక ఛార్టర్డ్ ఏరోప్లేన్‌లో నాయక్ ఉండే భూగర్భస్థావరం దగ్గరకు వాళ్ళను వెంటబెట్టుకుని వెళ్ళారు. వారి సెటప్ చూసి, దేవయాని-కిశోర్‌లు ఆశ్చర్యపోయారు.

"అంకిత్ ఎక్కడ?" అన్న దేవయాని ప్రశ్నకు,

"లోపల ఉన్నాడు" అని సమాధానం ఇచ్చాడు అలెక్స్.

అలెక్స్ చేసిన స్మూత్ ఆపరేషన్ చూసి, నాయక్ సంతోషించాడు. దేవయాని-కిశోర్‌లను తమ స్థావరానికి తెచ్చిన విషయం, బిల్ సమక్షంలో పార్కర్‌కి, అతని సహనాయకులకు తెలియజేసాడు.

బిల్‌ని చూసి ఆశ్చర్యపోయారు దేవయాని-కిశోర్‌లు.



తమలోతాము మాట్లాడుకుంటూ, అతనే దార్క్ లేడీ చేతిలో హతం అయిన అంకిత్ ఫ్రెండ్ అన్న విషయం గుర్తుకి తెచ్చుకున్నారు.

"ఏమిటి మీ గుసగుసలు" అని గద్దించిన బిల్‌కి, అసలు విషయం చెప్పాడు కిశోర్.

"అంకిత్, నువ్వు చనిపోయినందుకు వీళ్ళ పైన ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నాడు" అని చెప్పాడు కిశోర్.

గట్టిగా నవ్వి "మూర్ఖుడు" అన్నాడు బిల్.

పార్కర్ పథకం ప్రకారం, దేవయాని తమ చేతికి చిక్కింది అనుకున్న తర్వాత అంతరిక్షంలో ఉన్న పార్కర్, అతని సహనాయకులు అంతా సంతోషంగానే ఉన్నారు ఒకరు తప్ప!

అతని సహనాయకులలో రైదాన్, అతనికి మాత్రం పార్కర్ అమలుచేస్తున్న విధానం సరైన వ్యూహంగా అనిపించలేదు. అందుకే తన పరిధిలో, తనకు చేతనైనది చేస్తూ ఉన్నాడు. ఒక ప్లాన్‌ఫెయిల్ అయితే, మరొక ప్లాన్ సిద్ధంగా ఉంచుకోవడం అనేది మిలిటరీ వ్యూహాలలో మొట్ట మొదటిది. అందుకే రైదాన్ కూడా ప్లాన్ బి ఒకటి సిద్ధంచేయడానికి అవకాశాలను పరిశీలించసాగాడు.

అప్పుడు అతని దృష్టి, అంతరిక్షంలో సూర్యుని చుట్టూ తమదైన కక్ష్యలో తిరుగుతున్న ఆస్టరాయిడ్స్ అనే వాటిపై పడింది. ఆ ఆస్టరాయిడ్స్ గురించి ఖగోళ శాస్త్రజ్ఞులకు రకరకాల అభిప్రాయాలు ఉన్నాయి. అందులో ముఖ్యమైనది, అవి ఒక గ్రహం యొక్క శకలాలు అయి ఉంటాయి అనేది. అవి చాలా భారీగా ఉంటాయి. వాటిలో ఒక దాన్ని ప్రేరేపించి, దాని కక్ష్యనుంచి దాన్ని తప్పించి, భూమివైపు ఆకర్షింపబడేలా చేసి, భూమిపై తాము కోరుకున్నచోట ఆ ఆస్టరాయిడ్ ఢీ కొనేలా చేస్తే, ఆ తాకిడికి అక్కడి ప్రాంతమంతా సర్వనాశనం అయిపోతుంది.

అయితే, ఒక ఆస్టరాయిడ్‌ని భూమివైపుపంపించేలా చేయడానికి ఒక పద్ధతిని అమలుచేయాల్సి ఉంటుంది. దానికి తగ్గ శక్తిసామర్థ్యాలు గ్రిప్ దగ్గర ఉన్న టెక్నాలజీకి ఉంది. ఆ టెక్నాలజీని తయారుచేయడానికి కాలకేయని యొక్క తెలివితేటల పూర్తి సహకారం ఉంది మరి.

★ ★ ★

అంకిత్‌తో, కాలకేయని సమరక్రీడ కొనసాగిస్తుండగా, గ్రిప్ ఇచ్చిన గడువు సమయం పూర్తి కావడానికి ఒక గంట మాత్రమే మిగిలివుంది. పార్కర్, అతని సహనాయకులు పరిస్థితిని ఎప్పటికప్పుడు మథింపు వేస్తున్నారు. ప్రపంచ దేశాలలో తొంభై శాతం దేశాలలో గ్రిప్ జెండా ఎగురుతోంది. గ్రిప్ మార్కు బలవంతుల రాజ్యం మొదలయిపోయింది. బలహీనులను దోచుకోవడం, హింసించడం విచ్చలవిడిగా కొనసాగుతున్నాయి. తొంభై శాతం దేశాలలో ఆరాచకాలు పేట్రేగిపోతున్నాయి.

"ఈ గంట గడువు అయ్యేలోపు, మనం ఈ మొండిదేశాలకు పాఠం చెప్పాలి. మన ఆయుధాలను ఆ మొండి దేశాలపైన గురిపెట్టించండి" అంటూ ఆదేశించాడు పార్కర్.

అతని ఆదేశాలకు కంట్రోల్ రూమ్‌లో ఉన్న కంప్యూటర్లు స్పందించాయి. కాని, వాటికి రావాల్సిన స్పందన కమ్యూనికేషన్ శాటిలైట్ల నుంచి రాలేదు. అలా ఎందుకు ఆ శాటిలైట్లు విఫలమయ్యాయో విశ్లేషించిన కంప్యూటర్లు, ఆ వివరాలను స్క్రీన్ పైన ప్రతిఫలించాయి.

"పార్కర్! మన కంప్యూటర్ల ఆదేశాలకు శాటిలైట్లు స్పందించడం లేదు. వాటి మధ్య ఏదో కమ్యూనికేషన్ గాప్ వచ్చింది" అన్నాడు ఇస్మాయిల్.

"ఆ శాటిలైట్ వ్యవస్థలు ఆఫ్ మోడ్‌లో ఉన్నాయి" అన్నాడు రైదాన్ స్క్రీన్ పైన కనబడుతున్న డాటాను పరిశీలనగా చూస్తూ.

"అయితే వాటిని ఆన్ చేయించు" అన్నాడు

## ఇది విన్నారా?



★ ఈగలు తమ బుల్లిరెక్కలు సెకనుకు 200సార్లు ఆడిస్తాయి. ఎంత వేగంగా ఆడించినా, గంటకు ఈగలు ప్రయాణించే దూరం 5 మైళ్ళు మాత్రమే!

★ ఈగ ఒక్కో కంటిలో 3000 నుంచి 6000 లెన్స్‌లు ఉంటాయట. అయినా, ఒకే వస్తువుపై ఎక్కువ సమయం దృష్టిపెట్టలేదు. అందుకే ఈగలు అక్కడా..ఇక్కడా.. వాలుతూ ఆహార అన్వేషణ చేస్తుంటాయి. ఈక్రమంలోనే వ్యాధుల్ని వ్యాపింపజేస్తాయి.

## ఇది విన్నారా?



★Bouton లేక bouter అనే ఫ్రెంచి పదాల నుంచి ఇంగ్లీషు Button అనే పదం పుట్టిందట.

★ గుండీలను కాంస్యయుగం నుంచి అలంకరణ వస్తువులుగా వాడుతున్నారు. గుండీలు 12వ శతాబ్దానికల్లా యూరప్‌లో వ్యాప్తిచెందాయి.

★ అందమైన బటన్ల తయారీ కోసం ఫ్రాన్స్‌లో 1250లో బటన్ మేకర్స్ గిల్డ్ ఏర్పడింది. ఆ పైన బంగారు గుండీలు, వజ్రాలగుండీలు, దారం గుండీలు, సెరామిక్ గుండీలు, ప్లాస్టిక్ గుండీలు వాడుకలోకి వచ్చాయి.

పార్కర్ విసుగ్గా.

"అన్ని శాటిలైట్స్ ఒక్కసారిగా ఆఫ్ మోడ్‌లో ఎందుకు ఉన్నాయో ఆలోచించాలి కదా" అన్నాడు రైడాన్.

"అవసరం లేదు. ప్రపంచదేశాలు చాలావరకు మనకు లొంగిపోయాయి. మన జెండాలు అక్కడ ఎగురుతున్నాయి. మిగిలిన ఈ కొద్ది దేశాలలో కూడా మన జెండా ఎగురవేసే సమయం వచ్చేసింది. ఇక ఆలస్యం చేయనవసరం లేదు. దేవయానిని స్పాట్‌కి పంపించమని చెప్పు" అన్నాడు పార్కర్.

"ఓకే పార్కర్" అంటూ గాంబా, పార్కర్ ఆదేశాలను నాయక్‌కు రిపీట్ చేసాడు.

రైడాన్ ఆ కమ్యూనికేషన్ శాటిలైట్స్ పనిచేసేలా చేయడానికి ప్రయత్నించమని, తమ కంప్యూటర్లకు ఆదేశాలిచ్చాడు. వెంటనే అవి ఆ పనికి పూనుకున్నాయి.

ఊహించినట్టే గ్రిప్ టీమ్ ఆ ప్రయత్నాలు మొదలుపెట్టి, కపర్ది పన్నిన ఉచ్చులోకి నడిచారు.

గ్రిప్ టీమ్ శాటిలైట్స్‌ని పనిచేయించడానికి ప్రయత్నాలు చేయడం గమనించారు వివిధ శాటిలైట్ కంట్రోల్ స్టేషన్స్‌లో ఉన్న సైంటిస్టులు, ఆ యా దేశాల నుంచి సతీష్‌కి సమాచారం వచ్చింది కోడెడ్ పద్ధతిలో.

"కపర్దీ! మనం ఊహించినట్టే జరిగింది. గ్రిప్ టీమ్ శాటిలైట్స్ పనిచేయించడానికి ప్రయత్నం చేస్తోంది. వాటి సోర్స్ ఎక్కడ ఉందో కనుక్కునే ప్రయత్నాలు చేస్తున్నాము" అన్నాడు సతీష్.

"శభాష్" అన్నాడు ఫారిన్ మినిస్టర్.

"వెరీగుడ్! అది ఎక్కడవుందో తెలిసిన వెంటనే, మనం ఎటాక్ చేయడానికి సిద్ధంగా ఉండాలి" అన్నాడు కపర్ది.

"అంతరిక్షంలో ఉన్నవాళ్ళపై ఎలా ఎటాక్ చేయిస్తావు కపర్దీ" అన్నాడు ఫారిన్ మినిస్టర్ ఆశ్చర్యంగా.

"సర్! చాలా సింపుల్. మనం రాకెట్ల ద్వారా శాటిలైట్స్‌ని కక్ష్యలలో ప్రవేశపెడుతున్నాము. ఈసారి ఆ శాటిలైట్‌లో పవర్‌ఫుల్ బాంబ్స్ ఉంటాయి. వాటిని మనం ఇక్కడ నుంచే డిటొనేట్ చేస్తాం. ఇంకేముంది! గ్రిప్ నాయకులతోపాటు, గ్రిప్ వాడుతున్న ఆ స్పేస్‌స్టేషన్ కూడా 'బూమ్' అంటుంది" అన్నాడు.

"ఇంప్రెసివ్" అన్నాడు ఫారిన్ మినిస్టర్ ఆనందాన్ని ప్రకటిస్తూ.

★ ★ ★



అంకిత్‌తో కాళరాత్రి సమరం జరుగుతున్న చోటు భయంకరంగా వుంది. వారు ఉన్న చోటికి కొన్ని కిలోమీటర్ల వ్యాసార్ధం వరకు ఉన్న ప్రాంతమంతా కారుచీకట్లు కమ్ముకుని ఉన్నాయి. ఉగ్రరూపంతో కాళరాత్రి, అంకిత్‌ని భయపెట్టాలని చూస్తోంది. ఉరుములు, మెరుపులతో శక్తితరంగాలను అంకిత్‌వైపు ప్రసరింప చేస్తూ, అతన్ని చికాకుపెట్టాలని యత్నిస్తోంది. అంకిత్, ఆమె చేష్టలకు ఏమీ తొణకకుండా, ఆమె శక్తికి ధీటుగా, తన సంకల్పంనుంచి తేజోమయంగా ఉండే కిరణాలను ప్రసరింపజేస్తున్నాడు. తెల్లటి వెలుగు, కటిక చీకటి ఒకదానితో ఒకటి పోటీపడుతున్నట్టుగా ఉన్నాయి అక్కడ.

అక్కడక్కడా పిడుగులు పడుతున్నాయి. మంటలు చెలరేగుతున్నాయి. ఘోరాతిఘోరంగా పోరాటం సాగుతోంది. అంకిత్‌కి తన శక్తులను వినియోగించడం మీద సంపూర్ణ ఆధిపత్యం లభించింది. దానితో అతను కాళరాత్రి మానసికస్థితిని కూడా ఎప్పటికప్పుడు తెలుసుకోగలుగుతున్నాడు. బాహ్యంగా ఎంత బీభత్సాన్ని సృష్టిస్తున్నా, అంతరాంతరాళలో, ఆమె పసిపాపలా ఆనందంలోనే లీనమైవుందని గమనించాడు.

★ ★ ★

గ్రిప్ కంట్రోల్ రూమ్‌లో అలర్ట్ సిగ్నల్స్ రావడం ప్రారంభించాయి. వాటిని పరిశీలించిన రైడాన్ అన్నాడు-

"పార్కర్! శాటిలైట్స్ పనిచేసేలా మనం పంపిన సందేశాలను ట్రేస్ చేసి, మనం ఎక్కడ ఉన్నామో కనుక్కోవడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. నా అనుమానం నిజమైతే, వారు మనపైన దాడికి సర్వం సిద్ధం చేసుకుని ఉంటారు" అన్నాడు.

"ఇప్పుడెలా?" అన్నాడు గాంబా. ఇస్మాయిల్ కూడా ప్రశ్నార్థకంగా చూసాడు పార్కర్ వైపు.

"వాళ్ళు మనలను దెబ్బతీసేవరకు వేచి ఉండకూడదు. మనమే మొదటి దెబ్బకొట్టాలి. వాళ్ళపైన ప్రకృతి బీభత్సాలను పంపుదాము" అన్నాడు పార్కర్.

"పార్కర్, అది వీలుపడదు. మనం ఉపయోగించే కమ్యూనికేషన్ శాటిలైట్స్ అన్నీ మూగపోయాయి. వాటి ద్వారానే మనం డివాస్టేషన్ రేస్ పంపించే వాళ్ళము" అని గుర్తుచేసాడు రైడాన్.

పార్కర్ ముఖం కందగడ్డలా అయింది.

"నాన్సెన్స్. వాళ్ళను ఊరికే వదలను. దేవయాని మన దగ్గర వుందని, అంకిత్‌కి తెలిసేలా చేయమని కాలకేయనికి మెసేజి పంపిస్తా" అన్నాడు పార్కర్.

"పార్కర్! మన దగ్గర ఒక ప్రత్యామ్నాయం ఉంది, దాన్ని ఉపయోగిద్దాము" అన్నాడు రైడాన్.

"ఏంటది?" అన్నాడు పార్కర్.

ఆస్టరాయిడ్‌ని ఉపయోగించి వారిపై ఎటాక్ చేసే ప్లాన్ బి గురించి వివరించాడు రైడాన్.

"వెరీ గుడ్ ఐడియా రైడాన్! ఎటాక్. ఆ పని చేయ్. నేను ఈ లోగా దేవయాని మెసేజి కూడా పంపిస్తాను. మనం రెండు రకాలుగాను ఎటాక్ చేయొచ్చు. ముందు మనం ఆస్టరాయిడ్‌ని భారతదేశం పైన గురిపెట్టాలి. వారిని సర్వనాశనం చేస్తేనే కానీ మనం ముందుకు సాగలేము" అన్నాడు పార్కర్.

"యస్ పార్కర్" అన్నాడు రైడాన్. అతని ముఖం ఆనందంతో వెలిగిపోయింది, పార్కర్ తన పథకాన్ని ఆమోదించినందుకు. వెంటనే ఆ ప్రయత్నాలు మొదలుపెట్టాడు. ఆస్టరాయిడ్స్‌లో బాగా భారీగా ఉన్న గ్రహశకలాన్ని ఎంచుకున్నాడు భారతదేశంపై గురిపెట్టేటందుకు.

పార్కర్ పంపిన మెసేజి కాళరాత్రి అందుకుంది. ఆ మెసేజితో దేవయాని పేరు మాత్రమే కాక, ఆమె ఫోటో, ఆమె ఇప్పుడు ఎక్కడ వుంది, ఆమె అంటే అంకిత్‌కి ప్రేమ అన్న వివరాలు అన్నీ ఆమెకు అందాయి.

ఒక పక్క అంకిత్‌తో పోరాడుతూనే, ఆమె ఈ సమాచారాన్ని పరిశీలించింది. ఆమె మనసు తొలిసారిగా కలవరానికి గురి అయింది. దేవయానిని తాను తాకిన విషయం కూడా గుర్తువచ్చింది. ఆమె మనసులో కొన్ని మానవ బలహీనతలు ప్రవేశించాయి. వాటి గురించి ఆమెకు ముందుగా ఏ విధమయిన అనుభవము లేకపోవడంతో, ఆ బలహీనతను ఆమె సరిగా అర్థంచేసుకోలేకపోయింది. అప్పుడు జరిగిన మానసిక సంఘర్షణలో, ఆమె బాగా కలవరపడింది. ఆమె ప్రశాంతమైన అంతరంగానికి ఆటంకం ఏర్పడింది, కల్లోలానికి గురి అయింది.

దానితో ఆమె కాన్షస్‌నెస్ రెండుగా విడిపో

## ఇది విన్నారా?



★ స్పెయిన్‌లో ఇది ఓ సుందర గ్రామం. పేరు 'క్యాజిల్ ఫోలిట్ డి, లా రోకా' ఫ్లూవియా, టొరోనెల్ అనే రెండు నదుల మధ్య సన్నటి కొండపై ఉందావూరు. కేవలం రెండు ఇళ్ళు మాత్రమే పట్టే వెడల్పు కలిగి కి.మీ.పొడవు ఉండే ఊరిది. స్పెయిన్‌లోని గ్రామాలల్లో అతి చిన్నది. ఇది బెసాల్ట్ రాక్ మీద ఒక అందమైన దృశ్యంలా కనువిందు చేస్తుంది.

★ నీటి కుంటలు, మురికినీరు ఆవాసంగా ఈగలు గుడ్లు పెడుతుంటాయి. పరిసరాలు పరిశుభ్రంగా ఉంచుకోగలిగితే, ఈగల స్వైరవిహానానికి చెక్ పెట్టొచ్చు.

యింది. ఒక భాగం పోరాటం చేస్తోంది, మరొక భాగంలో దేవయానిపైన అసూయ, అంకిత్‌ని తన వైపు తెచ్చుకోవాలనే తాపత్రయం ఎక్కువయ్యాయి.

ఆమె మనసులోకి చూస్తూ, ఆమెను పరిశీలిస్తున్న అంకిత్‌కి కూడా ఆమె ఆలోచనలు అందుతూ ఉన్నాయి. దేవయాని గురించి ఆలోచన అతనికి వచ్చినా, అది తాత్కాలికంగా మాత్రమే అతన్ని స్పృశించింది. అతను ఏమీ చలించలేదు. కానీ కాళరాత్రి కాన్షస్‌నెస్ స్ప్లిట్ అవడం కూడా అతను గమనించాడు. తనతో పోరాడుతున్న భాగాన్ని తను తేలికగా ఓడించగలడు, అన్న ఆలోచన వచ్చింది అంకిత్‌కి. అయినా అతను దానికి లొంగలేదు. తగినంత శక్తిని మాత్రమే ప్రసరింపచేస్తూ, ఆమెను అడ్డుకోవడంపైనే దృష్టి నిలిపాడు.

కాలకేయని, తన ఆదేశాలకు తాను కోరిన విధంగా స్పందించలేదని గమనించాడు పార్కర్.

దానితో అతనికి మొదటిసారిగా భయమేసింది. వెంటనే బిల్‌ని సంప్రదించాడు.

"బిల్! ఏమి జరుగుతోంది. కాలకేయని నా మాటలకు వెంటనే రెస్పాండ్ కావటం లేదు. ఇదివరకు ఎప్పుడూ ఇలా కాలేదు" అన్నాడు పార్కర్.

"పార్కర్! మీకు ఇదివరకు చెప్పాను. ఆమె పైన నేను ప్రొసీజర్ నడుపుతున్నప్పుడు ఆమెను డిస్టర్బ్ కావడం జరిగింది, దానితో ఆమె కాన్షస్‌నెస్ రెండుగా విడిపోయింది. మరోసారి అలా అయితే ఎలాంటి ఫలితాలు ఉంటాయో నాకు తెలియదని మీకు చెప్పాను. ఇప్పుడు మళ్ళీ ఆమెను డిస్టర్బ్ చేసినట్టున్నారు. ఆమె కాన్షస్‌నెస్ స్ప్లిట్ అయింది. ఇప్పుడు ఆమె ప్రవర్తన ఎలా ఉంటుందో మనం ఊహించలేము. మళ్ళీ మళ్ళీ ఆమెకు మెసేజి చేయకండి. అంకిత్ మైండ్‌ని యాక్సెస్ చేయడానికి నేను ప్రయత్నిస్తాను. ఒకవేళ అది సాధ్యపడితే అతన్ని డిస్టర్బ్ చేస్తాను" అన్నాడు బిల్.

తల పట్టుకున్నాడు పార్కర్.

"ఫరవాలేదు పార్కర్. ఆస్టరాయిడ్‌ని, కాలకేయని-అంకిత్ పోరాడుతున్న చోటికే గురిపెట్టాను. ఆ కేంద్రం నుంచి కొన్ని వందల కిలోమీటర్ల ప్రాంతం ఆస్టరాయిడ్ తాకిడి ఉంటుంది. దాని ప్రకంపనాలు ఆసియా మొత్తం ప్రతిధ్వనిస్తాయి. సర్వత్రా సర్వనాశనం. అంతా భస్మీపటలం అవుతుంది" అంటూ ధైర్యం చెప్పాడు రైడాన్.

"శభాష్ రైడాన్" అన్నాడు పార్కర్.

★ ★ ★

ఒక భారీ ఆస్టరాయిడ్ తన కక్ష్య నుంచి పక్కకు తప్పుకోవడాన్ని పసికట్టాయి వివిధ దేశాలలోని శాటిలైట్ కేంద్రాలు. వాటిలో భారత్ రోదసీ సంస్థ కూడా వుంది. ఆ ఆస్టరాయిడ్ అలా హఠాత్తుగా కక్ష్య నుంచి వేరుపడడానికి కారణం ఏమిటో వారికి అంతుపట్టలేదు. దాని భవిష్యత్తు ప్రయాణం ఎలా ఉంటుందో అంచనాలు కట్టడానికి ఆ రోదసీ సంస్థలోని సైంటిస్టులు పూనుకున్నారు.

కొద్దిసేపటిలోనే ఆ సైంటిస్టులకు అర్థమయింది, ఆ ఆస్టరాయిడ్ భూమివైపు వచ్చే ప్రమాదం ఉంది అని. సాధారణంగా వాటిపైన బయటినుంచి ఎటువంటి ప్రభావం ఉండే అవకాశం లేదు. కానీ ఆస్టరాయిడ్స్‌లోనే ఒకదానిని మరొకటి ఢీకొనడం సాధారణమే! అలా కొన్నిసార్లు వాటి కక్ష్యల నుంచి అవి తప్పుకుంటూ ఉంటాయి. కానీ మరీ ఎక్కువ తేడా రాదు, వాటి కొత్తకక్ష్యలో. అయితే ఇప్పుడు వచ్చిన మార్పు, బయట నుంచి ప్రేరేపించబడింది కనుక, సైంటిస్టులు ఊహించినదానికంటే అంతకంతకూ అది ప్రయాణించే మార్గం మార్పులు చెందసాగింది.

భూమిపై జరిగిన ప్రకృతి బీభత్సాల గురించి వారికి తెలుసు కాబట్టి, ఇది కూడా శత్రువుల జోక్యంతోనే జరుగుతున్న ఖగోళ బీభత్సంగా నిర్ధారణకువచ్చి, రోదసీ సంస్థల సైంటిస్టులు అలారమ్ మోగించారు. గ్రిప్ బారినపడకుండా మిగిలివున్న అన్ని దేశాలకు హెచ్చరికలు జారీ చేసారు. సమిష్టిగా ఆ ఆస్టరాయిడ్ ఎటు ప్రయాణిస్తున్నదో గమనిస్తూ, అది భూమిపై ఏ ప్రాంతంలో ఢీ కొనబోతోందో అంచనావేయడానికి పూనుకున్నారు.

ఆ ఆస్టరాయిడ్‌ని ఎదిరించడానికి ప్రాధాన్యత ఇవ్వాలా, లేక గ్రిప్ అంతరిక్ష స్థావరమైన స్పేస్ స్టేషన్ పైన దాడికి ప్రాముఖ్యత ఇవ్వాలా అన్న విషయంలో దేశాధినేతలు సమావేశమయ్యారు. తాత్కాలికంగా గ్రిప్ స్థావరం పై ఎటాక్‌ను ఆపి ఉంచారు. పార్కర్ అండ్ కో, ఈ పరిణామాలను గమనిస్తూ కాస్త ఆనందించారు. అయితే, కాలకేయని తన ఆదేశాన్ని ఎందుకు పాటించలేదు అనే ప్రశ్న, పార్కర్‌ని తొలుస్తూనే ఉంది.

**- ఇంకా వుంది**






# ఫిలోడెండ్రాన్










సకలాభక్తుల కృష్ణమూర్తి
రిటైర్డ్ రీడర్ (బాటనీ)
బెంగుళూరు,
ఫోన్: 094488 48529




హార్ట్ లీఫ్, సెల్లోవమ్, లేసీ ట్రీ ఫిలోడెండ్రాన్‌లాంటి కామన్ పేర్లున్న ఈ మొక్కలు సౌత్ అమెరికాలోని బ్రెజిల్, బొలీవియా.. ఇంకా ఆ చుట్టుపట్ల దేశాల్లోని సతత వర్షారణ్యాల్లో పుట్టి అన్ని దశాలకూ వ్యాపిస్తున్నాయి. వీటిలో కొన్ని రకాలనైనా మనలో ప్రతీ ఒక్కరూ చూసే ఉంటారు.. తమలపాకుల్లా, మనీప్లాంట్ ఆకుల్లా, రావి, కంద, బాణం ములికి షేప్‌లో ఉన్న పూర్తి ఆకుల వర్గం ఒకటైతే, రెండో రకంలో రకరకాల కత్తిరింపులున్న ఆకులున్నవి ఉన్నాయి.

రెండు వెరైటీల్లోనూ ఆకుల సైజుల్లో మూడంగుళాల నుండి అయిదడుగుల పొడవు వరకూ తేడాలున్నాయి. ఇవన్నీ మన కంద, చామదుంపల జాతికి చెందినవే. ఇవన్నీ ఒకే కుటుంబానికి చెందినా చామలా నిటారుగా పెరిగే ఆకుల రకమొకటైతే సపోర్ట్ పైకి ఎగబాకే తీగ రకం మరొకటి.

వీటన్నింటి పత్రాల ఆకారంలో వైవిధ్యం తోబాటు రంగుల్లో కూడా తేడా ఉంది.

## మన్ను

నీరు నిల్వ ఉండకూడదు కాబట్టి మన్ను, మంచి పశువుల ఎరువులను 2:1గా లేదా 1:1గా మిశ్రమంచేసి సిద్ధపరుచుకోవాలి. నేలలో నాటుకొని, చెట్లపైకి ప్రాకించాలనుకున్న ప్పుడు, ఒక చదరపు అడుగు గోయి తీసి, అందులోని మట్టిని రెండు భాగాలు చెయ్యాలి. ఒక భాగానికి సరిపడా పశువుల ఎరువును కలపాలి.



లేత, ఎరుపు రంగులవి కూడా ఉన్నాయి. ఈ రంగుల రకాలు బాణం ములికి ఆకారపు ఆకుల్లో చాలా పెద్దవిగా ఉండి మనల్ని విప రీతంగా ఆకర్షిస్తాయి. వీటిల్లో కొన్ని రకాలకు మొదట్లో దుంపలు లేకపోయినా కొన్నాళ్ళకు తయారవుతాయి. ఈ విభిన్న రకాల మొక్కలకు ప్రత్యేకించి తీసుకోవలసిన జాగ్ర త్తలు లేవు. అందువల్ల ఒకసారి ఒక మొక్కను కొంటే కనీసం యాభై సంవత్స రాలు బ్రతుకుతుంది.

ఈ హార్ట్‌లీఫ్ ప్లాంట్ రకాలన్నీ నీడలో పెరిగేవి. సూర్యరశ్మి వెలుతురు, వేడి వీటికి చాలు. కాకతాళీయంగా కొద్దిసేపు ఎండపడినా ఫర్వాలేదు. వీటిని నేల లోను, కుండీల్లోను నాటుకోవచ్చు. మనీప్లాంట్ (పోథస్) లాగా నీట్లోను కొన్ని రకాలు పెరగగలవు. అయితే కొన్ని వైరైటీలకు నీరు నిల్వ ఉంటే పనికిరాదు.

ఫిలోడెండ్రాన్‌లో ఎన్నో వైవిధ్యాలు న్నాయి. కాబట్టి మనింట్లో కూడా కొన్ని రకా లుంటే బాగుంటుందనిపిస్తుంది. ఎన్నో వైరైటీలు ఉండటం వల్లనే కాబోలు దీనికి రాయల్ హార్టికల్చ రల్ అవార్డ్ కూడా దక్కింది.



## నాటుకోవడం

దుంపతో ఉన్న మొక్క దొరికితే, కుండీ లోగాని, నేలలోగాని మూడంగుళాల లోతున నాటుకో వచ్చు. కాండపు తీగ దొరికితే కనీసం రెండు గుంపులు లేదా కణు పులు మన్ను లోపల ఉండేలా పాతు కుంటే, వాటి నుంచే వేళ్లొ స్తాయి.



## ఎరువులు

ఫిబ్రవరి, మే నెలల్లో వీటికి ఎన్.పి.కె.లాంటి ఏదైనా ఎరువుని మొక్క వయసునుబట్టి మొదటి సంవత్సరం నాలుగు టీస్పూన్లు, తరువాతి సంవత్సరం నుండి 5, 6 టీ స్పూన్ల చొప్పున నీట్లో కరిగించి పొయ్యటం గాని, మొక్క చుట్టూ చల్లటం గాని చెయ్యాలి.

## జాగ్రత్తలు, సూచనలు

తీగ రకాలకు మొదట్లో సపోర్ట్‌గా కర్రనుగాని మాస్ స్టిక్‌నిగాని పెట్టి కట్టాలి. చిగురుటాకులు వాడినట్టు కనిపిస్తే మట్టిలో కేల్షియమ్, మేగ్నీషియమ్ తగ్గాయని గుర్తించి, ఆ రెండూ ఉన్న అంటే మైక్రో న్యూట్రియంట్స్ ఉన్న రసాయనాన్ని తెచ్చి వెయ్యాలి. ఆకులు చిన్నవిగా వస్తున్నా, ఎదుగుదల లేకపోయినా పైన చెప్పినట్టు రసాయనిక ఎరువు వెయ్యాలి. క్రిందినుండి ఒకటి, రెండు ఆకులు పండిపోతే వాటిని తీసెయ్యాలి. ఆకులన్నీ ఒకేసారి పండుతున్నట్టనిపిస్తే నీరు నిల్వ ఉండిపోయిందని గుర్తించి, తగిన చర్య తీసుకోవాలి. ఆకుల అంచులు ఎండిపోతుంటే, నీరు చాలలేదని గ్రహించాలి. అడుగు రంధ్రాలద్వారా ఎక్కువైన నీరు బయటకు పోయేంత వరకు నీళ్ళు పొయ్యాలి. ఎండ ఎక్కువ సమయం పడితే కూడా ఇలా జరుగుతుంది.



## గాలిలో వేళ్లు

తీగ రకాలకు కాండంపైన వేళ్ళొస్తాయి. ఇవి మొక్కను ఆధారంపైన అతుక్కునేలా చేసి పైకి ఎగబ్రాకటానికి సహాయం చేస్తాయి.

## నీరు

కుండీల్లో నాటుకున్న వాటికి ప్రతిరోజు గాని రెండు రోజులకొకసారి గాని నీళ్ళు పోస్తుండాలి.






పూర్వం 'వసంతుడు' అనే ఒక జైన మతస్థుడు ఉండేవాడు. ఆయన వివిధ ప్రాంతాలలో పర్యటిస్తూ, జైనమత సిద్ధాంతాలను ప్రజలకు బోధిస్తూ ఉండేవాడు. వసంతుడు ఈ ప్రాంత సౌందర్యాన్ని, మాహాత్మ్యాన్ని చూసి సంతోషించి.. తాను ఆరాధనలు చేసుకునేందుకు అనువైన ప్రాంతంగా భావించాడు. జైన మతస్థుల సహకారంతో ఒక ప్రార్థనా మందిరాన్ని నిర్మించాడు. ఈ ప్రాంతంలోనే ఉంటూ నిత్యం ఆరాధనలు చేసుకుంటూ అందరికీ జైన సిద్ధాంతాలను బోధిస్తూ ఉండేవాడు. ఈవిధంగా కొంతకాలం గడిచింది. జైన మత ప్రభావం సన్నగిల్లింది. ఇలాంటి స్థితిలో హైందవ మత ఉద్ధరణకు పూనుకున్న పల్లవులు ఈ ప్రాంతానికి వచ్చిన సమయంలో ఈ నిర్మాణాన్ని గురించి తెలుసుకుని ఈ ఆలయంలో శ్రీ మహావిష్ణువును శ్రీ లక్ష్మీనారాయణ స్వామిగా ప్రతిష్ఠించి నిత్యం పూజలు జరిగే ఏర్పాట్లు చేసినట్లు స్థలపురాణం వెల్లడిస్తూ ఉంది.



ఐ.ఎల్.ఎన్. చంద్రశేఖర్

# అద్భుత ఆలయంలో అందాల దేవుడు
# 'జైనథ్' శ్రీ లక్ష్మీనారాయణుడు

దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించేందుకు.. చెడుని త్రుంచి మంచిని పెంచేందుకు త్రిమూర్తులలో స్థితికారుడైన శ్రీ మహావిష్ణువు అనేక అవతారాలను ధరించాడు. అలాంటి శ్రీ మహావిష్ణువు తాను మంచిని కాపాడేందుకే అవతరించాను.. మీరూ సన్మార్గంలో నడవండి అని హితబోధ చేసేందుకే నేల నలు చెరుగులా వివిధ రూపాలతో వివిధ పేర్లతో కొలువుదీరి ఉన్నాడు. అటువంటి శ్రీ మహావిష్ణువు శ్రీ లక్ష్మీ నారాయణస్వామి పేరుతో కొలువుదీరి.. దర్శించినంతనే సంతానం లేని వారికి సంతానం ప్రసాదించే సంతాన ప్రదాయకుడుగా.. అనుక్షణం తనను నమ్మి కొలిచిన భక్తులవెంట ఉండి కంటికి రెప్పలా కాపాడే దేవుడుగా పేరుపొంది ఆరాధనలందుకుంటూ ఉన్న ప్రాచీన మహిమాన్విత దివ్య ధామం-

అద్భుతమైన శిల్పకళతో భక్తులకు నయనానందాన్ని కలుగజేస్తూ ఉన్న క్షేత్రం..

'జైనథ్'

తెలంగాణ రాష్ట్రంలో ఆదిలాబాద్ పట్టణానికి సుమారు 21 కిలోమీటర్ల దూరంలో 'జైనథ్' క్షేత్రం ఉంది. పూర్వం జైనమతస్థులకు కేంద్రంగా ఉండి... వారి ప్రార్థనామందిరం ఉన్న ప్రాంతం కనుక ఈ క్షేత్రానికి 'జైనథ్' అనే పేరు ఏర్పడినట్లు స్థలపురాణం వెల్లడిస్తూ ఉంది.

స్థలపురాణం పరిశీలిస్తే - పూర్వం జైనమతం బాగా అమల్లోవున్న సమయంలో 'వసంతుడు' అనే ఒక జైనమతస్థుడు ఉండేవాడు. ఆయన వివిధ ప్రాంతాలలో పర్యటిస్తూ, జైనమత సిద్ధాంతాలను ప్రజలకు బోధిస్తూ ఉండేవాడు. ఈవిధంగా వివిధ ప్రాంతాలలో పర్యటిస్తూ జైనథ్ ప్రాంతానికి చేరుకున్న వసంతుడు ఈ ప్రాంత సౌందర్యాన్ని, మాహాత్మ్యాన్ని చూసి సంతోషించి.. తాను ఆరాధనలు చేసుకునేందుకు అనువైన ప్రాంతంగా భావించాడు. జైన మతస్థుల సహకారంతో ఒక ప్రార్థనా మందిరాన్ని నిర్మించాడు. ఈ ప్రాంతంలోనే ఉంటూ నిత్యం ఆరాధనలు చేసుకుంటూ అందరికీ జైన సిద్ధాంతాలను బోధిస్తూ ఉండేవాడు. ఈవిధంగా కొంతకాలం గడిచింది. జైనమత ప్రభావం సన్నగిల్లింది. ప్రజల్లో ఆదరణ తగ్గింది. ఇలాంటి స్థితిలో హైందవ మత ఉద్ధరణకు పూనుకున్న పల్లవులు ఈ ప్రాంతానికి వచ్చిన సమయంలో ఈ నిర్మాణాన్ని గురించి తెలుసుకుని ఈ ఆలయంలో శ్రీ మహావిష్ణువును శ్రీ లక్ష్మీనారాయణ స్వామిగా ప్రతిష్ఠించి నిత్యం పూజలు జరిగే ఏర్పాట్లు చేసినట్లు స్థలపురాణం వెల్లడిస్తూ ఉంది. అప్పటినుంచి జైనథ్ ఆలయం శ్రీ లక్ష్మీనారాయణ స్వామి ఆలయంగా అసంఖ్యాక భక్తుల ఆరాధనలు అందుకుంటూ ఉంది.



మూలవిరాట్టు

జైనథ్ గ్రామంలో శిల్పకళా నైపుణ్యం లో.. భక్తులకు నయనానందాన్ని కలగజేస్తూ శ్రీ లక్ష్మీనారాయణ స్వామి వారి ఆలయం దర్శనమిస్తుంది. ఆలయం ఎత్తయిన వేదికపై నిర్మితమై ఉంది. అష్టకోణ ఆకృతిలో ఆలయం నిర్మింపబడి ఉంది. ఉత్తర భారత దేశ నిర్మాణశైలిలో దర్శనమిచ్చే ఈ ఆలయ

గర్భాలయంపై గోపురం దర్శనమిస్తుంది. ఆలయానికి ఎదురుగా భూమట్టంలోనే బలిపీఠం, ధ్వజస్తంభం ఉన్నాయి. ముందుగా భక్తులు ఆలయానికి చేరుకుని ధ్వజస్తంభానికి ప్రదక్షిణలు చేసి నమస్కరించుకుని తర్వాత ప్రధాన ఆలయానికి చేరుకుంటారు. ప్రధాన ఆలయం వేదికపైన ఉంది. ప్రధాన ఆలయం ముఖమండపం, అంతరాలయం, గర్భాలయాలను కలిగి ఉంది. ముఖమండపంలోని స్తంభాలు, ఆలయం వెలుపలి గోడలపై అద్భుతమైన శిల్పకళ దర్శనమిస్తుంది. సూక్ష్మ శిల్పాకృతులు భక్తులకు కన్నులపండువ చేస్తాయి. ముఖమండపం నుంచి అంతరాలయానికి వెళ్ళే ద్వారానికి ఇరువైపులా జయవిజయులు ద్వారపాలకులుగా కొలువుదీరి నిత్యం స్వామివారిని సేవిస్తూ దర్శనమిస్తారు. ప్రధాన గర్భాలయంలో శ్రీ లక్ష్మీనారాయణ స్వామి వారు స్థానక భంగిమలో నిలబడి అందమైన రూపంతో దర్శనమిస్తాడు. స్వామివారు చతుర్భుజుడు. శంఖు, చక్ర, గద, వరద ముద్రలను తన నాలుగు చేతులలో ధరించి స్వామివారు కొలువుదీరి ఉన్నారు. మామూలుగా శ్రీ మహావిష్ణువు కుడిచేతిలో చక్రం, ఎడమ చేతిలో శంఖు ధరించి ఉంటాడు. అయితే అందుకు భిన్నంగా ఈ ఆలయంలో స్వామివారు కుడి చేతిలో శంఖు, ఎడమ చేతిలో సుదర్శన చక్రం ధరించి ఉండడం విశేషం. గర్భాలయంలో స్వామివారితోపాటు ఉత్సవ మూర్తులను దర్శించుకోవచ్చు. గర్భాలయంలోనే స్వామివారికి ఎడమవైపున వైష్ణవ ఆళ్వారులు కొలువుదీరి ఉన్నారు. ముఖమండపంలోని ద్వారం వద్ద శ్రీ ఆంజనేయ స్వామి ముకుళిత హస్తాలతో సిందూర వర్ణంలో కొలువుదీరి ఉన్నాడు. ముఖమండపంలోని ఈశాన్య భాగంలో శ్రీ మహావిష్ణువు శేషతల్పంపై శయనించి శ్రీ అనంతపద్మనాభస్వామిగా కొలువుదీరి పూజలందుకుంటూ ఉన్నాడు. ముఖమండపంలోని ఆగ్నేయంలో శ్రీ హయగ్రీవుడు దర్శనమిస్తాడు. కాగా, ఈ స్వామివారిని గురించి భక్తుల్లో అనేక నమ్మకాలు ఉన్నాయి. ప్రధానంగా సంతానం లేనివారు ఈ క్షేత్రంలోని శ్రీ లక్ష్మీనారాయణ స్వామిని దర్శించి అర్చనలు చేస్తే సంతానం కలుగుతుందని భక్తుల్లో ప్రగాఢ విశ్వాసం ఉంది. ఈ ప్రాంతంలోని అనేక మందికి స్వామివారి పేరు ఉండడాన్ని అందుకు నిదర్శనంగా స్థానికులు పేర్కొంటారు. ఆలయం ప్రాంగణం వెలుపల రావిచెట్టు క్రింద శ్రీ వినాయకుడు. శ్రీ సుబ్రహ్మణ్య స్వామివారలను, ఆలయ సమీపంలో చిన్న శివాలయాన్ని భక్తులు దర్శించుకోవచ్చు.


ఆలయం


ముఖమండపం


అనంతపద్మనాభస్వామి

చారిత్రకంగా పరిశీలిస్తే - క్రీ.శ. 10వ శతాబ్దం ప్రాంతంలో జైనవసతుడు ప్రార్థనా మందిరాన్ని నిర్మించి ఉండవచ్చునని చరిత్రకారుల అంచనా. తర్వాత క్రీ.శ. 12వ శతాబ్దంలో పల్లవ చక్రవర్తులు ఆలయాన్ని అభివృద్ధి చేసి స్వామివారిని ప్రతిష్ఠించి నిత్య పూజలు జరిగే ఏర్పాట్లు చేసినట్లు కథనం. కాగా సంవత్సరానికి రెండుసార్లు సూర్యకిణాలు గర్భాలయంలోని స్వామివారి పాదాలపై ప్రసరించేటట్లు ఆలయాన్ని నిర్మింపజేయడం విశేషం. ఆశ్వీయుజ మాసంలో కుంభసంక్రమణం నాడు, ఏప్రిల్ నెలలోనూ సూర్యకిరణాలు గర్భాలయంలోని స్వామివారిపై పడతాయి.

ప్రతిరోజూ పూజలు జరిగే జైనథ్ శ్రీ లక్ష్మీ నారాయణస్వామి వారి వార్షిక బ్రహ్మోత్సవాలు ప్రతి సంవత్సరం కార్తీకమాసంలో శుక్లపక్ష ఏకాదశి మొదలు తొమ్మిదిరోజులపాటు కన్నుల పండువగా జరుగుతాయి. వివిధ వాహన సేవలు, రథోత్సవాలు జరుగుతాయి. రథోత్సవంలో కేవలం తెలుగువారే కాకుండా కర్నాటక, మహారాష్ట్ర రాష్ట్రాలకు చెందిన భక్తులు వేలాదిమంది పాల్గొని స్వామివారిని సేవించుకుంటారు. వైకుంఠ ఏకాదశి, ధనుర్మాసం, శ్రావణమాసంలతోపాటూ వివిధ పండుగలు, పర్వదినాల సందర్భంగా జైనథ్ క్షేత్రంలో విశేష పూజలకు నిర్వహిస్తారు.

జైనథ్ క్షేత్రంలో భక్తులకు వసతి సౌకర్యాలు లభించవు. ఆదిలాబాద్ నుంచి వచ్చి దర్శించుకుని తిరిగి చేరుకోవడం మంచిది. ఆదిలాబాద్ నుంచి 21, హైదరాబాద్ నుంచి 320 కిలోమీటర్ల దూరంలో ఉన్న జైనథ్ క్షేత్రానికి ఆదిలాబాద్ నుంచి విరివిగా బస్సు సౌకర్యాలు ఉన్నాయి.

అద్భుత ఆలయంలో అందాలదేవుడుగా ప్రసిద్ధి చెందిన జైనథ్ శ్రీ లక్ష్మీ నారాయణ స్వామి వారిని దర్శించి భక్తులు తరించవచ్చు.






# భావతరంగాలు



మృదువుగా వచ్చింది ఆ మాట ఆమె నోటినుంచి. భర్త సమాధానం కోసం ఎదురు చూడలేదు. సందర్భం వచ్చింది కాబట్టి ఎన్నేళ్ళుగానో గుండెల్లో దాచుకున్న సంగతిని బయటపెట్టాలని మొండి ధైర్యం తెచ్చుకుంది.

తమిరిశ జానకి

పదిరోజులు కూతురి దగ్గరికి బెంగుళూరు వెళ్ళి ఆరోజే తిరిగి విజయవాడ వచ్చారు రామారావు దంపతులు. వెళ్ళేటప్పుడున్న ఆనందం తిరిగి వచ్చేటప్పుడు లేదు ఆయనకి. భర్త మొహంలో దిగులు పసిగట్టింది సరోజిని. కానీ అది మామూలే కదా.. ఎవరికైనా పిల్లలతో పదిరోజులు గడిపి వస్తుంటే ఆమాత్రం బెంగగా అనిపించదా అని సద్దిచెప్పుకుంది తనకి తనే.

కానీ నాలుగైదురోజులు గడిచినా మనుషుల్లో పడలేదు ఆయనగారు. దానిమూలంగా సరోజిని కూడా అన్యమనస్కంగా పనులు చేసుకుపోతోందే తప్ప దేని మీద దృష్టి పెట్టలేకపోతోంది.

మొదటినుంచీ కూడా రామారావుకి భార్యతో అట్టే కబుర్లు చెప్పే అలవాటు లేకపోయినా వీధిగుమ్మంలో నిలబడి ఇరుగుపొరుగుతోనూ ఆ దోవన పోయే తెలిసిన మొహాలతోనూ ఏదో ఒకటి కల్పించుకుని కబుర్లేసుకునే అలవాటు మెండుగానూ ఉంది. అలాంటివాడు ముభావంగా ఏదో ఆలోచిస్తూ గంటలకి గంటలు గడుపుతుంటే వింతగా అనిపించడమే కాదు మనసులో గుబులు కూడా మొదలైంది సరోజినికి ఏం జరిగిందోనని.

పక్కింట్లో అదివరకు అద్దెకు ఉన్న వాళ్ళు వేరే ఊరు బదిలీ అయి వెళ్ళిపోవడంతో ఇంకెవరో అద్దెకు దిగారు. పోన్లే పక్కింట్లో సందడితో వాళ్ళతో కబుర్లు కాలక్షేపాలతోమళ్ళీ మామూలవుతుంది పరిస్థితి అనుకుంది. కానీ తేడా ఏం కనబడలేదు.

ఆరోజు మధ్యాహ్నం భోజనమయ్యాక తీరుబడిగా కూచున్నప్పుడు అడగనే అడిగింది. ఊర్నుంచి వచ్చినప్పటినుంచీ చూస్తున్నాను దించుకోలేని భారం ఏదో నెత్తిమీద పెట్టుకున్నట్టు ఎందుకలా ఉంటున్నారని.

"మనకున్నది ఒక్కత్తే కూతురైనా దాన్ని ఎంత చక్కగా ఎంత తీరువగా క్రమశిక్షణలో పెంచుకున్నాం. నీకు మాత్రం తెలియదా"

విసురుగా భర్త నోటినుంచి వచ్చిన ప్రశ్నకి తెల్లబోయింది. ఎంత విసురుగా ప్రశ్న వచ్చిందో అంత కోపం ఆ గొంతులో ధ్వనించింది.

"ఏవిటండీ ఇప్పుడేమైంది అక్కడున్నప్పుడు అమ్మాయి మిమ్మల్ని ఏమైనా అన్నదా?"

"అలా జరిగినా ఇంత బాధ ఉండకపోను సరోజిని"

ఆ సమాధానానికి మరింత ఆశ్చర్యం. "మరి అసలు సంగతేమిటో మీరు చెప్తేకదా నాకు తెలిసేది" కాస్త భయం భయంగానే నెమ్మదిగా అడిగింది.

"తెలుసుకుని నువ్వు మాత్రం ఏం చెయ్యగలవు అయినా ఒకటి చెప్పునాకు. మీ పెద్దలు నిన్ను ఎంత బాగా పెంచారు ఔనా కాదా అలాగే మా అమ్మానాన్నలు మమ్మల్ని మంచిదారిలో నడిపిస్తూ పెంచి పెద్ద చేశారు. పెళ్ళిళ్ళ విషయంలో కూడా మీ ఇంట్లో



అయినా మా ఇంట్లో అయినా మంచీ చెడ్డా పెద్దలు ఆలోచించి నిర్ణయాలు తీసుకోవడమే కదా పద్ధతి"

"అయితే నేను అడిగినదానికి ఇప్పుడు మీరు మాట్లాడేదానికి సంబంధం ఏమిటండీ"

"సంబంధం ఉంది. తిక్కతిక్కగా మాట్లాడ టానికి నీ ముద్దుల మనవరాలు గానీ ఆ తిక్క వేషాలు భరించడానికి నీ కూతురులాంటివా డిని గానీ కాదు నేను"

భర్తకి వాళ్ళిద్దరి మీదా కోపం వచ్చిందని ఇప్పుడు అర్థమైంది కానీ ఎందుకొచ్చిందో మాత్రం తెలియదు. అక్కడనించి వచ్చేసే రోజు వాళ్ళతో ఏమైనా మాటామాటా వచ్చి మనసు కలుక్కుమందేమో. ఆ ఆలోచనే దిగమింగు కోడం కష్టమనిపించింది సరోజినికి. అసలు విషయం తెలుసుకుని భర్తకి నచ్చచెప్పి వాళ్ళ మీద కోపం పోగొట్టాలని నిర్ణయించుకుంది.

అయినా అమ్మాయికి తండ్రిమీద ఎంత గౌరవమో తనకి తెలియదా చిన్నప్పటినించీ కూడా అన్ని విషయాల్లోనూ ఆయన చెప్పినట్టే కదా నడుచుకుంది. అలాంటిది ఆయన మనసుకి బాధ కలిగేలా ఏం మాట్లాడుతుంది, ఎందుకం టుంది. ఇంక మనవరాలు మయూరి డిగ్రీ పూర్తిచే సింది. పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు. దాని లోకమే దానిది. స్నేహితురాళ్ళతో కలిసి సరదాగా గడపడం, వాళ్ళతో కలిసి ఇక్కడికి అక్కడికి వెళ్ళడం దాని పనేదో అది చూసుకోవడం తప్ప తాతయ్యతో వాదనలు, గొడవ పెట్టుకునే తత్వం కాదు దానిది. ఏవిటో అసలేం జరిగిందో తెలిస్తే కదా...అంతా అయోమయంగా ఉంది సరోజినికి.

ఆరోజుకి తెలుసుకునే అవకాశం లేకుండా పోయింది పక్కింటాయన వచ్చి రామారావుతో కబుర్లు చెప్తూ కూచోడంతో. పోన్లే మంచిదే అను కుంది ఔను మరి ఏదో కాలక్షేపం అలా గడిస్తే మనసులో మథనపడుతున్నది మరుగున పడిపో తుంది మామూలు మనిషివుతాడని అమ్మయ్య అనుకుంది. ఇద్దరికీ కాఫీ కలిపి పట్టుకొచ్చి టీపాయ్ మీద పెట్టి వెళ్లి మొక్కలకి నీళ్లుపోసే పనిలో పడింది.

"ఏవంటాడు పక్కింటాయన వాళ్ళ విశేషాలేమిటి" అంటూ రాత్రి పడుకో బోయేముందు యథాలాపంగా అడి గిన భార్య వంక చూడనుకూడా చూడకుండా "మహాగొప్పగా చెప్తు కుంటున్నాడులే ప్రేమవివాహంట వాళ్ళది" అనేసి ఆమెకి మరి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా గోడవైపు తిరిగి పడుకుండిపో యాడు. ఇంక ఇప్పుడు ఏం మాట్లాడినా ఏవడిగినా విసు క్కుంటాడని తెలుసు సరోజినికి. అందుకే సంభాషణ మరి పొడిగిం చలేదు అయినా ఎన్నిరోజులని ఉగ్గబట్టుకుని ఉండగలడు రామారావు మాత్రం. అందుకే ఓరోజు భార్య పెర టివైపు కిటికీ దగ్గర నిలబ డితే తదేకంగా కిటికీ లోంచి బయటికి చూస్తు న్నప్పుడు మొహం ముటము టలాడించుకుంటూ వచ్చాడు. విచ్చుకున్న ఎర్రగులాబీలని విరబూసిన చామంతులు కన కాంబరాలు నందివర్ధనాలని చూసి మురిసిపోతోంది సరో జిని.

"నీ మనవరాలు చాలా తింగరి వేషాలు వేస్తోంది. మంచి మంచి సంబం ధాలు చాలా వస్తున్నా చేసుకోనంటోందిట. ఎవ రినో ప్రేమించిందట వాడిని చేసుకుంటుందిట.

దానికి బుద్ధి చెప్పాల్సిందిపోయి దాన్నే వెనకేసుకొస్తోంది నీ కూతురు. ఇద్దరికిద్దరూ... ఒళ్ళు మండిపోతోంది నాకు తల్చుకుంటేనే"

ఇదన్నమాట సంగతి.

అర్థమైంది సరోజినికి. నవ్వు కూడా వచ్చింది. ఔనుమరి కోపంగా ఉంటే నీ కూతురూ నీ మనవరాలూ అంటాడు.

"ప్రేమపెళ్ళిళ్ళు మన ఇంటావంటాలేవు. పెద్దలు కుదిర్చిన సంబంధాలే కదా. నేను మా అమ్మా నాన్నలు చేసుకోమన్న సంబంధమే కదా చేసుకున్నాను"

చిర్రుబుర్రులాడుతున్న భర్తవంక ముఖావంగా చూసింది.

"ఆ కాలం వేరు ఈ కాలం వేరు. మర్చిపోతున్నారు మీరు కాలం మారిపోయింది"

"మనుషులు స్వభావాలు మార్చేసుకుంటూ కాలం మారిందంటూ కాలానికి అంటకడుతున్నారు సరోజిని"

"కాలానికి ఏది అంటగట్టినాగానీ అది మనిషి మనుగడకి మంచి చేసేదయితే స్వాగతించాలి కదండీ"

అప్రయత్నంగా మనసులోని భావతరంగం బయటికి దుమికినట్టే సమాధానమిచ్చింది.

ఏమైంది దీనికివాళ అన్నట్టుగా అదోరకంగా చూశాడు రామారావు.

"నేనొకటి చెప్తాను కోపం తెచ్చుకోరుగా"

మృదువుగా వచ్చింది ఆ మాట ఆమె నోటినుంచి. భర్త సమాధానం కోసం ఎదురు చూడలేదు.

సందర్భం వచ్చింది కాబట్టి ఎన్నేళ్ళుగానో గుండెల్లో దాచుకున్న సంగతిని బయటపెట్టాలని మొండిధైర్యం తెచ్చుకుంది. అసలు పెళ్ళయినప్పటినుంచీ ఇప్పటివరకూ ఈ ప్రస్తావన భర్త దగ్గర తీసుకురాకుండానే గడుపుకొచ్చింది. కానీ ఈ సందర్భంలో అయినా చెప్పకపోతే ఇంకా ఈ మనిషిలో ఎప్పటికీ మార్పు వచ్చే అవకాశమే ఉండకపోవచ్చు.

"ఏమిటి చెప్పు"

రామారావుగొంతులో చెప్పలేనంతగా చిరాకు ధ్వనించింది. ఔను మరి ఎప్పుడూ తను మాట్లాడటం ఆమె వినడమే కదా జరుగుతోంది.

"నేను కోపంతో చెప్పట్లేదు మీరు కూడా తేలిగ్గానే తీసుకోవాలి. మీ పెళ్ళికి ముందు ఆ కాలంలోనే ప్రేమాయణం నడిపారుట కదా మీరు ఎవరో సుజాత అనే అమ్మాయితో"

రామారావు మొహంలో కండరాలు బిగుసుకున్నాయి.

"అలాంటి విషయాలు నీతో ఎందుకు చెప్పాలి మావాళ్ళు. ఎవరు చెప్పారు బుద్ధిలేని వాళ్ళు. చెప్తే మంచివి చెప్పాలి లేకపోతే నోరుమూసుకుని ఊరుకోవాలి"

"ఎవరు చెప్పారు ఎప్పుడు చెప్పారు అన్నది వదిలెయ్యండి. పెళ్ళయి ఇంతకాలమైనా ఎప్పుడూ నేను మీతో ఈ విషయం మాట్లాడలేదు ఎందుకంటే అది నావరకే కాబట్టి. ఎన్నో రాత్రులు నిద్రలో మీరు సుజాతా సుజాతా అంటూ కలవరిస్తూ ఉంటే నిద్రకి దూరమై నేను పడిన బాధ నావరకే. కళ్ళల్లో నీళ్ళు ఉబికి బయటికి రాకుండా కనురెప్పలతో అడ్డుకట్టే వేసే ప్రయత్నంలో తెల్లవారిపోయేది నాకు. ఎవరికీ ఎప్పుడూ చెప్పుకోలేదు. మీ అమ్మ నాన్నగార్లకి ఇష్టం లేదు కాబట్టి ప్రేమించిన అమ్మాయిని పెళ్ళి చేసుకోకపోవడమే గొప్పతనంగా భావించుకున్నారు మీరు. ఆ సంగతి ప్రేమించే ముందు మనసులో మీకై మీరు విశదీకరించుకోవలసిన అవసరం లేదా. తల్లిదండ్రులు చెప్పినట్టు వినవద్దని నేను అనను. వాళ్ళకి కులాల పట్టింపు ఉందనీ మీ ప్రేమని ఒప్పుకోరని వాళ్ళని ఒప్పించడం నిక్కచ్చిగా మీతరంకాదనీ తెలిసి కూడా మీరు ఆ రోజుల్లోనే ప్రేమ జోలికి వెళ్ళారుకదా. ఈ తరం పిల్లల్ని విమర్శించే హక్కు మీకుందని అనుకుంటున్నారా"

రామారావు కళ్ళు, మొహం ఎర్రబారాయి భార్య మాటలకి. ఆమె అలా మాట్లాడగలదని అస్సలు ఊహించలేదు కల్లోకూడా. కానీ అమెకి నోరు తెరిచే అవకాశం తనెప్పుడిచ్చాడు కనుక ఈ ప్రశ్నకి మసకబారిపోయింది మనసులో.

తాతయ్య బామ్మని వంటింటి గుమ్మం దాని ఇవతలకి రానివ్వలేదు. నాన్నగారు అమ్మని వీధి గుమ్మం దాటనివ్వలేదు. తను తన భార్యని నోరు విప్పి మాట్లాడనివ్వలేదు. భర్త అంటే భార్యమీద పెత్తనం చేసేవాడు అని కదా తన కుటుంబంలో వాళ్ళు తనకి నేర్పిన అర్థం మరి.

"ఒక్కటి గుర్తు పెట్టుకోవాలండీ...ప్రేమవివాహమయినా పెద్దలు కుదిర్చినది అయినా అబ్బాయి మంచివాడేనా బుద్ధిమంతుడేనా చదువు సంస్కారం ఉన్నవాడేనా అని చూడాలిగానీ ప్రేమవివాహం అనేసరికి చులకనగా చూసే టటువంటి మనస్తత్వం మార్చుకోండి. ఆ అబ్బాయి చాలా బుద్ధిమంతుడు. ఉద్యోగంలో స్థిరపడినవాడూ కుటుంబంలో అందరూ కూడా మంచివాళ్ళే అని చెప్పాడు అల్లుడు"

## ఇది విన్నారా?



★ నీటి మరుగు స్థానం 100 డిగ్రీల సెంటిగ్రేడ్. (తర్వాత ఎంత మరిగించినా ఉష్ణోగ్రత పెరగదు కాని, నీరు ఆవిరై పోవడం ప్రారంభమవుతుంది).



★ మానవ శరీరంలోని అతిపెద్ద గ్రంథి కాలేయం.

★ మానవ దేహంలో యూరియా తయారయ్యే ప్రదేశం కాలేయం.

★ గాలిలోని నీటి ఆవిరి పరిమాణాన్ని ఆర్ద్రత అంటారు.

“ఏంచెప్తే ఏం లాభం? వాళ్ళు మనవాళ్ళు కానప్పుడు. అసలు ప్రేమా పెళ్ళీ అనగానే ఆరోజుల్లోనే నన్ను మావాళ్ళు కట్టడి చేసినట్లు దాని నోరు నొక్కి కూచోపెట్టవలసింది. నీ కూతురీ పెళ్ళికి ఒప్పుకోవడం నాకేమాత్రం నచ్చలేదు.”

రామారావు గొంతులో అయిష్టత కరాఖండీగా ధ్వనించింది.

“వాళ్ళు మనవాళ్ళు కానప్పుడు” భర్త అన్న ఆ మాట చాలా బాధాకరంగా తోచింది సరోజినికి.

చూపుతిప్పుకుంది చటుక్కున. వివిధరంగుల పూలు కలబోసుకున్న ప్రకృతి ఎంత సుందరం! ఎంత ఇంపుగా ఉంటుంది కంటికి! ఈ మాటలు తన భర్త నోటినించి ఆమధ్య విన్నవే. ఆ ఇంపు సొంపుకంటికి మాత్రం చాలునా? కలబోసుకున్న వసుధైక కుటుంబపు సొంపు అతని మనసు అంగీకరిచలేకపోతోందా! బంధువుల్లోనూ ఇరుగుపొరుగులోనూ పరువు పోతుందేమో అన్న అనుమానం పెనుభూతంలా కళ్ళముందు నిలిచినట్లుంది. ఒకటి మాత్రం అర్థం కావట్లేదు ఆ మనిషికి. ప్రేమించి మోసం చేసినవాడి పరువు పోతుందిగానీ ప్రేమపెళ్ళి చేసుకుంటే పరువెందుకు పోతుంది. పెళ్ళాడి గౌరవంగా బతికితే ఎవరు మాత్రం వేలెత్తిచూపిస్తారు?

భర్త మనస్తత్వానికి జాలిపడాలనిపించలేదు సరోజినికి.

పెళ్ళయి ఇన్నేళ్ళయినా ఏ విషయంలోనూ తన మనసు తెలుసుకునే ప్రయత్నం అతను చెయ్యలేదుగానీ తాను మాత్రం అతని మనసుకు తగ్గట్టు నడచుకుంది.

ముడుచుకుపోయిన అతని మనసు ముడతలు మునిమనవరాలు పుట్టేనాటికైనా సరిచేసుకోగలుగుతాడా అన్న సందేహం ఆమె మనసులో చోటు చేసుకుంది.

ఇప్పుడైనా అతని మనస్తత్వాన్ని దిద్దే ప్రయత్నం చెయ్యడం తప్పుకాదేమో అనిపించింది. “మనవరాలి ప్రేమని మనమ్మాయి వెనకేసుకొస్తోందని దానిమీద కోపం పెంచుకుంటున్నారు మీరు. ఎందుకు వెనకేసుకురాదూ? తన అభిప్రాయాలతో మీ అక్కయ్య కొడుకు అభిప్రాయాలు ఒక్కటి కూడా కలవవు అనీ అతన్ని పెళ్ళిచేసుకోవాలన్న ఉద్దేశ్యం తనకెప్పుడూ లేదనీ ఎంత ఏడ్చిమొత్తుకున్నా వినలేదు మీరు. వాడిని చేసుకోకపోతే ఉరేసుకుని చచ్చిపోతానని బెదిరించారు. అందుకే కదా అది జీవితమంతా రాజీ పడుతూ బతకడానికే నిశ్చయించుకుని తాళి కట్టించుకుంది. జీవితమంతా రాజీ పడుతూ బతికే శిక్ష తన కూతురికి వెయ్యదల్చుకోలేదండీ మనమ్మాయి. అందుకే దాన్ని వెనకేసుకోస్తోంది”

మాట్లాడడం ఆపేసిన భార్యవంక తాను ఆడమన్నట్టు ఆడే బొమ్మవంక వింతగా చూస్తుండిపోయాడు రామారావు. ఎగసిపడే కడలి కనిపించింది ఆమె కళ్ళల్లో. ఆశ్చర్యంగా అనిపించింది.

ఇన్నేళ్ళుగా ఆమె శరీరాన్ని తప్ప మౌనంగా మాట్లాడే ఆ కళ్ళల్లోకి ఎప్పుడైనా చూస్తేగా తాను.

ఎన్నెన్నో భావాలు అభ్యర్థనలూ సలహాలూ ప్రశ్నలూ సమాధానాలూ సంతోషం విచారం తరంగాలై కదలాడే భార్య కళ్ళల్లోకి ఏనాడూ చూడనప్పుడు ఆమె మూగమనసుని అర్థం చేసుకునే సందర్భం ఎక్కడుంటుంది. కిటికీలోంచి కనపడుతున్న ఆ రంగురంగుల పూలని చూస్తూ మౌనంగా ఎంతోసేపు అలాగే నిలబడిపోయాడు రామారావు.



## ఇది విన్నారా?



★ మానవ శరీరంలో చిన్న ఎముక ‘స్టపిస్’.

★ శక్తి స్వరూపాన్ని ‘ఉష్ణం’ అంటారు.

★ ఒక కెలొరీ 4.18 జౌల్‌లకు సమానం.



★ వస్తువుల ఉపరితలాలపై సాంద్రీకరణం చెందిన నీటి బిందువును ‘తుషారం’ అంటారు.

★ కెలొరీ అంటే ఒక గ్రాము నీటి ఉష్ణోగ్రతను 1 డిగ్రీ సెంటీగ్రేడ్‌కి పెంచడానికి కావల్సిన ఉష్ణం.






డా.జి.వి.పూర్ణచందు



# పాల విరుగుడు మంచిదేనా?

**పి.రాజేశ్వరి (అమలాపురం)**

**పాలు విరిగిపోయినప్పుడు వాటితో స్వీట్స్ చేసుకోవచ్చా? లేక పారబోసేయటమేనా?**

★ పాలు వాటికవే విరిగిపోయినా, కావాలని మనం విరిగేలా చేసినా మౌలికంగా పెద్ద తేడా లేకపోయినప్పటికీ, విరిగిన పాలు విషపూరితంగా విరిగాయేమో చూసుకోవాల్సిన అవసరం ఉంది.

పాలలో మజ్జిగ లేదా పెరుగు కలపటం ద్వారా ఉపయోగపడే బాక్టీరియాని చేర్చడంతో పాలు ఆరోగ్యదాయకమలైన పెరుగులా (యోగర్ట్) తోడుకుంటాయి. పాలను కాయకుండా పచ్చివిగానే బయట ఉంచేస్తే చెడ్డ బాక్టీరియా చేరి, ఆ పాలను కాయటం మొదలుపెట్టగానే విరిగిపోతాయి.

ఇలా విరిగిన పాలు చేదుగా, కుళ్ళు వాసనతో ఉంటాయి. వాటిని వాడటం మంచిది కాదు. అలా విరిగిన పాలు నిస్సందేహంగా విషపూరితమైనవే! వాటిని వాడకుండా ఉండటమే మంచిది. పాలు విరిగేలా చేసేందుకు అనేక ఉపాయాలున్నాయి. వాటిలో నిరపాయకరమైన పద్ధతిలో పాలను విరగ్గొడితే దాన్ని నిరభ్యంతరంగా స్వీట్లు వగైరా చేసుకోవటానికి వాడుకోవచ్చు.

పెరుగు, మజ్జిగ, వెన్న, పాలు, విరుగుడు, జున్ను ఇలా అనేకమైనవి మనం రోజూ వాడుకుంటున్న పాల ఉత్పత్తుల్లో దేని గుణాలు దానికున్నాయి. మనం ఇండియాలో 'కర్డ్'ని పెరుగు అనే అర్థంలో వాడుతున్నాం. కానీ, విదేశీ భాషలో 'కర్డ్' అంటే పాల విరుగుడు.

పాలలో కొవ్వు, షుగరు, ప్రొటీను అనేక పాల పదార్థాలు కలగలసి ఒక ఎమల్షన్ లేదా కొల్లాయిడ్ రూపంలో ఉంటాయి. పాలను సరిగా కాచకపోయినా, ఎక్కువగా కాచినా, లేదా పాలకు విరుద్ధ ద్రవ్యాలైన ఆమ్లాలుగానీ, ఉప్పుగానీ కలిసినా ఆ పాలు విరిగిపోతాయి. దీన్ని 'కర్డ్‌లింగ్' అంటారు. అంటే పాలలోంచి పాలపదార్థాలు వేరౌతాయి. కావాలని పాలను విరగ్గొట్టి ఆ పాలవిరుగుడు గుజ్జుతో వివిధ ఆహార పదార్థాలు తయారుచేసుకుంటారు. ఈ గుజ్జుని కర్డ్ అంటారు.

వెనిగర్ లేదా నిమ్మరసంతో విరగ్గొట్టిన పాల విరుగుడుని అప్పటికప్పుడు తయారుచేసి 'ఫ్రెష్ కాటేజ్ చీజ్' పేరుతో అమ్ముతుంటారు. పాలలోను గానీ పెరుగులోగానీ, పాల విరుగుడులో గానీ కేలరీలు, మిల్క్ ప్రొటీన్ ఇంకా కాల్షియం వగైరా పోషకాలన్నీ సమానంగానే ఉంటాయి. వాటిలో తేడా ఏమీ ఉండదు. కానీ ఉపయోగపడే బాక్టీరియాల వలన కలిగే ప్రోబయటిక్ అనే సుగుణం పాలు తాగినప్పుడు, పాలవిరుగుడు తిన్నప్పుడూ కలుగవు. అందుకని పాలను ఏఏ వ్యాధుల్లో తీసుకోకూడదని చెప్తారో ఆ వ్యాధుల్లో పాల విరుగుడు కూడా తీసుకోవటమూ తప్పే అవుతుంది.

అమీబియాసిస్, గ్యాస్ట్రోఎంటరైటిస్, కామెర్లు ఇంకా ఇతర జీర్ణకోశ వ్యాధుల్లోనూ, కీళ్ళవాతం మొదలైన వాత వ్యాధులోనూ పెరుగు, దానికన్నా బాగా చిలికిన మజ్జిగ 'ప్రోబయటిక్'లాగా ఉపయోగపడతాయి. అంటే వ్యాధినిరోధక శక్తిని పెంపొందింపచేసే రోగాలను తట్టుకునే విధంగా శరీరాన్ని కాపాడతాయి. పాల విరుగుడు ఈ వ్యాధినిరోధక శక్తిని పెంపొందింపచేసి రోగాలను తట్టుకునే విధంగా శరీరాన్ని కాపాడతాయి. పాలవిరుగుడు ఈ వ్యాధుల్లో మేలు చేయకపోగా వ్యాధి పెరిగేందుకు కారణం అవుతుంది.

పెరుగు లేదా మజ్జిగ పెరుగులో ఉండే ఉపయోగకారక ఈ బాక్టీరియా అమ్ల గుణంలోనే పెరుగుతాయి. అందుకని పెరుగులో అమ్ల గుణం ఎక్కువగా ఉంటుంది. అది కడుపులో ఆమ్లాన్ని తగ్గిస్తుంది. కానీ, ఆమ్లాన్ని కలిపి పాలను విరగ్గట్టినప్పుడు అది కడుపులో ఆమ్లాన్ని పెంచేదిగా ఉంటుంది. దంతాలకూ హాని చేస్తుంది.

పాలవిరుగుడుతో చేసే స్వీట్ల మంచీ చెడు గురించిన అధ్యయనం ఏమీ లేదు. ప్రజలు ఇష్టంగా తింటున్నారు...అంతే! అందరూ తింటున్నంత మాత్రాన అది సరైనదేనని సూత్రీకరించటం కూడా సరికాదు.

స్వీట్ షాపుల్లో కూడా పాలవిరుగుడు పదార్థాలే ప్రముఖంగా అమ్ముతున్నారు. పాల విరుగుడు స్వీట్లు తెలుగువాళ్లవి కావు కాబట్టి వాటిమీద సహజంగానే తెలుగువారికి వ్యామోహంగానే ఉంటుంది. అందుకే స్వీటు షాపులవాళ్లు కూడా వాటినే ఎక్కువ అమ్మకానికి పెడుతున్నారు.

శనగపిండితో చేసే స్వీట్లు ఎంత ఎసిడిటీని, అజీర్తినీ పెంచుతాయో, పాల విరుగుడు స్వీట్లు కూడా అంతే హాని చేస్తాయి. జీర్ణకోశ సమస్యలున్నవారు, అమీబియాసిస్, టైఫాయిడ్ లాంటి వ్యాధులతో బాధపడేవారు, పేగుపూతతో అవస్థపడుతున్నవారూ, పాలవిరుగుడు స్వీట్లు తిన్నప్పుడు ఎక్కువ అవస్థ పడతారు.

పాలను తోడుపెట్టుకుంటే అది ఆరోగ్యదాయకమైన పెరుగవుతుంది. దాన్ని చక్కగా చిలికి వెన్న తీసుకుంటే అది తేలికగా అరిగే స్వభావం కలిగిన మజ్జిగ లేదా చల్ల అవుతుంది. దేవతల కోసం సురని, మనుషులకోసం చల్లని సృష్టించాడు విధాత. చల్లని తూలనాడకండి. పాలను విరగ్గొట్టుకుని ఆరోగ్యాన్ని చేజేతులా విరగ్గొట్టుకోకండి!

○

*ప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులు, సాహితీవేత్త, ఆహారశాస్త్ర పరిశోధకుడు డా.జి.వి.పూర్ణచందుగారు ఆహార ఆరోగ్యాల గురించి మీకున్న ధర్మసందేహాలకు సులువుగా అర్థం అయ్యేలా సమాధానాలిస్తారు. ఆరోగ్యాన్ని కాపాడే ఆహారం గురించి మీరు మీ సందేహాలను నేరుగా డాక్టరుగారికే పంపించవచ్చు.*

**చిరునామా:డా.జి.వి.పూర్ణచందు,**
సుశ్రుత ఆయుర్వేద ఆసుపత్రి,
బకింగ్‌హామ్‌పేట పోస్టాఫీసు ఎదురుగా,
గవర్నర్‌పేట, విజయవాడ-520002,
సెల్: 94401 72642,
e-mail:purnachandgv@gmail.com

# అపజయాలు కలిగిన చోటే...

- డా.చెళ్ళపిళ్ళ సూర్యలక్ష్మి
drcslakc@gmail.com

**లిఫ్ట్ మీద కూడా వినతిపత్రం సమర్పించాను. పాపం, అమిత నాకు అవసరమైనప్పుడల్లా టైపు చేసి పెడుతోంది. వినతి పత్రాన్నివ్వగానే ఆ వేధింపు ఆగింది. హమ్మయ్య! ఈరోజుల్లో అందరూ 'ఈ-గవర్నెన్స్', 'పేపర్లెస్ ఆఫీసు' అనే పదాలు ఊరికే వాడేస్తుంటారు కదా! ఇలా ప్రతీ విషయానికీ నేనొక వినతి పత్రాన్ని సమర్పించుకుంటూపోతే ఎన్ని చెట్లు నరకబడతాయో కదా!**

లిఫ్ట్ ఆపెయ్యడం వల్ల వచ్చిన కీళ్ళ నొప్పులు ఇంకా తగ్గలేదు. నా అడుగులు తడబడడం మొదలెట్టాయి. ఒకసారి ఎడమపక్క పడబోయి, ఎలాగో నిలదొక్కుకున్నాను. దాని పర్యవసానంగా నడుం నొప్పి పాలయ్యి లంబార్ బెల్ట్ పెట్టుకుని ఆఫీసుకి వెళ్ళేదాన్ని. అప్పుడప్పుడు సగం రోజు సెలవు అవసరమౌతూ ఉండేది. రోజంతా సెలవుపెడితే పనులడ్డిపోతాయి. రోజంతా ఆఫీసులో ఉండాలంటే నొప్పి, తీరా చూస్తే, నా సాధారణ సెలవు (సీఎల్) అంతా వాడేసుకున్నానాయె!

అప్పుడు అకస్మాత్తుగా నాలుగు రోజుల అదనపు విశేష సాధారణ సెలవు గురించి గుర్తొచ్చింది. నా కార్డు కృష్ణగారికి పంపించాను. ఆయన సంతకం కోసం. వారం రోజులయ్యింది. ఏ కబురూ లేదు. నేను ఫోను చేస్తే "సారీ మేడమ్, జీతాల బిల్లుల టైం కదా! మరచిపోయానండీ. అన్యథా భావించకండి. ప్లీజ్!" అని బతిమాలారు. తరువాత బాకీ ఎగ్గొట్టేవాడిలా మొహం చాటెయ్యడం మొదలుపెట్టారు.

మళ్ళీ ఫోన్ చేసి అడిగాను. "మేడమ్. ఇదిగో, ఇవ్వాల్టి సాయంత్రం లోపల చేసేస్తాను కదా!" అని చెప్పి కిమ్మనలేదు.

మరుసటి రోజు ఉదయాన్నే వాళ్ళ విభాగంలో పని చేసే గుమాస్తాని పంపించి "మేడమ్, మీ ప్రాబ్లమ్ ఏమిటి?" అని అడిగించారు. ఇంత పెద్ద ఆఫీసర్ వ్యక్తిగత విషయాలు గుమాస్తా చేత అడిగిస్తారా? ఏం పొగరు?

అయినా, నేను ఓర్చుకున్నాను. నేను ఆదాయప్పన్నులో రాయితీ తీసుకుంటాను గనుక ఏ ఆఫీసుకి పోస్టు అయినా, రిపోర్టు అయిన వెంటనే జీతం బిల్లు తయారు చేసి సంక్షేమ విభాగం వాళ్ళకి డాక్టర్ సర్టిఫికెట్. అదే, ఫారం 10 (1) (ఏ) నకలుని అందజేస్తాను. ఈ ఆఫీసు విషయంలో కూడా నేను ఆ పని

16 జరిగిన కథ

**దివ్యాంగులకోసం** ఎలాంటి సహాయ కార్యక్రమాలు చేపట్టాలి, జీవన విధానానికి అనుకూలమైన వాతావరణాన్ని ఎలా ఏర్పాటు చేయాలి తదితర అంశాల మీద ప్రభుత్వాధికారులంతా పాల్గొన్న సమావేశంలోని సభికుల నిర్లక్ష్యమైన తీరుకు బాధ పడుతుంది చేతన. తన వంకర చేయినీ, కాలునీ చూసుకున్న ఆమెకి గతం కళ్ళ ముందు మెదులుతుంది. చిన్నతనంలో స్కూల్లో ఆటల్లో తనని పాల్గొననిచ్చేవారు కాదు, అది చేతనని కలచివేసేది. తన ఫ్రెండ్స్ శృతి, కృతిలతో పాటు తను కూడా ముగ్గులు వేసేందుకు ఎంతగానో ప్రయత్నించిన చేతన తన అవిటితనం వల్ల చాలాసార్లు అభాసుపాలయినా ముగ్గులపోటీలో ఓ ప్రోత్సాహక బహుమతి సాధిస్తుంది. చేతనకి మారుమూల ఊళ్లో పోస్టింగ్ వస్తుంది. తన ఆరోగ్యం విషయమై డాక్టరు చేసిన వ్యాఖ్యలు విన్న చైతన్య ఆలోచనలో పడుతుంది.బాస్ దగ్గర నుంచి కాల్ వస్తే మాట్లాడుతూ ముందుకు నడుస్తున్న చేతన డోర్ మ్యాట్ మీద నుంచి ఎగిరిపడి కాలు బెణుకుతుంది. కాలు ఫ్రాక్చర్‌కి సర్జరీ అయ్యాక తల్లిదండ్రుల చేత సపర్యలు చేయించుకుంటున్నందుకు విచారిస్తుంది చేతన. కొత్త ఆఫీసు భవనానికి కావల్సిన ఫర్నిచర్ ఇతరత్రా సామాన్ల కొనుగోలు బాధ్యత కమిటీలో ఆమెను వేస్తారు అధికారులు. చేతన చురుకుగా వుండడం వల్ల ఆమె వైకల్యం పెద్దగా ఆటంకం కాలేదనీ, కొన్ని వ్యాయామాలు చేస్తుంటే భవిష్యత్తులో రాబోయే అనర్థాలను నివారించవచ్చనీ డాక్టరు చెబుతాడు. అడ్వకేట్ జాయ్ ఉచితంగా తన కేసును వాదిస్తానని చెప్పినందుకు ఆశ్చర్యపోతుంది చేతన. దివ్యాంగులకు సంబంధించిన కార్యక్రమంలో అధికారి ప్రవర్తనను చేతన దగ్గర దుయ్యబడతాడు జాయ్.తన నిస్సహాయ స్థితిని ఆసరాగా తీసుకుని బాస్ పన్నుతున్న కుట్రల్ని సహనంతో ఎదుర్కొని విజయం సాధిస్తుంది చేతన.

**ఆంధ్రభూమి వారపత్రిక నవలల పోటీలో మూడవ బహుమతి రూ.20,000/- గెలుపొందిన రచన!**

చేశాను. అందుకే, నాకు చిర్రెత్తుకొచ్చింది.

ఒక ఉద్యోగిని తనకి ఒక సదుపాయం పొందే హక్కుందని చెబితే, విభాగం వాళ్ళ దగ్గర ఉండే కాగితాలు చెక్‌చేసి, సంబంధిత ఆధారాల్లేనప్పుడు వాటికోసం అడగచ్చు. వీళ్ళు హోంవర్క్ చేసుకోకుండా నన్ను ముంజేతి కంకణానికి అద్దం చూపించమంటున్నారు.

నేను, 'ఐ యాం సారీ. నా ప్రాబ్లంకి సంబంధించిన కాగితాలు మీ విభాగంలో ఉన్నాయి. మీరు ఇలా అడగడం ఏమీ బాగాలేదు" అని అతణ్ణి పంపేశాను.

మధ్యాహ్నం ఒక సూపర్నెంట్ వచ్చి "మేడమ్, మీరు మా సెక్షన్‌కి ఇచ్చిన కాగితపు నకలు ఉంటే ఇస్తారా?" అని అడిగాడు. నాకర్థమైపోయింది. ఇదోరకం వేధింపు. "మీరు కాగితాలని జాగ్రత్త చేసుకోకుండా నన్ను వేధించడం బాలేదు. మీమీద నేను వికలాంగుల కమిషనర్‌కి కంప్లైంట్ ఇచ్చే స్థితికి నన్ను తేవద్దు" అని మర్యాదగా చెప్పాను. అతను మొహం మాడ్చుకుని నా ఛాంబర్ నుండి వెళ్ళిపోయాడు.

రెండు రోజులు నిశ్శబ్దం. వాళ్ళు కాగితాల కోసం గాలిస్తున్నారా? లేక కొత్త పన్నాగం పన్నుతున్నారా? ఏది ఏమైతేనేం? నా కష్టాలు కొనసాగుతున్నాయి. ఈ విషయం జాయ్ చెవిన వేస్తే, అతను నా కేసు విచారణకి వచ్చినప్పుడు ఈ విషయం కూడా విన్నవించుకుందామన్నాడు.

మూడో రోజున కృష్ణగారు వచ్చి, ఒక టైపు చేసిన కాగితం మీద సంతకం పెట్టమని కోరారు. అందులో, 'నాకు... (ఇది నేను రాయాల్సిన విషయం) అంగవైకల్యముంది. అది వికలాంగుల చట్టప్రకారం నలభై శాతం కన్నా ఎక్కువ. ఎప్పుడైనా సరే, నేను ఇచ్చిన వాంగ్మూలం తప్పని తెలిస్తే, ఆ తప్పుకి నూరుపాళ్లూ నేనే బాధ్యురాలిని' అని వ్రాసుంది. దొంగ నాటకాలంటే ఇవే.

ఆ కాగితంలో టైపు చేసిన భాగంలో ఖాళీలు భర్తీ చేయకుండా, కింద పెన్నుతో, 'నేను మీ విభాగానికి ఆదాయప్పన్ను విషయమై అంగవైకల్యానికి సంబంధించిన ఒక సర్టిఫికెట్ ఇచ్చాను. దాన్ని మీరు కనెక్ట్ చేయకపోవడం బాధాకరం. మీ తప్పులకి నన్ను బాధ్యురాలిని చేయజూడడం విచారకరం' అని రాసి, సంతకంపెట్టి నా ఆల్-ఇన్-వన్ ప్రింటర్లో దానికొక నకలు తీసి, కృష్ణగారిని ఆ కాగితం అందినందుకు రుజువుగా దానిపై సంతకం పెట్టమన్నాను. సంకోచించినా పెట్టక తప్పలేదాయనకు. దీంతో పనైపోతుందనుకుని పొరబడ్డాను.

మరుసటి రోజున కృష్ణగారు మళ్ళీ, రూల్స్ ప్రకారం వికలాంగుల చట్ట ప్రకారం కనీసం నలభై శాతం అంగవైకల్యం ఉన్నవారికే అదనపు సీఎల్ ఇవ్వాలని రాసుందని ఆ రూల్ కాగితం తెచ్చి మరీ చూపించారు. నేను ఆదాయప్పన్ను ప్రకారం అంగవైకల్యపు సర్టిఫికెట్‌ని ఇచ్చినందున అది పనికిరాదట! అక్కడికి నాకు అదనపు సీఎల్ ఆయన ఇవ్వడానికి తయారుగా ఉన్నట్టు, నేనేమో చందమామని తెమ్మనడిగినట్టూను. వీళ్ళ అసమర్థత నాపై రుద్దుతున్నారు.

నాకు రూల్స్ తెలిసినా ఒకసారి వికాస్‌ని అడిగి తెలుసుకుందామని ఆరోజు సాయంత్రం ఫోన్ చేశాను. జరిగిన సంఘటనలు విని వికాస్, స్రవంతులిద్దరూ బాధ పడ్డారు. అయినా నా ధైర్యాన్ని మెచ్చుకుని నాకు కొంత ఊరటనిచ్చారు. ఆదాయప్పన్ను చట్టప్రకారం అంగవై



కల్యం వికలాంగుల చట్టంతో సంబంధితమని, ఆ చట్టప్రకారం కనీసం నలభై శాతం వైకల్యం పైబడ్డవాళ్ళకే ఇందులో మినహాయింపుంటుం దని చెప్పాడు.

జాయ్ ఇది విన్న వెంటనే అగ్గిమీద గుగ్గిలమై పోయాడు. "ఏం మీకు లోపముందని కళ్లకి కన పడదా! వీళ్ళు కళ్ళున్న అంధులు! అధికార మదాంధులు! దురహంకారాంధులు!" ఇలా మండిపడ్డంలో ఆశ్చర్యమేముంది? యువకుడు, ఉడుకురక్తం గలవాడు. పైగా, ఆదర్శాలకోసం ఆస్తిని వదులుకున్న మహామనీషి. ఇలాంటి విష యాలలో అసహనం ఉండడం సమంజసమే!

కోర్టు వారి సెలవులయ్యి కొలువు తీరాక మూడు నెలలదాకా నా కేసు వాదనకి రాదని తెలిసింది. మా బాచ్‌కి ప్రమోషన్ వస్తుందని విని కిడి. ప్రతీ ప్రభుత్వోద్యోగికీ కొంత జ్ఞానం ఉంటుంది ప్రమోషన్ విషయంలో. నాకు ఆపాటి ఉండదా! అబ్బో, ప్రమోషన్ రావడానికి చాలా విషయాలు అవసరమౌతాయి. క్రమశి క్షణా చర్యలుండని వారికే అది దక్కుతుంది. ఇప్పుడు నా కొత్త కష్టమదే!

రోజులు గడుస్తున్నాయి. నా అదనపు సెల వింకా త్రిశంకు స్వర్గంలోనే ఉంది. పోనీ, ఛార్జ్ షీట్ విషయం తేలుతుందేమో అని రోజూ ఎదురు చూస్తున్నాను. అదీ లేదు. నేను ఆరోప ణలు ఎందుకు సరైనవి కావో విశదీకరిస్తూ జవా బిచ్చాను కదా!

పై అధికారులకు విజ్ఞప్తి చేసినా పని జరగా ల్సింది ఇక్కడి ఆఫీసులోనేనని. ఒక భారత పౌరురాలిగా నా కష్టాలను తీర్చమని, ప్రాథమిక హక్కుననుభవించే అవకాశాన్నిమ్మని న్యాయస్థా నాన్ని కోరే హక్కు నాకుందని పేర్కొన్నాను. అదీ కాక నేను సవినయంగా నా కష్టాలు గట్టెక్కించ మని మనవి చేసుకున్నానని, అవి తీరకపోవడం వల్ల కోర్టుకెళ్ళానని, ఆ చర్యకి అవిధేయత, క్రమానుగత శ్రేణిని ధిక్కరించడంలాంటి పరుష వాక్కులు వాడడం అసమంజసమని తెలుపుకు న్నాను. రెండేళ్ళకి ఇంచుమించు మూడు బది లీల చొప్పున ఇప్పటికే పధ్నాలుగో పోస్టింగ్‌లో ఉన్న నేను ప్రతీ పోస్టింగ్‌లోనూ నా అంగవైక ల్యానికి సంబంధించిన ఇక్కట్లెన్నో ఎదుర్కొన్నా నని ఉదాహరణలతో సహా పేర్కొని, భవిష్య త్తులో రాబోయే కష్టాలనిప్పుడే నివారించడం మంచిదని, రెండవ ఆరోపణకి బదులుగా వ్రాశాను. ఇది వ్రాస్తున్నప్పుడు ఈ వేధింపులిక్క డితో ఆగకపోతే, ఈ విషయాన్ని కూడా కోర్టు వారికి మనవి చేసుకుంటానని ఓ బెదిరింపు విన రమన్నాడు నా కుర్ర లాయరు. నేను ఆ పని చెయ్యలేదు. నాకు కొన్ని గ్రీవెన్స్‌లు ఉంటే మాత్రం, నా అన్నదాతైన ప్రభుత్వాన్ని ఉత్తుత్తినే బెదిరిస్తానా? వారు నా పరిస్థితి అర్థం చేసుకుని నాపై అభియోగాన్ని ఉపసంహరించుకుంటా రని ఆశించాను.

మొదటి ఆరోపణ మీద మా బాస్ నిర్ణయం తీసుకోవాలి. అంటే చేతికొచ్చింది వ్రాయడం కాదు, హేతుబద్ధమైన వాదనతో నా వాదనని అంగీకరించడమో, తోసిపుచ్చడమో చేయాలి (దాన్నే పరిపాలనా పరిభాషలో, 'స్పీకింగ్ ఆర్డర్' అంటారు) రెండవది కష్టం.. వీలుకాదు. ఎందు కంటే నా వాదనని అంగీకరించడానికి అహం ఒప్పదు. అందువల్ల, ఆయన సుమతీ శతకాన్ని రోజూ మననం చేసుకుంటారో ఏమో, ఈ విష యాన్ని తప్పించుకు తిరుగుతున్నారు. ఆయన్ని పర్యవేక్షించే వారు. నా కేసుని ఎందుకు తెమల్చ లేదని ఆయన్ని అడగరా? అడిగినా ఈయన వాళ్ళకి సర్ది చెప్పుకుంటారు కామోసు. మా బాచ్ వాళ్ల ప్రమోషన్ల ప్రక్రియ మొదలయ్యిం దన్న వార్త విని వ్యాకుల పడ్డాను. ఈ ఛార్జ్‌షీట్ ఉన్నంతకాలం నాకు ప్రమోషన్ రాదు. ఇటూ అటూ కాని త్రిశంకు నరకం ఇది.

మరోవారంలో నా కేసు విచారణకి వస్తుంద నగా మా బాచ్ వాళ్ళ ప్రమోషన్ లిస్టు వెలువ డింది. ఊహించినట్టుగానే అందులో నా పేరు లేదు. ఎంత అవమానం! నేను నమ్మిన దేవుడు కూడా నన్ను కాదనుకున్నాడు గనుక ఇది ఖచ్చి తంగా శరాఘాతమే! కారణం - నేనెరిగిందే! ఎవరి పేరు మీదైనా ఒక క్రమశిక్షణోల్లంఘన కేసు అసంపూర్తిగా ఉన్నప్పుడు, సాధారణంగా పై అధికారులు దానిమీద నిర్ణయం తీసుకోమని క్రమశిక్షణాధికారికి ఆదేశాలిస్తారు. నా విష యంలో ఏమయ్యిందో! ఇదివరలో నా స్థితి గురించి నాకు మాత్రమే తెలుసు. ఇప్పుడు మా బాచ్ అందరికీ తెలిసిపోయింది! దీన్ని ఎలా తట్టుకుంటాను? నాది దుష్ప్రవర్తన కాకపో యినా, నా మీద అందరూ దుష్ప్రచారం చేసే ప్రమాదం ఉంది. ఇప్పుడు నాకు గూఢార్థం బోధపడింది. ఈ అల్పారోపణల ఛార్జ్‌షీట్, నాకు ప్రమోషన్ రాకుండా చేసేందుకు మా బాస్ పన్నిన పన్నాగం. ఆయన ఎంత నీచానికి ఒడిగట్టారు. ఒకప్పుడు అందరూ నన్ను గొప్పగా అనుకునేవారు. నేను ట్రైనింగ్‌లో ఉన్నప్పుడు మా ఉపాధ్యాయులందరూ నాకు ఉజ్జ్వల భవిష్య

## ఇది విన్నారా?

★ **ప్రఖ్యాత బాలీవుడ్ నటుడు శత్రుఘ్న సిన్హా వెనుక ఓ గమ్మత్తైన విషయం ఉంది. ఆయన ముగ్గురు అన్నలకు తల్లిదండ్రులు రామ్, లక్ష్మణ్, భరత్ అని పేర్లుపెట్టారుట. శత్రుఘ్న తన కుమారుల పేర్లనూ రామాయణం నుంచే తీసుకుని తన కవల కుమా రులిద్దరికీ లవ్, కుశ్ అని పేర్లు పెట్టుకున్నారు. ఆయనకి రామా యణం మీద ఎంత మక్కువ అంటే తన ఇంటికి 'రామాయణ్' అని పేరు పెట్టుకున్నారుట.**

# ఇది విన్నారా?



★ కలుపుతీయాలన్నా, దుక్కి దున్నాలన్నా ఎడ్లుండాలి. కాని, అవి దొరక్క వికారాబాద్ జిల్లా నారెగూడ ప్రాంతంలో యువరైతు లాలీ నర్సిములు తన బైకుకి దంతె పలుగు బిగించి, కలుపు తీస్తున్నాడు. ఎడ్లతో అయ్యే ఖర్చుకంటే తన బైకు పెట్రోలు ఖర్చు తక్కువైందని చెప్పాడు.

★ కప్పలలో 4,700 జాతులున్నాయి. అంటార్కిటికా ఖండంలో తప్ప తక్కిన అన్ని ఖండాలలోను కప్పలు కనిపిస్తాయి.

త్తుందని మెచ్చుకునే వారు. ఈ విషయం వింటే వారెంత బాధ పడతారో! ఈ తలవంపులు ఎలా దిగమింగాలి? ఎలా? ఎలా? ఎలా?

★ ★ ★

"నేను ఎక్కడున్నాను?"

"ఇది సీసీ హాస్పిటల్స్ ఐసీయూ. నిన్న సాయంత్రం మీరు ఆఫీసులో కళ్లు తిరిగి పడిపోయారు. రాత్రంతా మిమ్మల్ని జాగ్రత్తగా గమనిస్తూనే ఉన్నాం"

"నా మొబైల్ ఇస్తారా? మా వాళ్ళకి.."

"మీరేం కంగారుపడకండి. మీ మొబైల్‌లో ఉన్న 'ఐసీఈ', అదే 'ఇన్ కేస్ ఆఫ్ ఎమర్జెన్సీ' నెంబర్లకి. మేం ఫోన్ చేసి చెప్పేశాం. మీ పేరెంట్స్ వచ్చేశారు కూడా! ఎటొచ్చీ మీరు స్పృహలో లేరు కాబట్టి బయట కూర్చోబెట్టాం"

"పాపం వాళ్ళు వయసులో పెద్దవాళ్ళండీ! ఓ రూమ్ ఇస్తే.."

"చేతనగారూ! మీరు మళ్ళీ కంగారుపడుతున్నారు. నేను వాళ్ళ బాగోగులు చూసుకుంటాను. ప్లీజ్ రిలాక్స్.." అని డ్యూటీ డాక్టర్ అంటూండగా, ఓ సూది నన్ను పొడిచినట్టయ్యి, మగత నిద్రలోకి జారుకున్నాను.

నేను లేచేసరికి కొంత తేరుకున్నట్టుంది. లేవబోతుంటే, వాంతి వచ్చేట్టుందని సిస్టర్‌ని పిలిచి నాకు కొంచెం సాయం చేయమని అడిగాను. మొత్తానికి వాంతి రాలేదు. నిన్న వచ్చిన కళ్ళు తిరుగుడు ఇంకా తగ్గినట్టు లేదని ఆమె చెప్పి, అయినా కూడా నన్ను కంగారు పడద్దంది. అమ్మానాన్నలకి నా కోరిక మేరకి ఒక గది కేటాయించారని, ఎవరో ఒక జంట వాళ్ళని కనిపెడుతున్నారని, నేను నిద్రపోతున్నప్పుడు వాళ్ళు నన్నొచ్చి, చూసి వెళ్ళారని చెప్పింది. సో, వికాస్-స్రవంతి వచ్చేశారన్న మాట!

ఈలోగా ఒక పెద్దాయన వచ్చారు. ఆయన సంతరించుకున్న ప్రాధాన్యతని బట్టి, ఆయన డాక్టర్ అయ్యి ఉంటారనుకున్నాను. సిస్టర్ ఆయనకి ఒక రిపోర్ట్ అందించింది.

ఆయన దాన్ని చూసి "మీరు ఎందుకు మథన పడుతున్నారు?" అని అడిగితే, నాకు కన్నీళ్ళు వచ్చాయి. "ఓ, సారీ, బాధపడకండి. మామూలు మనుషులకే స్ట్రెస్‌వల్ల లేనిపోని జబ్బులొస్తాయి. మీరు హెమిప్లీజిక్. మీరు తట్టుకోలేనంతగా వత్తిడి తీసుకుంటే స్ట్రోక్ వచ్చే అవకాశాలు చాలా ఎక్కువ"

నాకు వెంటనే ఎప్పుడో డా॥ ఆనందరావు గారి మాటలు గుర్తొచ్చాయి. 'బీపీ ఉంటే స్ట్రోకు రావచ్చు' నేను ప్రాణాయామం క్రమం తప్పకుండా చేస్తున్నానే? నా ఆలోచనా ఝరికి ఆనకట్ట కడుతూ, "మీ కష్టాల గురించి మీ పేరెంట్స్ నుండి విచారించాను. ఎక్కువగా ప్రభుత్వాధికార్లు వాళ్ళ సొంత పనులు చేసుకుని దేశానికి ద్రోహం చేస్తారనుకునేవాణ్ణి. మిమ్మల్ని.. అంటే మీరు అనుభవిస్తున్న క్షోభ చూశాక, మీలో కూడా విలక్షతలున్నాయని గ్రహించాను. ఒక విషయాన్ని గుర్తుంచుకోండి.. ముఖ్యంగా వ్యవస్థనెదిరించి పోరాడే మీబోటి ఆఫీసర్ల వల్లే ఈపాటైనా ప్రజాసేవ జరుగుతోంది. నైస్ టు నో యూ" అని కరచాలనం చేసి "ఇక మెడికల్ విషయానికొస్తే, మీ ఎమ్మారై బాగానే ఉంది. దేవుడు మిమ్మల్ని ఒక పెద్ద ఉపద్రవం నుండి కాపాడాడు. నరాల బలహీనతకి మందులు వాడితో సరిపోతుంది. ప్రాణాయామం, ధ్యానం వగైరాలేమైనా చేస్తే మంచిది. ఒక్క విషయం గుర్తు పెట్టుకోండి.



మీరు ఆరోగ్యంగా ఉంటేనే ప్రజాసేవ చేయగలరు" అని నిష్క్రమించారు. ఆయన చెప్పినదాన్ని బట్టి నరాల డాక్టర్ అని అర్థం చేసుకున్నాను.

ఆరోజు సాయంత్రానికి నన్ను రూమ్‌కి మార్చారు. అప్పుడే మొబైల్ చూడగలిగాను. అరవై రెండు మిస్డ్ కాల్స్ ఉన్నాయి. ఇంచుమించు అన్నీ మా బాచ్‌మేట్స్ నుండే ఉన్నాయి. నేను ఫోన్ ఎత్తలేదు గనుక మెసేజెస్ పెట్టారు. కొంతమంది నాకు ప్రమోషన్ రానందుకు ఆగ్రహం, ఆశ్చర్యం వ్యక్తం చేశారు. మరికొందరు దీన్ని ఖండిస్తూ వినతి పత్రాలని సమర్పిద్దామన్నారు. మరికొందరు (మహేష్, చందర్... అవును చందరే!) నిరసన చేద్దామని సలహా ఇచ్చారు. పబ్లిక్ ఫోరం అయిన ఫేస్‌బుక్‌లో బాస్ బాధ్యతారహిత వ్రాతలు వ్రాశారని, అది ఎటికెట్ కాదని, మా బాస్ మీద పై అధికారులకు ఫిర్యాదు చేయమని మహేష్ సలహా కూడా ఇచ్చాడు. అందరిలోనూ వాళ్ళ ప్రమోషన్ వల్ల వచ్చే సంతోషం కన్నా వాళ్ళ బాచ్ టాపర్ ప్రమోషన్ మిస్ అయిందన్న బాధ ఎక్కువగా కనిపించింది. చందర్ ఎంత ఎదిగిపోయాడు! వీళ్ళ అనునయపు మాటలు నాకు ఈ సమయంలో కావలసిన ఊరటనిచ్చాయి. వాళ్ళని ఏ నిరసనా చేయద్దని స్రవంతి ద్వారా నా మొబైల్ నుండి మెసేజ్ పెట్టించాను. నా పోరాటాన్ని స్వయంశక్తితో కొనసాగించగల సత్తా నాలో ఇంకా ఉందని, వాళ్ళ మద్దతు నాకుందన్నమాటే నాకు ఏనుగంత బలాన్నిస్తుందని కూడా వ్రాయించాను. జాయ్ నన్ను చూద్దానికి రాకపోవడం మాత్రం నాకు అమితాశ్చర్యాన్ని కలిగించింది.

బరోడాలో ఉండే మా దూరపు బంధువు ఒకరు ధ్యానం బాగా నేర్పిస్తారని చెప్పి, ఆవిణ్ణి ఏసి టికెట్లతో మరీ పిలిపించారు అమ్మానాన్నలు. శ్వాస మీద ధ్యాస పెట్టడం ఎంత కష్టమో నాకు అర్థమయ్యింది. అయినా, ఆవిడ వాక్కులో ఏదో తెలియని శక్తి ఉంది. ఆవిడ మాటలు నన్ను వశీకరించినట్లు పని చేశాయి. నా అంతట నేను ధ్యానం చేస్తే పట్టుమని పది నిమిషాలు కూడా ఏకాగ్రత నిలుపలేక పోయేదాన్ని. కాని గురుముఖతః చేస్తే, గంటసేపైనా తెలిసేది కాదు. నాలుగు రోజుల్లోనే నా ధ్యానశక్తి పెంపొందిందని, నేను ధ్యానం మొదలుపెట్టిన త్వరలోనే నన్ను నేను మైమరచిపోయి బోలెడంత శక్తిని సంపాదిస్తున్నాని ఆవిడన్నారు. ఒకవేళ భరించలేనంత శక్తి వస్తే, దాన్ని ఎవరికైనా ఎలా దానం చేయాలో కూడా నేర్పారు. ఎవరూ గుర్తు రాకపోతే భూమికి ఇచ్చి, ఎవరికి అవసరమైతే వాళ్ళకివ్వమని కోరచ్చన్నారు.

వారం రోజుల తరువాత ఇంటికి వెళ్ళి, మరో వారం విశ్రాంతి తీసుకున్నాక ఆఫీసుకి వెళ్ళాను. అక్కడంతా షరామామూలే! మా బాస్, కృష్ణగారు నన్ను ఎగతాళి చేస్తారు. మిగతా మనుషులు నన్ను ఒక నిజాయితీపరురాలిగా, కష్టపడి పనిచేసే వ్యక్తిగా గౌరవిస్తారు. మొదటి రకం నన్ను లెక్క చేయరు. రెండవ రకం వాళ్ళకి నా పదవితోను, ప్రమోషన్‌తోనూ పనిలేదు.

★ ★ ★

నేను ఆఫీసుకి వెళ్ళిన ఓ మూడు నెలల తరువాత విచారణ ఉందని మూడు రోజులు ముందుగానే జాయ్ వచ్చాడు. వచ్చినప్పుడు నా ఛార్జ్ షీట్, నేను అదనపు సెలవు విషయమై కృష్ణగారికి నా బాధని వ్యక్తం చేస్తూ వ్రాసిన ఉత్తరాలకి నకళ్ళు అడిగి తీసుకున్నాడు. అప్పుడు గానీ గుర్తు రాలేదు నాకు. ఒంట్లో బాలేనప్పుడు ఒక విచారణ జరిగిందని, దాని గురించి నేను పూర్తిగా మరచిపోయానని.

జాయ్ నన్ను హాస్పిటల్‌లో చూడడానికి రాలేదుగాని, అమ్మానాన్నల్ని, వికాస్-స్రవంతుల్ని కలిసి వాయిదా తీసుకుంటానని చెప్పాడట. తరువాత వెంటనే ఢిల్లీ వెళ్ళిపోవాలన్నాడట. తరువాత ఏం జరిగిందో నా మనస్థితి కారణంగా ఎవరూ చెప్పలేదు. ఇప్పుడు జరగబోయే విచారణకి ఈ కాగితాలన్నీ ఎందుకు కావాలని అడిగితే "మిమ్మల్ని చట్టబద్ధంగాను, ధర్మబద్ధంగాను గెలిపించే పూచీ నాది. దొంగ సాక్ష్యాలకి, అబద్ధాలకి ఇక్కడ తావులేదు. మిమ్మల్ని ఏదో బాధిస్తోంది. ఇప్పుడు నేనేం చెప్పినా మీకు ఎదారే కనిపిస్తుంది. నన్ను నమ్మండి.. నేను మీ తమ్ముణ్ణి.. మీకు వెన్నుపోటు పొడవను. ఇవ్వాళ్టికి రెస్టు తీసుకోండి. రేపొచ్చి కలుస్తాను" అని మాట దాటేసి, అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

అతని మాటలు నా చెవుల్లో ప్రతిధ్వనించాయి. నేను చేస్తున్న పని ఏమిటి? అన్యాయాక్రమాలని ఎదిరించి పోరాడడం, ఇప్పుడు నేనున్న పరిస్థితి ఏమిటి? నాకు ప్రమోషన్ అన్యాయం వలన రాలేదని నెర్వస్ బ్రేక్-డౌన్ అవడం. ఛీ, నామీద నాకే అసహ్యం వేసింది. కోర్టుకెక్కేటప్పుడు, రాముడు, కృష్ణుడూ కష్టాలనెదుర్కోలేదా, అని లెక్చర్లు కొట్టానే, ఇప్పుడేమయ్యిందా ధైర్యం? బలవంతులతో పెట్టుకునేటప్పుడు ఎదురు దెబ్బలు లేకుండానే విజయం వరి

# ఇది విన్నారా?



★ కప్పల చెవులనుబట్టి అవి ఆడకప్పలా, మగ కప్పలా తెలుసుకోవచ్చు. దాని కంటి కన్నా చెవి పెద్దదిగా ఉంటే, అది మగకప్ప. చెవి చిన్నదిగా ఉంటే అది ఆడకప్ప.

★ సంవత్సరానికొకసారి కప్ప నిద్రాణ స్థితిలోకి వెళుతుంది. ఆ స్థితిలో దాని ఎముకకు కొత్తగా పొర ఏర్పడుతుంది. అలాంటి పొరల సంఖ్యను బట్టి కప్ప వయసును కనుగొనవచ్చు.

## ఇది విన్నారా?



★ కప్పలు నోటి ద్వారా నీటిని తాగవు. చర్మం ద్వారా తడిని పీల్చుకుంటాయి.

★ కప్పల్లాంటి ఉభయచరాలను, సరీసృపాలను (పాకే పాములాంటి జంతువులను) అధ్యయనం చేసే శాస్త్రాన్ని 'హెర్పెటాలజీ' అంటారు!

★ కప్పలు కూడా పాముల్లా చర్మాన్ని విసర్జిస్తాయి. ఈ చర్యను మౌల్టింగ్ (కుబసం విడవడం) అంటారు. కొన్ని కప్పలు ప్రతిరోజూ కూడా ఈ పనిచేస్తాయి.

స్తుందా? ఆ రాముడూ, కృష్ణుడూ కూడా ఎదురు దెబ్బల పాలయ్యారు కదా? రాముడికి అరణ్య వాసం, భార్యావియోగం, కృష్ణుడికి ప్రాణగండాలు, అపనిందలు! మరి వాళ్ళు బాధతో కృంగిపోయారా? లేదే! అలాంటప్పుడు నేను చేస్తున్న పనేమైనా బాగుందా? ఒక గట్టి దెబ్బ తగిలేసరికి నరాల బలహీనత వచ్చి పడిపోతానా? అంటే, నన్నిలా దెబ్బకొట్టచ్చని నా ప్రత్యర్థులకి చెప్పకుండా చెప్పడమే కదా! నాలోని అంతఃశత్రువుని నేను జయించలేకపోయానే! మన స్వాతంత్ర్య సమరవీరులు వాళ్ళకున్నవన్నీ త్యాగం చేయలేదా? అలాంటిది, నేను నా ప్రమోషన్ గురించి ఇంత బెంగపెట్టుకుంటానా? ఎంత పెద్ద తప్పు చేశాను! రాముడు, కృష్ణుడు వాళ్ళకొచ్చిన కష్టాలను పరిష్కరించుకుని తద్వారా లోకకళ్యాణం చేశారు. అందుచేత, ఈలోగా నాకు వ్యక్తిగతంగా ఎటువంటి కష్టాలొచ్చినా, నా ఉద్యోగానికెసరొచ్చినా ఫర్వాలేదు. నేను వికలాంగుల సదుపాయాలకోసం పోరాడాలి. అంతే! ఆ నరాల డాక్టర్ ఏమన్నారు? నేను ఆరోగ్యంగా ఉంటేనే ప్రజాసేవ చేయగలను అని. మరి నేను భౌతికారోగ్యంతోబాటు మానసికారోగ్యం కూడా బాగు చేసుకోవాలి కదా! అప్పటికే ధ్యానం పుణ్యమా అని కొంత కోలుకున్నాను గనుక, ఇంత ఇబ్బందికరమైన ఆలోచనని తట్టుకోగలిగాను. వెంటనే, నా బుర్రలోని దుఃఖమనే మబ్బులు పశ్చాత్తాప వానగా నా కళ్లలోంచి కురిసి, సందిగ్ధపు ఉరుము-మెరుపుల్లో కొట్టుమిట్టాడుతున్న నా మనసుకు ప్రశాంతత నిచ్చాయి.

మరునాడు నన్ను కలిసినప్పుడు జాయ్ నన్ను చూసి, ఆశ్చర్యపోయాడు. నిన్న చూసిన ఏడుపు మొహం మాయమై, నా స్టైల్ 'పళ్ళనవ్వు' మొహం తిరిగి వచ్చినందుకు అప్పుడు ఆరోజు కోర్టులో ఏమయ్యిందో చెప్పాడు.

★ ★ ★

"యువర్ ఆనర్, ముందస్తు ఆమోదం లేకుండా నా క్లైంట్ కోర్టుకు వెళ్లారు గనుక, ప్రభుత్వం వారు ఆమెపై ప్రవర్తనా నియమావళి ఉల్లంఘనారోపణ చేసి, ఆమెపై క్రమశిక్షణా చర్యలు చేపట్టారు. ఆవిడకిచ్చిన ఛార్జ్‌షీట్ ఎందుకు చెల్లదో కారణాలు వివరిస్తూ ఆమె సకాలంలో బదులిచ్చినా, దానిపై స్పందించకుండా ఉండిపోయారు.

ఈ అలక్ష్యానికి పర్యవసానం - అసంపూర్తిగా ఉన్న క్రమశిక్షణా చర్య మూలంగా ఆవిడకు ఆ సమయానికి రావలసిన ప్రమోషన్ రాకపోవడం, ట్రైనింగ్‌లో ఫస్టు రాంక్ తెచ్చుకున్న సున్నిత మనస్కురాలైన ఆవిడ ఆ షాక్‌ని తట్టుకోలేక, నెర్వస్ బ్రేక్-డౌన్‌కి గురయ్యారు. ప్రస్తుతం సీసీ హాస్పిటల్స్‌లో చికిత్స పొందుతున్నారు. దీన్నిబట్టి ప్రభుత్వం వారు ఆమెపై కక్ష సాధిస్తున్నారని ప్రస్ఫుటంగా తెలుస్తోంది. ఆవిడ హాస్పిటల్లో చేరినట్లు, నరాల డాక్టర్ పర్యవేక్షణలో చికిత్స పొందుతున్నట్లు ఆధారాలివిగో! ఎటొచ్చీ, ఆవిడకిచ్చిన ఛార్జ్‌షీట్, ఆవిడ దాన్ని ఖండిస్తూ ఇచ్చిన సమాధానం ప్రభుత్వం ఆధీనంలో ఉన్నాయి. కాబట్టి, ఆ కాగితాలని ప్రస్తుతానికి వారికిమ్మని నిర్దేశించమని కోరుతున్నాను.

ప్రభుత్వంవారి వేధింపు ఈ ఛార్జ్‌షీట్‌తో ఆగలేదు. ఆవిడ కష్టపడే విధంగా లిఫ్టుని పనిచేయకుండా చేయడం, వికలాంగులకి చెందే నాలుగు రోజుల అదనపు విశేష సాధారణ సెలవు, అదే.. స్పెషల్ కాజువల్ లీవ్, ఆవిడకి దక్కనీయకపోవడం చేశారు. నా క్లైంట్ ఆరోగ్యం కుదుటపడినప్పుడు మీకు ఆ ఆధారాలివ్వగలను. అందుకని, ఈసారికి విచారణ వాయిదా వేయమని మనవి"

ప్రభుత్వ న్యాయవాది దానికడ్డు తగిలి "అర్జీదారురాలి న్యాయవాది న్యాయస్థానాన్ని తప్పుదోవ పట్టించాలని చూస్తున్నారు. ప్రభుత్వోద్యోగుల ప్రవర్తనా నియమావళి ప్రకారం ప్రభుత్వానికి వ్యతిరేకంగా ముందస్తు అనుమతి లేకుండా ఎవరైనా కోర్టుకెక్కితే ఆ ఉద్యోగిపై క్రమశిక్షణాచర్యలు తీసుకోబడతాయని స్పష్టంగా వ్రాసుంది. దానికి దాఖలా ఇదిగో!

ఆవిడ చేసిన తప్పుకి తగు చర్యలు తీసుకోబడ్డాయి. దానివల్ల ఆవిడ అనారోగ్యం పాలైతే దానికి ప్రభుత్వాన్ని తప్పుబట్టడం భావ్యం కాదు. వాళ్ళ క్లైంట్‌ని రక్షించడానికి ఆవిడకి ప్రమోషన్ రాకపోవడం, హాస్పిటల్లో చేరడంవంటి అసందర్భాలని కేసులోకి చొప్పింపజేస్తున్నారు. కేసులో పరిష్కారం అవ్వాల్సిన విషయం ప్రభుత్వ ఆఫీసుల్లో వికలాంగుల రాకపోకలకి, ప్రకృతి పిలుపులకి తగు సదుపాయాలని కల్పించడం. దానికీ, ఇందాక వకీలు గారు చేసిన వాదనకీ ఎటువంటి సంబంధమూ లేదు. అందువల్ల ఈ వాయిదాని ఒప్పుకోవద్దని, కేసుని ఎక్స్ పార్టీగా విచారించాలని మనవి" అన్నారట.

**- ఇంకా వుంది**

# పురాణాల్లో చిన్న కథలు
కథ, బొమ్మలు - భగవత్

# మహావీర కర్ణ

9


















# యోడంగ్

-స్వర్ణలత










కొండల్లో గుహలుంటాయని అందరికీ తెలిసిన విషయమే. కానీ రాతి, మట్టికొండల్ని గుహల్లా తొలిచి వాటిలో ఇళ్ళను కట్టేసుకుంటున్నారు చైనీయులు. ఇలాంటివి ఓ పదో, వందో అయితే ఏమోలే అనుకోవచ్చు. క్రీస్తుపూర్వం రెండువేల ఏళ్ళనాటి నుంచి ఈనాటి వరకు అలాంటి నిర్మాణాలు చైనా ఉత్తర ప్రాంతపు కాస్గర్, డున్హంగ్, తుర్ఫాన్ ప్రాంతాల్లో జరుగుతూనే ఉన్నాయి. ఒక్కో ఇంటిలో కనీసం 3, 4 గదులన్నా ఉంటాయి. వీటిల్లో విలాస



వంతమైన అపార్ట్‌మెంట్లు కూడా ఉన్నాయి. అయితే ఒక్కో కొండ ఒక కాలనీలాగా రూపాంతరం చెందుతుందన్నమాట. ఇటువంటి ఇంటినే 'యోడంగ్' అంటారు. ఇవి మన అపార్ట్‌మెంట్లలా కొండ సైజునిబట్టి ఎన్నో అంతస్తుల్లో ఉంటాయి.

ఈ ఇళ్లకు ద్వారాలు, తలుపులు, కిటికీలు ఉంటాయి. రాతి గుహల ఇళ్లు స్థిరంగా, భద్రంగా ఉంటాయి గాని మట్టి గుహల ఇళ్లు కూలిపోకుండా ఉంటాయా అని సందేహించక్కర్లేదు. ఎందుకంటే వాటికి ఇటుకల గోడలు కట్టి సపోర్టిస్తారు. రాతివైనా, మట్టివైనా ఈ ఇళ్లల్లో వేసవిలో చల్లగానూ, శీతాకాలంలో వెచ్చగానూ ఉంటాయి. కాబట్టి వీళ్ళకి కరెంట్ ఖర్చు తక్కువే.

ఒక్కో గది సుమారు 9 అడుగుల చతురస్రాకారంలో ఉంటుంది. కుక్కల్ని, పిల్లుల్ని











పెంచుకోవటానికి ప్రత్యేకమైన ఏర్పాటుంటాయి ఈ ఇళ్ళల్లో. ఇలాంటి యోడంగ్‌లలో సుమారు 4 కోట్లమంది నివసిస్తున్నారంటే నిజంగా ఇది ఒక చిత్ర ప్రపంచమే కదా! ★





# పదబంధ పారిజాతం

## 53

ఆల్‌కరెక్టు జవాబులు రాసినవారిపేర్లు 21-12-2017 సంచికలో ప్రచురిస్తాం.

ఇక్కడ ఇచ్చిన ఆధారాలనుబట్టి కూపన్‌లోని గడులలోనే సమాధానాలు నింపి కత్తిరించి

**పదబంధ పారిజాతం**
ఆంధ్రభూమి సచిత్ర వార పత్రిక
36, సరోజినీదేవి రోడ్
సికిందరాబాద్-500003 అనే
చిరునామాకు పంపాలి.

కూర్పు: సుధామ

### పదబంధ పారిజాతం-53



పేరు :------------------------------------------------------------

ఊరు :------------------------------------------------------------

**పదబంధ పారిజాతం -53 కూపన్‌లు పంపించడానికి ఆఖరు తేదీ : 1-12-2017.**

## ఆధారాలు

### అడ్డం

1. చాయ్ (3)
3. పెళ్ళీడుకొచ్చిన ఈమె ఒకప్పుడు గుండెలమీద కుంపటి అనుకునేవారు (3)
5. తెమ్మెర మధ్యలో తీసివేయ.. తీయగరాదా! (2)
7. దట్టంగా వేయబడిన ముడి (4)
8. ఆపద (3)
10. మాట్లాడకుండా ఉండటం! (2)
13. జీళ్ళు కారే రసం! (4)
15. లాయర్, డాక్టర్ ఫీజు పుచ్చుకునే ఇస్తారు (3)
16. అత్తకొడుకు (2)
18. గదిపై మూలలకు పట్టే దీన్ని దులుపుకుంటూండాలి! (2)
19. లోలోపల దుఃఖించు, రగులు (3)
20. భర్త (3)

### నిలువు

2. స్నానము చేయు (3)
4. అరిమేదము తాలూకు కంటకము (4)
5. ధవళ వస్త్రము (4)
6. గోచీ (3)
9. బంగారం (3)
10. ముత్యము (3)
11. పద్య పాదాల్లో రెండవ అక్షరం (2)
12. చక్రవర్తి, కవి, కథకుడు దేవరాజు.. (4)
13. బ్రతుకు (4)
14. ఇరవై అయిదు (3)
17. హ్రదము (3)

పదబంధ పారిజాతం-50 ఫలితాలు 80వ పేజీలో



**కర్కాటకంలో రాహువు, తులలో బృహస్పతి, కుజుడు, వృశ్చికంలో రవి, శుక్రులు, ధనుస్సులో శని, బుధులు, మకరంలో కేతువు, మీన, మేష, వృషభ, మిథునంలలో చంద్రుడు. 3వ తేదీ నుంచి బుధుని వక్రమారంభం.**

# గ్రహవాణి

## 30-11-2017 నుంచి 06-12-2017 వరకు

డా.పి.ఎ.రామన్

**మేషం: అశ్వని, భరణి, కృత్తిక 1వ పాదం**

ఆదాయ వ్యయాలకు పొంతన ఉండదు. దుబారా ఖర్చులు విపరీతం. చేతిలో ధనం నిలబడదు. గురు, శుక్ర వారాల్లో వాగ్వాదాలు, పంతాలకు పోవద్దు. కుటుంబ విషయాల పట్ల శ్రద్ధ అవసరం. బాధ్యతలు స్వయంగా చూసుకోవాలి. ఆంతరంగిక విషయాలు గోప్యంగా ఉంచండి. అయినవారితో సంప్రదింపులు జరుపుతారు. వ్యాపారాల్లో స్వల్ప చికాకులు మినహా ఇబ్బందులుండవు. ఉద్యోగస్తులకు ఏకాగ్రత ప్రధానం. అధికారుల తీరును గమనించి మెలగండి. వృత్తి ఉపాధి పథకాలు సామాన్యంగా సాగుతాయి. 5, 6 తేదీలలో జయం పొందుతారు.



**వృషభం: కృత్తిక 2, 3, 4 పాదాలు, రోహిణి, మృగశిర 1, 2 పాదాలు**

కష్టపడినా ఫలితం అంతంత మాత్రమే. ఎదుటివారి వ్యాఖ్యలు ఆలోచింప చేస్తాయి. స్థిమితంగా ఉండటానికి యత్నించండి. త్వరలో శుభవార్త వింటారు. శని, ఆది వారాల్లో పరిచయం లేని వారితో జాగ్రత్త. నమ్మకస్తులే తప్పుదారి పట్టించేందుకు యత్నిస్తారు. ఖర్చులు అధికం, ప్రయోజనకరం. వృత్తులవారికి సామాన్యం. వ్యాపారాల్లో ఆటంకాలను దీటుగా ఎదుర్కొంటారు. పారిశ్రామికవేత్తలకు కొత్త చికాకులెదురవుతాయి. స్టాక్ మార్కెట్ రంగాల వారికి మిశ్రమ ఫలితం. విద్యార్థులకు అత్యుత్సాహం తగదు. 3, 4 తేదీలు శుభదాయకం.



**మిథునం: మృగశిర 3, 4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పాదాలు**

ఆలోచనలు కార్యరూపం దాల్చుతాయి. వేడుకలకు సన్నాహాలు సాగిస్తారు. ఒత్తిడి, మొహమాటాలకు పోవద్దు. ఆశ్చర్యకరమైన సంఘటనలెదురవుతాయి. ప్రముఖుల ఇంటర్వ్యూ కోసం పడిగాపులు తప్పవు. విలువైన వస్తువులు, నగదు జాగ్రత్త. సోమ, మంగళ వారాల్లో ప్రతి విషయం క్షుణ్ణంగా గుర్తుంచుకోండి. వృత్తుల వారికి అవకాశాలు కలిసి వస్తాయి. ఉద్యోగస్తులకు యూనియన్ వ్యవహారాలతో తీరిక ఉండదు. వస్త్ర, ఫ్యాన్సీ, పచారీ వ్యాపారులకు పురోభివృద్ధి. టెండర్లు, భాగస్వామ్యం, ఏజెన్సీలు అనుకూలిస్తాయి. 30, 1 తేదీలు అనుకూలిస్తాయి.



**కర్కాటకం: పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

కృషి ఫలిస్తుంది. అవకాశాలు కలిసి వస్తాయి. మీ సమర్థతను చాటుకుంటారు. ఎదుటివారి అభిప్రాయాలకు విలువ ఇవ్వండి. విలువైనవి కొనుగోలు చేస్తారు. బుధవారంనాడు సందేశాలు, ప్రకటనలను విశ్వసించవద్దు. వ్యాపారాలు ఊపందుకుంటాయి. నష్టాలను భర్తీ చేసుకుంటారు. పెద్ద మొత్తం సరుకు నిల్వలో జాగ్రత్త వహించాలి. ఉద్యోగస్తులకు ఉపశమనం లభిస్తుంది. సహోద్యోగులతో ఉల్లాసంగా గడుపుతారు. వృత్తుల వారికి సామాన్యం. విద్యార్థులు పోటీల్లో రాణిస్తారు. 1, 2 తేదీలలో జయం పొందుతారు.



**సింహం: మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

మనోధైర్యంతో ముందుకు సాగుతారు. కొత్త పరిచయాలేర్పడతాయి. ఆలోచనల్లో మార్పు వస్తుంది. గురు, శుక్ర వారాల్లో ఖర్చులు అంచనాలను మించుతాయి. చేతిలో ధనం నిలబడదు. దంపతుల మధ్య అపోహలు తలెత్తుతాయి. సౌమ్యంగా సమస్యలు పరిష్కరించుకోవాలి. చిరువ్యాపారులకు ఆదాయాభివృద్ధి. ఉద్యోగస్తుల కృషి ఫలిస్తుంది. అధికారులకు ధన ప్రలోభం తగదు. వృత్తి నైపుణ్యం మెరుగుపడుతుంది. బెట్టింగ్‌లు, జూదాల వల్ల చికాకులు తప్పవు. 4, 5 తేదీలలో సంతృప్తికానవస్తుంది.



**కన్య: ఉత్తర 2, 3, 4 పాదాలు, హస్త, చిత్త 1, 2 పాదాలు**

వ్యవహార దక్షతతో రాణిస్తారు. రావలసిన ధనం అందుతుంది. యత్నాలు ప్రోత్సాహకరంగా సాగుతాయి. ఖర్చులు అధికం, ప్రయోజనకరం. పనులు, బాధ్యతలు అప్పగించవద్దు. శని, ఆది వారాల్లో ప్రతి వ్యవహారం స్వయంగా చూసుకోవాలి. పదవులు, బాధ్యతలు స్వీకరిస్తారు. ఉద్యోగస్తులు అధికారులను ప్రసన్నం చేసుకుంటారు. ఆశాదృక్పథంతో ఉద్యోగయత్నం సాగించండి. షాపు పనివారలతో జాగ్రత్త. హోల్‌సేల్ వ్యాపారులకు సామాన్యం. దైవ, పుణ్య కార్యాల్లో పాల్గొంటారు. 30, 1 తేదీలు శుభదాయకం.



**తుల: చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు**

ఆలోచనలు నిలకడగా ఉండవు. ప్రతి చిన్న విషయానికి ఆందోళన చెందుతారు. ఆత్మీయుల హితవు మీపై మంచి ప్రభావం చూపుతుంది. ఖర్చులు అధికం. శుక్ర, మంగళ వారాల్లో పనుల సానుకూలతకు మరింతగా శ్రమించాలి. సర్దుబాటు ధోరణితో కొన్ని సమస్యలు పరిష్కారమవుతాయి. దంపతుల మధ్య అవగాహన నెలకొంటుంది. సంతానం గురించి ఆలోచిస్తారు. ఉద్యోగ బాధ్యతల్లో తప్పులు దొర్లే ఆస్కారం ఉంది. అధికారులకు వివరణ ఇచ్చుకుంటారు. వ్యాపారాలు లాభసాటిగా సాగుతాయి. పర్మిట్లు, లైసెన్సుల పునరుద్ధరణలో జాప్యం తగదు. 4, 6 తేదీలు అనుకూలించగలవు.



**వృశ్చికం: విశాఖ 4వ పాదం. అనూరాధ, జ్యేష్ఠ**

తప్పటడుగు వేసే ఆస్కారం ఉంది. స్థిమితంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. ఏకపక్షంగా వ్యవహరించవద్దు. ఆకస్మికంగా కొన్ని పనులు పూర్తవుతాయి. ఆదాయ వ్యయాలకు పొంతన ఉండదు. ఆది, బుధ వారాల్లో ధనమూలక సమస్యలెదురవుతాయి. అవసరాలు వాయిదా పడతాయి. ఓర్పుతో వ్యవహరించాలి. చిన్ననాటి ఉపాధ్యాయులను కలుసుకుంటారు. గత అనుభవాలు జ్ఞప్తికొస్తాయి. విందులు, వినోదాల్లో పాల్గొంటారు. మీ బలహీనతలు అదుపులో ఉంచుకోండి. వ్యాపారాలు లాభసాటిగా సాగుతాయి. గృహ మార్పు కలిసి వస్తుంది. 30, 1 తేదీలలో పురోభివృద్ధి.



**ధనుస్సు: మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**



కొన్ని విషయాలు అనుకున్నట్టే జరుగుతాయి. రావలసిన ధనం అందక ఇబ్బందు లెదుర్కుంటారు. ఆది, బుధ వారాల్లో పనులు అస్తవ్యస్తంగా సాగుతాయి. ఇబ్బం దులు, చికాకులు తాత్కాలికమేనని గ్రహించండి. త్వరలో మీ కృషి ఫలి స్తుంది. గృహంలో ప్రశాంతత నెలకొంటుంది. బాధ్యతలు అప్పగించ వద్దు. పూర్వ విద్యార్థులను కలుసుకుంటారు. వ్యాపారాలు ఊపందు కుంటాయి. భాగస్వామిక చర్చలు కొలిక్కి వస్తాయి. నిరుద్యోగులకు ఉద్యోగయోగం. సాంకేతిక రంగాల వారికి ఆశాజనకం. 2, 3 తేదీలలో జయం పొందుతారు.

**కుంభం: ధనిష్ఠ 3, 4 పాదాలు, శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు**



ఈవారం ఆర్థిక లావాదేవీలు లాభిస్తాయి. కొంత మొత్తం ధనం అందుతుంది. వాహనం, విలువైన వస్తువులు అమర్చుకుంటారు. కీలక పత్రాలు, నగదు జాగ్రత్త. బ్యాంకు వివరాలు వెల్లడించవద్దు. పదవులు, సభ్యత్వాలకు యత్నాలు సాగి స్తారు. సంతానం వైఖరి ఇబ్బంది కలిగిస్తుంది. వ్యాపారాలు ఊపందు కుంటాయి. ఆకర్షణీయమైన పథకాలు రూపొందిస్తారు. ఉద్యోగస్తుల కార్యక్రమాలు ప్రశాంతంగా సాగుతాయి. నిరుద్యోగులకు ఉపాధి శిక్షణ లభిస్తుంది. సామాజిక కార్యక్రమాల్లో పాల్గొంటారు. ప్రయాణానికి అను కూలం. 30, 6 తేదీలు కలిసి రాగలదు.

**మకరం: ఉత్తరాషాఢ 2, 3, 4 పాదాలు, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పాదాలు**



ధనలాభం, వ్యవహార జయం పొందుతారు. రుణబాధలు తొలుగుతాయి. సకా లంలో చెల్లింపులు జరుపుతారు. పనులు చురుకుగా సాగుతాయి. వేడుకలకు సన్నా హాలు సాగిస్తారు. కార్యక్రమాలు వాయిదా వేసుకుంటారు. వ్యాపారాభివృ ద్ధికి పథకాలు అమలు చేస్తారు. హోల్‌సేల్ వ్యాపారులకు ఆదాయాభి వృద్ధి. పారిశ్రామికవేత్తలకు అనుమతులు, వనరులు మంజూరవుతాయి. ఉద్యోగ ప్రకటనల పట్ల అవగాహన ప్రధానం. తొందరపడి చెల్లింపులు జరుపవద్దు. అధికారులకు అదనపు బాధ్యతలు, పనిభారం. 4, 5 తేదీలు అనుకూలిస్తాయి.

**మీనం: పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**



కార్యసాధనకు అవిశ్రాంతంగా శ్రమిస్తారు. ఆదాయ వ్యయాలు సంతృప్తికరం. పొదుపు పథకాలకు అనుకూలం. బంధుమిత్రుల సహాయం అర్థిస్తారు. మీ వ్యతిరేక తను సున్నితంగా వ్యక్తం చేయండి. పనులు హడావుడిగా సాగుతాయి. సన్ని హితులతో సంప్రదింపులు జరుపుతారు. ఉద్యోగ బాధ్యతల్లో ఏకాగ్రత వహించండి. ఆటంకాలను దీటుగా ఎదుర్కుంటారు. షాపుల స్థల మార్పు కలిసి వస్తుంది. ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో పాల్గొంటారు. విద్యా ర్థులు పోటీల్లో రాణిస్తారు. 4, 5 తేదీలు అన్ని విధాలా అనుకూలం. ○

## సమస్య - సమాధానం

**ఎం.ఉషాదేవి** (విశాఖపట్నం)

వివాహం, ఉద్యోగం గురించి తెలుపగలరు?

★ మీరు పంచమి, శనివారం, ధనుర్లగ్నం, కృత్తికానక్షత్రం, వృషభరాశిలో జన్మించారు. రాజ్యస్థానంలో రవి, బుధ, కుజులు ఉన్నందువల్ల 2018లో మీ అభి వృద్ధికి మంచి అవకాశాలు లభిస్తాయి. సద్వినియోగం చేసుకోండి. 2018 లేక 2019లో ఆకస్మికంగా వివాహం అవుతుంది. వివాహ విషయంలో జాతక పరిశీ లన చాలా అవసరమని గమనించగలరు. ఆదిత్యుని ఆరాధించిన సర్వదా పురోభి వృద్ధి కానవస్తుంది. 2010 నుంచి రాహుమహర్దశ ప్రారంభం అయింది. ఈ రాహువు 2019 నుంచి 2025 వరకు సత్ఫలితాలను ఇస్తుంది. 2019 వరకు అష్టమ శనిదోషం ఉన్నందువల్ల నెలకు ఒక శనివారం నాడు శనికి తైలాభిషేకం చేయించిన శుభం కలుగుతుంది. ఉద్యానవనాల్లో ఉసిరి మొక్కను నాటిన సర్వదో షాలు తొలగుతాయి.

**కె.స్వరలయ** (చీరాల)

వివాహం గురించి తెలుపగలరు.

★ మీరు చవితి, గురువారం, మిథునలగ్నం, జ్యేష్ఠనక్షత్రం, వృశ్చికరాశిలో జన్మించారు. 2019 వరకు ఏలినాటి శనిదోషం ఉన్నందువల్ల మంచి అవకాశాలు చేజారిపోవడం, నిరుత్సాహం, ఆందోళన వంటివి ఎదుర్కొంటారు. 2018 మే తదుపరి మీకు మంచి మంచి అవకాశాలు లభిస్తాయి. 2018 లేక 2019లో ఆక స్మికంగా వివాహం అవుతుంది. వివాహ విషయంలో తొందరపాటు మంచిది కాదని గమనించండి. 2005 నుంచి శుక్రమహర్దశ ప్రారంభం అయింది. ఈ శుక్రుడు 2018 నుంచి 2025 వరకు సత్ఫలితాలను ఇస్తాడు. దేవాలయాల్లో కొబ్బరి మొక్కను నాటిన కలిసిరాగలదు.

**జి.సూర్యప్రకాశ్‌రావు** (నర్సాపురం)

నూతన గృహనిర్మాణం ఎప్పటికి పూర్తవుతుంది?

★ మీరు అమావాస్య, గురువారం, వృశ్చికలగ్నం, అనూరాధ నక్షత్రం, వృశ్చి కరాశిలో జన్మించారు. 2019 వరకు ఏలినాటి శనిదోషం అధికంగా ఉన్నందువల్ల తలపెట్టిన పనుల్లో ఆటం కాలు, ఒత్తిడి, చికాకు, ఆందోళన వంటివి ఎదుర్కొంటారు. 2019లో స్థిరాస్తులు అభివృద్ధి చేస్తారు. నెలకు ఒక శనివారం నాడు 19సార్లు నవగ్రహ ప్రదక్షిణ చేసి, నీలపు శంకుపూలతో శనిని పూజించిన దోషాలు తొల గుతాయి. ఉద్యానవనాల్లో పొగడ మొక్కను నాటిన కలిసిరాగలదు. ఈశ్వరుని ఆరాధన వల్ల సర్వదా శుభం కలుగుతుంది. ★

### సమస్యలు -సమాధానాలు

పాఠకుల వ్యక్తిగత సమస్యలకు డా.పి.ఎ.రామన్ పత్రికాముఖంగా సమా ధానాలను ఇస్తారని తెలియచేయడానికి సంతోషిస్తున్నాము. మీ ప్రశ్నలను ఇక్కడ ఇచ్చిన కూపన్‌లో పేర్కొన్న వివరాలతోపాటు రాసి కవరులో పెట్టి దిగువ ఇచ్చిన చిరునామాకు పంపించగలరు.

కూపన్

డా.పి.ఎ.రామన్
శివరావు స్ట్రీట్, సత్యనారాయణపురం,
విజయవాడ-520011

పేరు :......................................................

పుట్టిన తేదీ :......................................................

పుట్టిన సమయం :......................................................

పుట్టిన ఊరు :......................................................

జన్మనక్షత్రం :......................................................

ప్రశ్న (క్లుప్తంగా రెండు వాక్యాల్లో) :......................................................

......................................................

ఫోన్ నంబర్ :......................................................

## పదబంధ పారిజాతం - 50కి గడువుతేదీలోగా ఆల్‌కరెక్టు సమాధానాలు రాసినవారు 129 మంది.

అనంతుల సుబ్బారావు (గుంటూరు) వి.సుగుణ (నెల్లూరు) ఎస్.టి.పి.కృష్ణమాచార్యులు (హైదరాబాద్) ఎన్.సత్యనాగేష్ (హైదరాబాద్) అన్నంరాజు పూర్ణచంద్రరావు (సాయినగర్) టి.ఆర్.బాలకృష్ణారావు (రాజమహేంద్రవరం) కర్రి ఝాన్సీ (హైదరాబాద్) బత్తుల యాదగిరి (హైదరాబాద్) వి.సంధ్యారాణీ అశోక్ (పాత బోయినపల్లి) వేలూరి దుర్గ (పాత బోయినపల్లి) జి.రఘునాధాచార్యులు (పోచంపాడు) జి.సుధారాణి (మిర్యాలగూడ) ఎస్.ఎస్.భారతీదేవి (షాపూర్‌నగర్) కె.సత్యప్రకాశరావు (కొండాపూర్) జి.విశ్వేశ్వరరావు (నానక్‌రామ్‌గూడ) బి.నరసింహనాయుడు (జగద్గిరిగుట్ట) ఎం.వి.ఎస్.హారిక (మాదాపూర్) సి.ఈశ్వరరావు (పటాన్‌చెరు) వి.ఆర్.విమల (శంషాబాద్) ఎన్.సుశీలాదేవి (మాదాపూర్) కె.సుదర్శనరావు (మేడ్చల్) ఆర్.మల్లిక (నిజాంపేట) టి.మనోహర్ (జగద్గిరిగుట్ట) ఎస్.ధనుంజయరావు (హైటెక్ సిటీ) ఆర్.వి.సుబ్రహ్మణ్యం (కాజీపేట) కె.ఎస్.హరనాధరావు (నిజామాబాద్) కోనా శ్రీప్రియ (విశాఖపట్నం) కె.విద్యావతి (కొయ్యలగూడెం) ఎం.ఎం.గౌతమీ మీనన్ (చెన్నయ్) కె.హరీష్‌రెడ్డి (మహబూబ్‌నగర్) ఎన్.మాలతి (రాజాం) ఎన్.స్వరూప (కాకినాడ) డి.వరహాలరావు (బాపట్ల) కె.మీనాకుమారి (ఆదిలాబాద్) వి.ఆర్.శేషగిరి (చెన్నయ్) పి.ధరణి (కర్నూలు) జి.బాలసుబ్రహ్మణ్యం (విశాఖపట్నం) డి.హరనాథ్ (నెల్లూరు) ఎ.దుర్గాభవాని (కోదాడ) పి.బాలసుబ్రహ్మణ్యం (చెన్నయ్) కె.మంగతాయారు (రాయగడ) వి.రమణమూర్తి (కోదాడ) డి.లక్ష్మీసువర్చల (జంగారెడ్డిగూడెం) పి.కృష్ణకుమారి (విశాఖపట్నం) కె.జానకీరాణి (శ్రీకాకుళం) కె.ప్రియదర్శిని (రాజానగరం) కె.శ్రీనివాసులు (హైదరాబాద్) కె.లక్ష్మారెడ్డి (నెల్లూరు) పి.రంగనాథ్ (భీమడోలు) జి.కృష్ణవేణి (రాజమండ్రి) జి.హరిత (విజయనగరం) వి.అహల్య (రాజోలు) ఆర్.జానకీరాణి (రాజాం) పి.భావన (హైదరాబాద్) కె.మాలిని (గుడివాడ) ఎ.సౌమ్య (రాయగడ) సిహెచ్.రాజేశ్వరి (విజయవాడ) ఎస్.రాఘవయ్య (రాజమండ్రి) జె.సుజాత (చెన్నయ్) వి.విజయలక్ష్మి (భీమవరం) కె.లలితాప్రియదర్శిని (నిజామాబాద్) మొక్కపాటి రామయ్య (విజయనగరం) కొవ్వాడ మూర్తి (భీమవరం) పి.వి.శ్రీకర్ (తాడేపల్లిగూడెం) ఆర్.రామారావు (జగ్గంపేట) జె.సోమసుందరం (రాజోలు) కె.లతాదేవి (తుని) ఎం.ఐశ్వర్య (ధవళేశ్వరం) వినుకొండ లక్ష్మీనారాయణ (విజయనగరం) సి.పల్లవి (రాజవొమ్మంగి) వై.వి.కల్యాణి (విశాఖపట్నం) పి.వెంకటస్వామి (సాలూరు) ఎస్.సుబ్రహ్మణ్యం (రావులపాలెం) జి.వి.రామలక్ష్మి (వెంకటాపురం) డి.సూర్యకుమార్ (కొత్తపేట) ఎం.వి.భాస్కరాచారి (విజయవాడ) ఆర్.వెంకటరత్నం నాయుడు (నిజామాబాద్) జె.సి.వాసంతి (హనుమకొండ) కె.వి.ఆనందరావు (ఖమ్మం) జి.సరస్వతి (కొయ్యలగూడెం) పి.వి.బలరామకృష్ణయ్య (సాలూరు) ఎస్.వరలక్ష్మి (చెన్నయ్) ఎం.వి.ఎస్.అమరనాధరెడ్డి (తిరుపతి) వి.ఎస్.కరుణకుమారి (ఆముదాలవలస) బి.ఎస్.ముకుందరావు (విజయవాడ) డి.చైతన్య (వరంగల్) ఎస్.ఎస్.లావణ్య (జంగారెడ్డిగూడెం) ఎం.దినేష్‌రెడ్డి (విజయనగరం) సి.ఎస్.మాధురి (భీమునిపట్నం) ఎస్.వి.కిరణ్మయి (మాదాపూర్) పి.గిరిజారాణి (మిర్యాలగూడ) ఎం.ధనుంజయరెడ్డి (కాజీపేట) పి.వినోద్‌కుమార్ (నెల్లూరు) కె.ఎస్.మానస (బరంపురం) ఆర్.వి.కమలాకర్ (నిడదవోలు) వై.లావణ్య (భద్రాచలం) ఎస్.అనంతరామ్ (మల్లాపూర్) టి.వి.శేఖర్‌బాబు (ఖమ్మం) ఆనం సత్యనారాయణమూర్తి (కాజీపేట) ఆర్.విజయ్‌కుమార్

## పదబంధ పారిజాతం - 50 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 నా | 2 గు | ల | 3 చ | వి | 4 త్రి | | 5 తె |
| 6 అ | | న | | ల్ల | | 7 రో | మ | ము |
| వ | | 8 ప | ద్యం | | 9 బెం | గ | | లు |
| 10 స్థ | 11 ల | ము | | 12 మ | | 13 త్రి | 14 రి | |
| | క్క | | 15 తూ | నీ | గ | | 16 వా | ర్థా |
| 17 ద | యి | త | | షి | | 18 రో | జు | |
| | ల్లు | | 19 వ | | 20 కా | జా | | 21 గ |
| 22 వం | | 23 ఆ | హ్వా | న | ము | | 24 మ | ర |
| 25 దే | వ | దా | | | 26 కి | టి | | ళం |

(తెనాలి) పి.శేషాచలపతిరావు (భీమవరం) బి.నాగలక్ష్మీకుమారి (తెనాలి) టి.శ్రీనివాస దీక్షిత్ (తిరుపతి) ఆర్.శేషాద్రి (గుంటూరు) జి.కె.మాధవి (హనుమకొండ) ఆర్.పురుషోత్తమరావు (నంద్యాల) జె.నారాయణస్వామి (ఒంగోలు) జి.మనోహర్ నాయుడు (బాలాపూర్) ఆర్.శైలజ (కాజీపేట) పి.రవీంద్రకుమార్ (బాలాపూర్) ఎస్.అలివేలు (తెనాలి) ఆర్.సంధ్య (కోరుకొండ) ఎస్.వైదేహి (తుని) ఎం.ఎస్.సులోచన (కొత్తగూడెం) పి.ఎస్.మురళీమోహన్‌రెడ్డి (కొయ్యలగూడెం) ఎం.రోహిణి (భద్రాచలం) కె.వైశాలి (తాడేపల్లిగూడెం) ఎం.సుచిత్ర (మాదాపూర్) కె.హనుమంతరావు (చెన్నయ్) ఎస్.ప్రభావతి (విశాఖపట్నం) వై.శివశంకర్ (మేడ్చల్) పి.అనసూయ (చెన్నయ్) ఎస్.వి.రేణుకారాణి (శంషాబాద్) బి.కె.ఈశ్వర్ కుమార్ (తాడేపల్లిగూడెం) ఆర్.జె.చలపతిరావు (కాజీపేట) అడపా సత్యనారాయణ బాబ్జీ (నిజాంపేట) కొమ్మూరి జానకీదేవి (మదీనాగూడ) సి.రాజేశ్వరి (హైదరాబాద్) చిల్లర సీతారామారావు (వనస్థలిపురం).



# శీతాకాలం స్పెషల్ చట్నీస్

-పి.రాధ (హైదరాబాద్)




మనం కొన్నిరకాల పచ్చళ్లను శీతాకాలంలోనే చేసుకోవాలి. కొన్ని రకాల కాయలు మనకు శీతాకాలంలోనే దొరుకుతాయి. మనం వీటితో నిల్వ పచ్చళ్ళు పెట్టుకుంటాము. ఇవి ఆరేడు నెలలు నిల్వ వుంటాయి. వీటిద్వారా మనకు ఎ, సి విటమిన్స్ ఎక్కువగా లభిస్తాయి. ఈ కోవలో ఉసిరి, వెలగ పండు, పండుమిరప, చింతకాయ, నిమ్మ, అల్లంతో వెరైటీ చట్నీస్‌గా చేసుకుని నిలవపెట్టుకోవచ్చు ను. వాటిలో కొన్ని ఇప్పుడు చూద్దాం

## పండుమిరపతో...

### కావలసినవి

పండుమిరప - అరకిలో, ఉప్పు - ఒక కప్పు, మెంతులు - అరకప్పు, చింతపండు - పావుకిలో, ఆవాలు - 2 చెంచాలు, ఇంగువ - 2 చెంచాలు, నూనె - 2 కప్పులు.

### తయారుచేసే విధానం

ముందుగా పండుమిరపకాయలను కడిగి, బాగా ఆరబెట్టి, ఉప్పు, పసుపు వేసి, గ్రైండ్ చేసి, చింతపండుని అందులో పెట్టి, ఓ రెండు రోజులు ఊరనిచ్చి, మెత్తగా గ్రైండ్ చేసి, ఒక బౌలులోకి తీసి పెట్టాలి. మెంతులను వేయించి, పొడి చేసి, అందులో వేసి, బాగా కలిపి నూనె వేడి చేసి, అందులో ఆవాలు, ఇంగువ వేసి, ఆ నూనె పచ్చడిలో వేసి బాగా కలిపి, అప్పుడు గట్టిమూతవున్న జాడిలో పెట్టి ఉంచాలి. ఇది ఓ ఆరునెలలు బావుంటుంది. రుచిగా బావుంటుంది. దీనికి తడి తగలకూడదు.

## అల్లం ఊరగాయ

### కావలసినవి

అల్లం - అరకేజి, ఎండుమిరప - 100 గ్రాములు, చింతపండు - 150 గ్రాములు, మెంతులు - 2 చెంచాలు, ఆవాలు - 3 చెంచాలు, సెనగపప్పు- 3 చెంచాలు, పసుపు - 1 చెంచా, ఉప్పు - 1 కప్పు, నూనె - ఒకటిన్నర కప్పు, బెల్లం తురుము - అర కప్పు, ఇంగువ - ఒక చెంచా.

### తయారుచేసే విధానం

ముందుగా అల్లాన్ని బాగా కడిగి, చిన్న చిన్న ముక్కలు చేసి, కొంచెంసేపు ఎండపెట్టాలి. చింతపండుని బాగా గుజ్జు తీసి ఉడికించి పెట్టాలి. కొంచెం నూనె వేడి చేసి, అల్లం ముక్కలు వేయించి, పక్కన పెట్టాలి. ఇప్పుడు కొంచెం నూనెలో పోపుగింజలు వేసి, వేయించి మిరపకాయలు కూడా వేసి వేయించి, అన్నింటిని పొడి చేసి, అందులో అల్లం, ఉప్పు, పసుపువేసి గ్రైండ్ చేయాలి. తరువాత బెల్లం, చింతపండు గుజ్జు వేసి, బాగా మెత్తగా గ్రైండ్ చేయాలి. దీనిని బౌలులో వేసి, నూనె వేడి చేసి కొంచెం మినపప్పు, ఆవాలు, ఇంగువ వేసి వేయించి, పచ్చడిలో వేయాలి. దీని రుచి ఎంతో బావుంటుంది. ఇది అన్నంలోకే కాక, ఇడ్లీ, దోసె, వడ, ఊతప్పం వీటిలోకి చాలా బావుంటుంది.



## వెలగపండు చట్నీ

### కావలసినవి

వెలగపండు గుజ్జు - ఒకటిన్నర కప్పు, ఎండుమిరప - 100 గ్రాములు, మెంతులు - ఒక చెంచా, ఆవాలు - 2 చెంచాలు, నూనె - అర కప్పు, ఇంగువ - 1 చెంచా.

### తయారుచేసే విధానం

ముందుగా కొంచెం దోరగా, కొంచెం పండుగా ఉన్న వెలగ కాయని తీసుకుని, లోపలి గుజ్జుని తీసి ఒక బౌలులో వేసుకోవాలి. పోపుగింజలకు సరిపడా నూనె వేడి చేసుకుని, పోపుగింజలు, మిరపని వేయించి, పొడిచేయాలి. అందులో తగినంత ఉప్పువేసి, పసుపు కూడా వేసి, గుజ్జుని వేసి, మెత్తగా గ్రైండ్ చేయాలి. దీనికి నీరు తగలకుండా



చూడాలి. ఈ మిశ్రమాన్ని ఒక గిన్నెలోవేసి, మిగతా నూనె వేడిచేసి, ఇంగువ వేపి, ఈ పచ్చడిలోవేసి, బాగా కలిపిపెట్టుకోవాలి. దీనిని మనం వేడి వేడి అన్నంలో వేసుకుని తింటే, చాలా రుచిగా ఉంటుంది. ఇష్టమైనవారు ఈ పచ్చడిని కొంచెం ఒక కప్పులోకి తీసుకుని, గట్టి పెరుగు కలిపి పైన పచ్చిమిరప, కొత్తిమీర తరుగు వేసుకుని తింటే, చాలా రుచిగావుంటుంది.

## ఉసిరి ఆవకాయ

### కావలసినవి

ఉసిరికాయలు - అరకిలో, కారం - 100 గ్రాములు, నూనె - ఒకటిన్నర కప్పు, మెంతులు - 4 చెంచాలు, ఆవాలు - 4 చెంచాలు, ఉప్పు - ఒక కప్పు, పసుపు - 2 చెంచాలు, ఇంగువ - ఒక చెంచా.

### తయారుచేసే విధానం

ముందుగా మెంతులు, ఆవాలు వేయించి, పొడి చేసుకుని పెట్టుకోవాలి. తరువాత అరకప్పునూనె వేడి చేసి, చిన్నమంటపై పెట్టి, కాయలకు కొంచెం గాట్లు పెట్టి, నూనెలో వేయించాలి. ఆ విధంగా వేయించి పక్కనపెట్టాలి. ఈ నూనె కొంచెం చల్లారిన తరువాత అందులో కారం కొంచెం వేయించి, స్టౌ ఆపుచేసి, కాయలలో పోసి, ఉప్పు, పసుపు, మెంతి, ఆవపిండిని వేసి బాగా కలిపి, మిగతా నూనె వేడిచేసి, ఇంగువ వేసి, కాచి, ఈ మిశ్రమంలో వేసి బాగా కలిపి, ఒకరోజు ఊరనిచ్చి, అన్నంలో వేసుకుంటే చాలా బావుంటుంది. ఇది నిల్వ కూడా వుంటుంది.





Printed and Published by O.Thomas on behalf of Deccan Chronicle Holdings Limited, Printed at Deccan Chronicle press at Plot No.9 Alwal Village, Vallabh Nagar Taluk, Malkajgiri Mandal, Rangareddy Dist., AP & Published at 36 S.D.Road, Secunderabad-500003, A.P.
Editor: T.Venkatram Reddy, Phone: 040- 27802346.




## గమనిక

ఈ పేజీకి ఫోటోలు పంపించేవారు ప్రతీ ఫోటో వెనుకా సభ జరిగిన తేదీ, అందులో వున్నవారి (ఎడమ నుంచి కుడికి) పేర్లు స్పష్టంగా రాసి పంపించాలి. మసకగా వున్న ఫోటోలు, ఎప్పుడో నెలల క్రితం జరిగిన సభల తాలూకు వివరాలు పంపవద్దని మనవి.



కరీంనగర్‌లో **అక్టోబర్ 21వ తేదీన** జిల్లా గ్రంథాలయ సంస్థ అధ్యక్షులుగా పదవీ బాధ్యతలు చేపడుతున్న ఏనుగు రవీందర్ రెడ్డి. చిత్రంలో తెలంగాణ గ్రంథాలయ వేదిక రాష్ట్ర అధ్యక్షులు ముదుగంటి సుధాకరరెడ్డి తదితరులను చూడవచ్చు.



విజయవాడలో **అక్టోబర్ 15వ తేదీన** అడిగోపుల వెంకటరత్నం రచించిన 'ముందడుగు' కవితా సంపుటిని ఆంధ్రప్రదేశ్ శాసన సభ ఉపసభాపతి డా.మండలి బుద్ధప్రసాద్ ఆవిష్కరించారు. వేదికపై చెవుల కృష్ణాంజనేయులు, రావెల సాంబశివరావు, సోమేపల్లి వెంకట సుబ్బయ్య, బి.హనుమారెడ్డి, పొన్నూరు వెంకట శ్రీనివాసులు, డా.డి.శమంతకమణి తదితరులున్నారు.



హైదరాబాదులో **అక్టోబర్ 14వ తేదీన** వేదగిరి రాంబాబు బాలసాహిత్య పురస్కారాన్ని దార్ల బుజ్జిబాబుకి తెలంగాణ ప్రభుత్వ సాంస్కృతిక సలహాదారు కె.వి.రమణాచారి అందచేస్తున్న దృశ్యం. చిత్రంలో వేదగిరి రాంబాబు, బందారు చినరామారావులను కూడా చూడవచ్చు.

అనంతపురంలో **అక్టోబర్ 14వ తేదీన** తెలుగు రక్షణ వేదిక ఆధ్వర్యంలో జరిగిన 33 గంటల 44 నిమిషాల 55 సెకన్ల ప్రపంచ రికార్డు కవిసమ్మేళనంలో రోహిణి మహేష్‌ను సత్కరిస్తున్న దృశ్యం.



